

"మా అత్తగారు, నగలు
తన కోసం కొనుక్కున్నా,
**మొట్టమొదట**
**నాకు అలంకరించి**
**అందం చూస్తారు."**

స్నేహంతో మెరిసే బంధం

**KHAZANA JEWELLERY**

www.khazanajewellery.com

భారత దేశమంతటా 41 స్టోర్లు - ఖజానా జ్యూవలరీ: హైదరాబాద్ - అబిడ్స్ రోడ్ - ఫోన్: 66829900 | సోమాజిగూడ - ఫోన్: 66639900 | కూకట్‌పల్లి - ఫోన్: 66314900 | A.S. రావు నగర్ - ఫోన్: 66619900 దిల్‌సుఖ్‌నగర్ - ఫోన్: 66461900 | చందానగర్ - ఫోన్: 23038900 • వైజాగ్ - ద్వారకా నగర్ - ఫోన్: 6672900 | గాజువాక - ఫోన్: 6673900 • విజయవాడ - ఫోన్: 6643900 • గుంటూరు - ఫోన్: 6633900 • కాకినాడ - ఫోన్: 6661900 • రాజమండ్రి - ఫోన్: 6656900 • భీమవరం - ఫోన్: 239901 • తిరుపతి - ఫోన్: 6644900 • నెల్లూరు - ఫోన్: 2354900 • వరంగల్ - ఫోన్: 2444900 • శ్రీకాకుళం - ఫోన్: 228901 • ఒంగోలు - ఫోన్: 227001 • ఖమ్మం - ఫోన్: 228900 • అనంతపురం - ఫోన్: 220900 • విజయనగరం - ఫోన్: 252900 • కడప - ఫోన్: 244456 • చెన్నై - టీ. నగర్ - ఫోన్: 24364501 | కథెడ్రల్ రోడ్ - ఫోన్: 28117046 | అన్నానగర్ - ఫోన్: 42631900 | పురసైవాక్కం - ఫోన్: 43523900 | మైలాపూర్ - ఫోన్: 43535900 | వేలచేరి - ఫోన్: 42163900 • కోయంబత్తూరు - ఫోన్: 4213900 • సేలం - ఫోన్: 4265900 • వెల్లూర్ - ఫోన్: 4300900 • కాంచీపురం - ఫోన్: 47201900 • పుదుచ్చేరి - ఫోన్: 4209900 • తిరునెల్వేలి - ఫోన్: 4210900 • కరూర్ - ఫోన్: 234900 • మదురై - ఫోన్: 4379900 • బెంగళూరు - కమర్షియల్ స్ట్రీట్ - ఫోన్: 41149900 | జయనగర్ - ఫోన్: 41539900 | మారతహళ్ళి - ఫోన్: 25400009 • మంగళూరు - ఫోన్: 4260900 • ఢిల్లీ - ఫోన్: 43675900. (అన్ని రోజులు షాపు తెరచి ఉండును)

ముఖాముఖి







# తెలుగు వెలుగు

సంపాదకుడు: రామోజీరావు

సంపుటి : 3 , సంచిక : 3

కార్తీక (24 అక్టోబరు-22 నవంబరు)
మార్గశిర (23 నవంబరు-22 డిసెంబరు)
మాసాలు, జయనామ సంవత్సరం

పుటలు: 100, వెల : రూ. 20

సహకారం: రామోజీ విజ్ఞానకేంద్రం

ప్రకటనల కోసం: +91 80081 51599
+91 90001 80608



**రచనలు పంపాల్సిన చిరునామా**
సంపాదకుడు, తెలుగువెలుగు, రామోజీ
ఫిల్మ్‌సిటీ, హయత్‌నగర్(మం.)
రంగారెడ్డి జిల్లా, తెలంగాణ - 501 512.

ఫోను: +91 8415 246 888
మొబైల్: +91 800 800 1656
+91 800 855 1842
ఫ్యాక్సు: +91 8415 305 018

ఈమెయిల్
teluguvelugu@ramojifoundation.org







**Telugu Velugu**
Owned, Printed, published and Edited by Ramoji Rao on behalf of Ramoji Foundation, Ramoji Film City, Hayathnagar Mandal, Ranga Reddy District, Telangana. Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally, Rangareddy District -500 072.
RNI No: APTEL/2012/45352




**విన్నపం:** తెలుగు భాషాభివృద్ధి, పరిరక్షణ 'తెలుగువెలుగు' ముఖ్య ఆశయాలు. మన భాషకు పుష్టి చేకూర్చే రచనలకు పత్రికలో అగ్రతాంబూలం లభిస్తుంది. ఈ రచనల్లో వెల్లడయ్యేవి రచయితల అభిప్రాయాలు మాత్రమేనని మనవి. ఇవన్నీ పత్రిక యాజమాన్యం, సంపాదకవర్గ అభిప్రాయాలు కానక్కర్లేదు. భిన్న భావజాలాలకు, మేధోమథనానికి నిష్పక్షపాత వేదికగా ఈ పత్రిక నిలుస్తుంది.



# అమ్మభాషే వికాసకేంద్రం

**పెద్దలమాట చద్దిమూట** అంటారు. విజ్ఞానఖనులు, అనర్ఘరత్నాలనదగ్గ అనుభవ సంపన్నుల నోట వెలువడే జీవనసత్యాలు వర్తమాన, భవిష్యత్ తరాలకు ప్రాతఃస్మరణీయాలు. మాతృభాషలో బోధన ప్రాముఖ్యాన్ని విశదీకరిస్తూ మాజీ రాష్ట్రపతి డాక్టర్ అబ్దుల్ కలాం చేసిన సూచనలు, వ్యాఖ్యలు ఆ కోవకే చెందుతాయి. విజ్ఞాన శాస్త్రాంశాలను అమ్మభాషలోనే బోధించడంవల్ల పాఠ్యాంశాల్ని విద్యార్థులు త్వరగా అర్థం చేసుకోగలరన్న కలాం- మాతృభాషలో చదువు, సృజనాత్మకతను విరబూయిస్తుందనడం స్వీయానుభవసారమే.

సముద్రపుటొడ్డున దొరికే గవ్వలు అమ్మి పొట్ట పోసుకునే పేద తండ్రి ఆరుగురు సంతానంలో కలాం ఒకరు. బంధువుల సాయంతో, ఉపకార వేతనాల ఆసరాతో పదో తరగతి వరకు మాతృభాషా మాధ్యమంలోనే చదివిన ఆయన అనంతరకాల ఎదుగుదల స్ఫూర్తిదాయక ఘట్టం. యావద్దేశం గర్వించదగ్గ క్షిపణి, అణుశాస్త్రవేత్తగా భాసించిన కలాం, దేశ అత్యున్నత పీఠాన్నీ అధిష్ఠించారు. ఆయన బహుముఖ వికాసానికి గట్టి పునాది మాతృభాషా మాధ్యమంలో ప్రాథమిక విద్యాభ్యాసమేననడంపై మరో మాటకు తావు లేదు.

'భారతరత్న' స్వయంగా ధ్రువీకరించారనే కాదు, ఇది దేశదేశాల్లో నిరూపితసత్యం. అమ్మభాషలో జ్ఞానబీజాలు విస్తృత ఫలాలందిస్తాయన్న ప్రగాఢ విశ్వాసమే జపనీయుల్ని, రష్యన్లను, జర్మన్లను, ఫ్రెంచివారిని, బల్గేరియన్లను మాతృభాషలోనే లోతైన శాస్త్రాధ్యయనానికి పురిగొల్పుతోంది. ఆంగ్లంపట్ల మోజు చూపకుండానే అద్భుత వైజ్ఞానిక ఆవిష్కరణలతో తమదైన ప్రత్యేకత చాటుకునే ప్రతిభావ్యుత్పన్నతల్ని మాతృభాషలో బోధనే వారికి అలవరుస్తోంది. సంక్లిష్ట గణిత సమస్యల పరిష్కరణలో, శాస్త్ర సాంకేతిక రంగ పరిశోధనల్లో వారి విశేష పురోగతికి స్ఫూర్తి, ప్రేరణ ప్రాథమిక చదువుల్లోనే ఉన్నట్లు పదేపదే నిరూపితమవుతోంది.

అన్య దేశీయులే కాదు, భరతమాత గర్వించదగ్గ ముద్దుబిడ్డల విజయగాథలూ తెలియజెబుతున్నది అదే యథార్థం. చిన్నప్పుడు కన్నడ మాధ్యమంలో చదివి 45 గ్రంథాలతోపాటు పద్నాలుగు వందల పరిశోధన పత్రాలు వెలువరించి విఖ్యాత శాస్త్రవేత్తగా ప్రశంసలందుకున్న ఇంకో 'భారత రత్న' ఆచార్య సీఎన్ఆర్ రావు విజయ ప్రస్థానాన్ని అబ్బురంగా పరికించాం. మాతృభాషలోనే బడి చదువు సాగించి, కళాశాలలో అడుగుపెట్టేదాకా ఆంగ్లమే రాకున్నా 'చంద్రయాన్' పథక సంచాలకుల హోదాలో వివిధ దేశాలకు చెందిన శాస్త్రవేత్తలకు నేతృత్వం వహిస్తున్న మేల్‌స్వామి అన్నాదురై ప్రావీణ్యం గురించి వింటున్నాం. ఈ ఉదంతాలన్నీ విశదీకరిస్తున్నది ఒకటే- మాతృభాషలో బోధనతో పునాది గట్టిపడుతుంది!

పేగుబంధం జోలికి పోకుండా అన్యభాషనే నేర్చినవారితో పోలిస్తే- అమ్మభాషతోపాటు అన్యభాష(లు) అభ్యసించినవాళ్లు పోనుపోను రాటుతేలి వృత్తి ఉద్యోగ వ్యాపకాల్లో కీలక స్థానాలు ఆక్రమించగలుగుతున్నట్లు అంతర్జాతీయ పరిశోధనల ఫలితాలు రుజువు చేస్తున్నాయి. అర్ధంతరంగా చదువు మానేస్తున్నవారిలో మాతృభాషా మాధ్యమానికి నోచని పిల్లల సంఖ్యే అత్యధికమన్న విశ్లేషణలు ఎనిమిది నెలలక్రితం వెలుగుచూశాయి. మాతృభాషలో ప్రాథమిక విద్యాబోధన అత్యుత్తమమని 1953నుంచే 'యునెస్కో' మొత్తుకుంటోంది.

కొన్నేళ్లుగా పుట్టినింటే తెలుగుభాష విషమపరిస్థితిని ఎదుర్కొంటోంది. అధికార భాషగా వెలుగులీనాల్సింది పోయి, కళాకాంతులు కోల్పోతోంది. ఇటువంటప్పుడు రెండు తెలుగు రాష్ట్రాల్లోని ప్రభుత్వాల విహిత కర్తవ్యం ఏమిటో వేరే చెప్పనక్కర్లేదు. అంతటా తెలుగు కనిపించేలా వినిపించేలా చూస్తామన్న ప్రపంచ మహాసభల తీర్మానాల స్ఫూర్తి వట్టిపోకుండా విస్పష్ట కార్యాచరణతో అవి ముందడుగేయాలి. ప్రాథమిక చదువుల్లో తెలుగు పరిఢవిల్లడం, ఎన్నో సమస్యలకు ఉమ్మడి పరిష్కారం.

మాతృభాషలో బోధనవల్ల, మురిపాల తెలుగు నాలుగుకాలాలపాటు నిలబడుతుంది. జాతి ఉనికిని సగర్వంగా నిలబెడుతుంది. మన సంస్కృతీ సంప్రదాయాల వారసత్వ సంపదకు రక్షాకవచమవుతుంది!

అందుకే- తెలుగును రక్షించుకుందాం. మన ఉనికిని కాపాడుకుందాం!

రామోజీరావు




**లోపాలపుట్ట**

ఇటీవల బీభత్సాన్ని సృష్టించిన 'హుద్‌హుద్' తుపాను పేరును ఒకో తెలుగు దినపత్రిక ఒక్కోలా ప్రచురించింది. అరబ్బీ భాషలో ఉన్న ఈ పదాన్ని ఆంగ్లం నుంచి మన భాషలోకి అనువదించారు. ఆంగ్ల భాష ఉచ్చారణకు ఉన్న పరిమితుల వల్లే 'హుద్‌హుద్' తెలుగులోకి వచ్చేసరికి నానారూపాల్లో కనిపించింది. ఆంగ్లంలోని 'ఎ'ను 'అ'/'య'గా పలకవచ్చు. 'యు'ను 'అ'/'ఉ'గా పలుకుతారు. ఇలాంటివి కోకొల్లలు. ఇక 'ద' శబ్దాన్ని రాయడానికి ఆంగ్లంలో అక్షరమే లేదు. ఇన్ని లోపాలున్న భాషను నెత్తినపెట్టుకోవడంలో అర్థముందా? ఉచ్చారణ విషయంలో తెలుగే మిన్న.

**-డి.సికందర్ బాషా, ఆదోని, కర్నూలు**

**మాతృభాష వస్తే కదా...!**

ప్రభుత్వ విద్యావ్యవస్థ దయనీయతను 'విఫల ప్రయోగంలో బలిపశువులు' వ్యాసం ఎత్తిచూపింది. ఆంగ్లమాధ్యమ విద్యార్థులకు కనీసస్థాయి తెలుగు కూడా రావట్లేదు. అలా అనీ ఆంగ్లమూ పూర్తిస్థాయిలో అబ్బట్లేదు. మాతృభాష బాగా వస్తే కదా... పర భాషలు అర్థమయ్యేది.

**- టి.ఎ.విశాలాక్షి, హైదరాబాదు**

**చక్కని కథ**

ఆత్మస్థైర్యం, నిజాయతీ ఉంటే జీవితంలో ప్రతి మనిషీ ఎదుగుతాడని చెప్పే కథ 'నిజాముద్దీన్‌లో ఓ సాయంకాలం'. నిజజీవిత దృశ్యాలను కళ్లకు కట్టినట్లు చూపారు రచయిత.

**- ఎల్.రాజేశ్వరరెడ్డి, గంభీరావుపేట, కరీంనగర్**

**- జలగం భరత్, శ్రీకాళహస్తి**

**అందరి బాధ్యత**

సెప్టెంబరు సంచిక సంపాదకీయం బాగుంది. మాతృభాషను కాపాడుకోవాల్సిన అవసరాన్ని నొక్కిచెప్పింది. అమ్మభాషా పరిరక్షణ తెలుగువాళ్లందరి కర్తవ్యం.

**- శివలెంక చంద్రశేఖర్, హైదరాబాదు**

**ఆయన చిత్రం అద్భుతం**

అక్టోబరు సంచిక ముఖచిత్రం భావస్ఫోరకం. బాపు ముఖచిత్రంతో 'తెలుగు వెలుగు' తన సాహిత్య, కళాభిలాషను చాటుకుంది. ఆ బొమ్మల బ్రహ్మ విశేషాలను అందించిన గొల్లపూడి, రావి కొండలరావు, శ్రీధర్‌ల వ్యాసాలు, 'వార్తల్లో తెలుగు నిండార వెలుగు', 'వర్తమానానికి ప్రతీక', 'దీనికో లెక్కుంది', 'ఏటికేతంబట్టి' బాగున్నాయి.

**- ముక్కెర రమేశ్‌చంద్ర, గుర్రంపేట, వరంగల్;**

**- వి.భవానీశంకర్, సికిందరాబాదు;**

**- మజుందార్, సికిందరాబాదు**

**ఇలా అయితే ఎలా?**

ఆనాడు రాజుల ఆదరణ వల్ల కవిలోకం వర్ధిల్లేది. ఫలితంగా సాహిత్యమూ వెలుగులీనింది. నేడు ప్రభుత్వాలేవీ ఆ పని చేయట్లేదు. ఆదరించకపోతే ఏ కళా వృద్ధి చెందదన్న విషయాన్ని గుర్తుపెట్టుకోవాలి. మరోవైపు... నేటి విద్యావ్యవస్థ నుంచి తెలుగు సాహిత్యం, ముఖ్యంగా పద్యాలు క్రమేపీ కనుమరుగవుతున్నాయి. ఇలా అయితే మన భాష ఎలా బతుకుతుంది?

**- యర్రాబత్తిన మునీంద్ర, నాయుడుపేట, నెల్లూరు**

**అ... ఆ...**

అమ్మభాషను ఆదరించండి అన్న రామోజీరావు సంపాదకీయం ఆలోచనాత్మకం. తెలుగు మాధ్యమంలో చదివి ఉన్నత శిఖరాలు అధిరోహించిన వారి గురించి వ్యాసాలివ్వాలి.

**- సూర్యదేవర గిరిజాప్రసాద్, తిరుపతి,**

**- జి.ఎల్.పంచాశిత్‌రెడ్డి, నిజామాబాదు,**

**- పి.చంద్ర, కాకినాడ**

**నామోషీ ఎందుకు?**

తెలుగు భాషాభివృద్ధికి యువతే ముందడుగు వేయాలి. తమిళులు ఎంత ఉన్నత విద్యను అభ్యసిస్తున్నా వారి కట్టూబొట్టూ, మాతృభాషలను మర్చిపోవట్లేదు. మనకేమో తెలుగుదనాన్ని ప్రదర్శించడానికి నామోషీ. మనం మాట్లాడకపోతే మన భాషను ఇంకెవరు మాట్లాడతారు?

**- మడాల రామకృష్ణ, చాగల్లు, ప.గో.జిల్లా**

**కవితలకు ఆహ్వానం**

మల్లెతీగ పురస్కారానికి కవితలు పంపాలని మల్లెతీగ సాహిత్యవేదిక (విజయవాడ) ఆహ్వానిస్తోంది. ఆఖరుతేది: నవంబరు 15; వివరాలకు: 92464 15150 (కలిమిశ్రీ)

**మనోగతం**

మాతృభాష ఆవశ్యకత
అబ్దుల్‌కలాం మేల్‌స్వామి
మనోగతాలు మేధోమథనాలు
తెలుగన్నలకు మెత్తని మందలింపులు!

బొమ్మల బ్రహ్మ బాపు
స్ఫూర్తిమంతాల మరోరూపు
చిత్రసీమలో రెక్కల కుంచె
వెండితెర కాన్వాసై రమించె!

మరాఠీకి ముత్యాలదండ
లోపించె తెలుగుకు పాలక అండ
టీవీలు వార్తాపత్రికల స్థాయి
కీర్తికిరీటంలో కలికితురాయి!

ఒక్కో అంశం రూపుదాల్చు ప్రధానాంశం
తెలుగుల పాలిట వరం 'తెలుగు వెలుగు'
ప్రతి సంచికా వెలుగు జిలుగు
పాఠక లోకానికి మేలి మెఱుగు!

**- పుల్లూరు రామకృష్ణయ్య,**
**శ్రీకాళహస్తి, చిత్తూరు జిల్లా**

**ఆ తాపత్రయమెందుకు?**

'అక్షరానికి మైమఱువు' వ్యాసం బాగుంది. మన భాషలో ఎక్కువ అక్షరాలు ఉండటం వల్లే పదాలన్నీ స్పష్టంగా ఉచ్చరించ గలుగుతున్నాం. ఆంగ్లం నేర్చుకున్న వాళ్లలో చాలామంది ఆంగ్ల పదాల్ని సరిగా ఉచ్చరించలేరు. మన ఆంగ్లం విదేశీయులకు, వాళ్ల భాష మనకూ అర్థం కావట్లేదు.

**- పి.శాండిల్య, కాకినాడ**

**చక్కని సంప్రదాయం**

సమీక్షార్థం పుస్తకాలను పంపిన రచయితలకు... సమీక్ష ప్రచురితమైన తర్వాత 'తెలుగు వెలుగు' పత్రిక ప్రతిని పంపడం సరికొత్త సంప్రదాయం. రచయితలకూ గౌరవప్రదం.

**- డా॥ కాసల నాగభూషణం, చెన్నై**

**మనవి:** తెలుగు వెలుగుపై మీ స్పందనను 800 800 1656, 92463 99299 నంబర్లకు ఎస్సెమ్మెస్ చేయవచ్చు. ఫేస్‌బుక్‌లో కూడా నమోదు చేయవచ్చు.

**నీ నేనుగా** ఉండిపోవాలనుకుంటున్న సాహిత్య రాస్తున్న లేఖ. ఇదేం సంబోధన అని ఆశ్చర్యపోతున్నావా? ఈ ఉత్తరం చదవకుండా చింపేసినా, నా హృదయం మొదటి మూడు పదాల్లోనే నీకు కనిపిస్తుందని ఆశ. నా మనసులో ఇంకా ఏం దాగి ఉందో చదవడానికి ముందుకెళ్తున్న నీ హృదయాన్ని ఓ మన్నింపుకోరాలి. ఇంత వరకూ ఒక్కసారైనా మాటాడని నిన్ను 'మీరు'గా పిలవలేకపోతోంది నా మనసు. కారణం అడిగితే నువ్వే తన ప్రాణమంటోంది. ఏడాదిగా ప్రతి ఉదయం, సాయంత్రం మీ కాలేజ్ రావిచెట్టు కింద నీ కోసం అనుక్షణం వెతికే నీ నేను సుపరిచితమే. అదంతా సరే! ఇలా ఉత్తరం రాయడమేంటనుకుంటున్నావా?
నీతో మాట్లాడాలి. నా ప్రేమ నీతో చెప్పుకోవాలి. ఎన్నో ఉత్తరాలు రాసి నీకు ఇవ్వలేకపోయాను. అర్థం చేసుకుంటావో లేదోనన్న భయం. కాని నిన్న వర్షపు మెరుపులో నీ దరహాస లేఖ చదివి, నా హృదయం నీ ముందు పరిచే ప్రయత్నం చేస్తున్నా... ఆలకించి ఆదరించవా...

ఓసారి గోదారి గట్టున నేను నించున్నప్పుడు కార్తీక సంజెలో దీపాలకు కాంతులద్దుతున్న చెలి దర్శనం...

**గోదారి అలల కదిలిక కదలక నిలబడి**
**ముంగురుల నాట్యం తిలకిస్తుండగా...**
**కొండల మధ్యకు జారుకున్న సంధ్య**
**నుదుటి తిలకం చూసి భ్రమిస్తుండగా...**
**పూలసజ్జనమరిన కుసుమాలు**
**అధర గులాబీల జతనడుగుతుండగా...**
**రవళించిన వెన్నెల చినుకా!**
**హిమాభిషేకిత తులసివా...**
**తుషారపూజిత రాజీవానివా...**
**కుంకుమార్చిత ప్రత్యూషానివా...**
**సమీరలాలిత స్రవంతివా...**
**ఎవరివో కాని**
**దివ్వెలదీవిలో దివ్యంగా వెలసి**
**గుండెగుడిలో సడి చేశావు సుమా...**

నాన్నతో గుడికెళ్లటం, తమ్ముడితో ఆడుకోవడం, అమ్మఒళ్లో హాయిగా నిద్రపోవటం... ఇలా నిశ్చల తటాకంలా ఉన్న నా జీవితంలో నీ దర్శన ప్రకంపనం.. అలల అలలుగా విస్తరిస్తూంటే దారుణంగా చలించిపోతున్నా!

నలుగురితో కలిసి నవ్వుకుంటుంటే నువ్వు గుర్తుకొచ్చి మనసు గుచ్చుకుంటోంది. ఉదయం లేచి వేదం చదువుతుంటే, ఆ భావం నీలా తోచి మది బరువెక్కుతోంది. సంధ్యవేళ దాటుతోంటే హృది నీ రాగం పాడమని వేడుకుంటోంది. నింగిలోని పున్నమిని చూస్తే నీ కళ్లలోకి చూసినట్టుంది. విసుగేసి నిదురపోబోతే స్వప్నలోకం నిన్ను స్వాగతిస్తోంది. నాకేమవుతోంది? చదువంటే నాకు ప్రాణం. నువ్వు నా ప్రాణంగా మారావని అలిగి అది నాతో స్నేహించటం మానేసింది. తనతో మునుపటిలా మాట్లాడటం లేదని మా చెల్లి మూతి ముడుచుకుంది. పరధ్యానం పెరిగిందని నాన్నకు చిరాకు. నాకేదో అయ్యిందని అమ్మకు భయం.
స్వర్గధామం లాంటి జీవితం చెదిరిన కలలా మారుతుంటే కారణమైన నిన్ను మనసులోంచి చెరిపేయాలనుకున్నాను.

**మరవటమెలాగో రోజంతా ఆలోచించి**
**ఎలాగయినా మరవాలని నిశ్చయించి**
**ఏ నడిరేయో నిదరోతే..**
**తెల్లారగట్లే కల్లోకొచ్చి**
**అమాయకంగా పలకరిస్తే**
**నేనేం చెయ్యను... నిన్నెలా మరవను?**

అర్చితా! నీ అందం చూసి విచలితుడినయ్యానా? ఊహు.. నీ ముఖంలో అందంకంటే గొప్పదైన అనుభూతి. ఆ కళ్లలోకి చూస్తూ హృదిఫలకంపై కలల కావ్యం రాయాలనుంది. మనసే కలంలో ఆశలరంగులు నింపుకురానా?

నీ ముంగురుల మాటున నేను సిందూరం కావాలనుంది. నీ నీలినయనాలకు నీలిమనవ్వాలని ఉంది. నీ నుదుటిపై మెరిసే కుంకుమ భాగ్యమవ్వాలనుంది. కోటేరుముక్కుకు మంచుముక్కైరనవ్వాలనుంది. పెదవి మీద చిరుచినుకు నవ్వాలనుంది. పట్టుపువ్వుగా మారి పసిపాదాలపై నిదురోవాలనుంది. నాకు జీవితాన్ని పంచవా!

చేతనైనంతలో నా భావాన్ని తెలిపే ప్రయత్నమిది. భాషకందని మమతానుబంధం నీ నవ్వంత మెత్తగా, నీ చూపంత చల్లగా గుండెమాటున గూడుకట్టుకొని, నీ చేతి స్పర్శతో పునీతమవ్వాలని ఆరాటపడుతోంది. ఆలకించి ఆదరించుమా ప్రాణమా!!!

'నీ'
నేను

**మామిళ్ళపల్లి కృష్ణకిశోర్ శర్మ,**
పారుమంచాల, కర్నూలు, 97018 68171



# అయ్యో! తెలుగు చదువుతున్నారా...!

**తెలుగు భాష మీద అభిమానం, మక్కువతో ఉన్నతస్థాయిలో తెలుగు చదువుతున్న వారిని సమాజం చిన్నచూపు చూస్తోంది. 'అరెరె... తెలుగు చదువుతున్నావా?' అని జాలిపడుతోంది. దీనికి కారణం... వారికి ఉపాధి, ఉద్యోగ అవకాశాలు పెద్దగా లేకపోవడమే.**

**రెండు** తెలుగు రాష్ట్రాల్లోనూ సుమారు పదిహేను ప్రాచ్య (ఓరియంటల్) కళాశాలలున్నాయి. వీటిలో ప్రీ డిగ్రీ, డిగ్రీ కలిపి (భాషా ప్రవీణ/ విద్యా ప్రవీణ) కోర్సు ఉంటుంది. ఏదైనా కారణం వల్ల ఇంటర్‌తో సమానమైన రెండేళ్ల ప్రీ డిగ్రీ చదివి మధ్యలో మానేస్తే ఆ ధ్రువపత్రాలు దేనికీ పనికిరావు. కాబట్టి అయిదేళ్లు కచ్చితంగా తెలుగు/ సంస్కృతం చదవాల్సిందే. ఏదో రకంగా ఆ కోర్సులు పూర్తి చేసినా ఉద్యోగావకాశాలూ తక్కువే.

కానీ ఇంటిగ్రేటెడ్ ఎమ్మెస్సీ, బి.ఎ.ఎల్.ఎల్.బి. వంటి కోర్సులు మూడేళ్లు చదివి ఆపేసినా ఆ విద్యార్థులు మరో కోర్సులో చేరేందుకు అవకాశం ఉంటుంది. ఓరియంటల్ కోర్సు చేసిన వారికి అదీ లేదు.

ఓరియంటల్ కోర్సుల్లో చదివిన డిగ్రీ, అన్ని విశ్వవిద్యాలయాల్లో ఉన్న బీయ్యేతో సమానమే. అందరిలాగే ఆంగ్లం, చరిత్ర చదువుతారు. కానీ బి.ఎడ్.లో చేరేందుకు అవకాశం లేదు. వీళ్లకి ఉన్న ఒకే ఒక్క అవకాశం తెలుగు పండిత శిక్షణ (తె.పం.శి.) పొంది ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించడం.

**మేమూ చదివాం... కానీ?**

తెలుగు పండిత శిక్షణకు, బి.ఎడ్. విద్యార్థులకు సిలబస్ ఇంచుమించు సమానం. వాళ్లలానే మనోవిజ్ఞానశాస్త్రం (సైకాలజీ), తత్వశాస్త్రం (ఫిలాసఫీ), పాఠశాల విద్య (స్కూలు ఎడ్యుకేషన్), విద్యా సాంకేతిక శాస్త్రం (ఎడ్యుకేషన్ టెక్నాలజీ) వంటి అంశాలు 'తె.పం.శి.'లోనూ చదువుతారు. కానీ ఇద్దరికీ సమాన ఉద్యోగావకాశాలు ఉండట్లేదు!

బి.ఎడ్. చేసినవారు వసతిగృహ సంక్షేమాధికారులు (వార్డెన్)గా కావడానికి అవకాశం ఉంది. 'తె.పం.శి' పొందిన వారు అందుకు పనికిరారు! ప్రభుత్వం భర్తీ చేస్తున్న సీఆర్టీ (క్లస్టర్ రిసోర్స్ టీచర్స్) ఉద్యోగాల్లోనూ బి.ఎడ్. వారికే అవకాశం! 'తె.పం.శి' అభ్యర్థుల నుంచి దరఖాస్తులే స్వీకరించట్లేదు.

టెట్ పరీక్షలోనూ తెలుగు పండితులకు అన్యాయమే జరుగుతోంది.

బి.ఎడ్... సోషల్, సైన్సు మెథడాలజీలు 60 మార్కులు, తెలుగుకు 30 మార్కులు కేటాయించారు. తెలుగు పండితులు 30 మార్కులతో పాటు అదనంగా 60 మార్కులకు సోషల్/గణితం/ సైన్స్ చదవాలి. దీంతో మార్కులు తగ్గి తెలుగు పండితులు డీఎస్సీకి అర్హత సాధించలేకపోతున్నారు.

బి.ఎడ్. చదివినవారు ఎమ్.ఎడ్. చేస్తే డైట్, బి.ఎడ్. కళాశాలల్లో అధ్యాపక ఉద్యోగాలు లభిస్తున్నాయి. కానీ తెలుగు పండితుల ఉన్నతవిద్య పండిత శిక్షణతోనే ముగుస్తుంది. చివరికి 'తె.పం.శి.' కళాశాలల్లో కూడా ఎమ్.ఎడ్. చేసినవారే తెలుగు, తెలుగు బోధనా పద్ధతులను బోధిస్తున్నారు.

తెలుగు పండితులకు మాత్రం స్కూలు అసిస్టెంట్లు, గ్రేడు-2 పండితులని విభజిస్తున్నారు. ఉన్నతీకరిస్తామని కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వం ప్రకటించినా దస్త్రం బల్లపైనే ఆగిపోయింది.

తెలుగేతర ఉపాధ్యాయులు కేవలం విషయ జ్ఞానం అందిస్తారు. కానీ తెలుగు ఉపాధ్యాయులు సామాజిక, నైతిక విలువలూ బోధిస్తారు. మన సంస్కృతీ సంప్రదాయాలను భావితరాలకు అందిస్తారు. వారిని కాపాడుకోవడం జాతి అస్తిత్వానికి అవసరం.

**ఈ సమస్యలు తీరాలంటే**

- తెలుగు పండిత ఉద్యోగాలు కేవలం తెలుగు పండిత శిక్షణ పొందిన వారికే ఇవ్వాలి. లేకపోతే 'సగానికి పైగా రిజర్వేషన్లు' కల్పించాలి.
- బి.ఎడ్. చేసిన వారికి ఎం.ఎడ్ ఉన్నట్లే తె.పం.శిక్షణ పొందినవారికి ఎం.టిపిటి కోర్సు ప్రవేశ పెట్టాలి/ ఎం.ఎడ్. చేసే అవకాశం కల్పించాలి.
- ఓరియంటల్ కళాశాలల్లో చదివిన వారికి ఇతర డిగ్రీలు చేసిన వారితో సమానంగా అన్ని అవకాశాలూ కల్పించాలి. ప్రీ డిగ్రీ కోర్సు చదివిన వారికి డైట్‌సెట్‌తో పాటు ఇంటర్మీడియట్ అర్హత కలిగిన అన్ని ప్రవేశ, ఉద్యోగ అవకాశాలు కల్పించాలి.
- గ్రేడు- 2 పండితులుగా పని చేస్తున్న వేలాది ఉపాధ్యాయుల హోదాలను వెంటనే ఉన్నతీకరించాలి.

- **అల్లు గణేష్**, విశాఖపట్నం
ganesshallu@gmail.com



# గుప్పెట్లో స్వర్గం

తాతయ్య పిలుపుతో ఉద్యోగానికి సెలవిచ్చి సొంత ఊరొచ్చాడు శేఖర్..
ఆ ప్రశాంతతలో... సంపాదనకి తృప్తికి సంబంధం లేదనీ,
ప్రేమించే తోడుంటే స్వర్గం గుప్పెట్లోకొస్తుందనీ తెలుసుకున్నాడా?





మా నాన్న తహశీల్దారుగా వేరే ఊళ్లో పని చేస్తున్నారు. నేను గత కొన్ని సంవత్సరాలుగా మహానగరంలో సాఫ్ట్‌వేర్ ఇంజినీరుగా పని చేస్తున్నాను. ముప్పై ఏళ్ల దగ్గర పడుతున్నా బ్రహ్మచారినే. అసలు పెళ్లి గురించి ఆలోచించే తీరిక లేదు నాకు. పగలూ రాత్రీ తేడా లేకుండా పని. అర్ధరాత్రి దాకా పరదేశం పనులు కంప్యూటర్ మీద చేస్తూనే ఉండాలి. చాలాసార్లు తెల్లారి మూడు గంటలకి కూడా పని చేస్తూనే ఉంటాను. చాలీచాలని నిద్రతో నీరసంగా లేచి, గబగబా తెమిలి తొమ్మిది గంటలకల్లా ఆఫీసుకి వెళ్లాల్సి వస్తుంది. ఏ రోజూ రాత్రి ఎనిమిది గంటల లోపల ఇంటికి రావడం కుదరదు. ఉదయపు ఉషఃకాంతులుగానీ, సంధ్యాకాలం పిల్లగాలులు కానీ అనుభవించే అదృష్టం లేదు నాకు. తెల్లవారితే ఉద్యోగ విషయాల ఆలోచన, రాత్రి ఇల్లు చేరితే పరదేశాలతో ఉద్యోగ సంబంధాల తలబరువూ తప్ప వేటికీ సేపు లేదు. నాలుగేళ్లక్రితం చిన్న ఫ్లాటు కొనుక్కున్నాను. అది అమ్మి పెద్దది కొనాలని శతవిధాలా ప్రయత్నిస్తున్నాను. ఈ మధ్యనే నా చిన్నకారు అమ్మి పెద్దది కొన్నా. బాధ్యతలేమీ లేవు. అక్క పెళ్లి అయిపోయింది. నాన్నగారు ఇంకా ఉద్యోగం చేస్తూ ఉండటం వల్ల, జీతం రాగానే వారికి కొంత పంపాలన్న ఆలోచనే రాదు నాకు. నా జీతం నాకిష్టమొచ్చినట్లు ఖర్చు పెట్టుకోవచ్చు! అలా అని ఖర్చు మనిషిని మాత్రం కాను.

ఎంత సంపాదించినా ఏదో వెలితి! సమయానుకూలంగా మారే కోరికలు. అందుకే పెళ్లంటే ఇష్టపడటం లేదు నేను.

"పెళ్లి చేసుకోవటానికీ, పిల్లలు కనడానికి ఒక వయసంటూ ఉంటుంది, వయసుతో ప్రమేయం లేకుండా తక్కినవన్నీ ఎప్పుడో అప్పుడు అమరుతాయి. అయినా నారు పోసిన వాడు నీరు పోస్తాడో" అని నిట్టూరుస్తుంది అమ్మ.

"నారూ నీరూ కూడా నేనే పోయాలి మరి, అందుకే పెళ్లి వద్దంటున్నాను" అని పెళ్లి ప్రసక్తి తోసిపుచ్చాను.

పోయిన ఆదివారం మా తాతయ్య నుంచి ఫోన్. "శేఖర్! నిన్ను చూడాలని ఉందిరా నాన్నా. నువ్వొచ్చి సంవత్సరం అయింది. ఓ వారం సెలవు పెట్టి మన ఊరికి రారా.. నీకూ కాస్త విశ్రాంతీ, ప్రశాంతతా.." అన్నారు తాతయ్య.

"పని చాలా ఉంది. సెలవు దొరుకుతుందో లేదో, అయినా ప్రయత్నిస్తా" అన్నా మాట కాదనలేక.

నాకు చిన్నప్పటి నుంచి తాతయ్య అంటే అభిమానం. తాతయ్యతో క్రికెట్ ఆడటం, డాబా మీద గాలిపటాలు ఎగరేయటం, ఆయన చెప్పే కథలు వింటూ పడుకోవడం ఇప్పటికీ నాకు తాజా జ్ఞాపకాలే.

ఇప్పుడు తాతయ్యకి 80 ఏళ్లు పైబడ్డాయి. తన పనులు తను చేసుకోవడం కష్టమవుతోంది. చేతికర్ర లేకుండా నడవలేరు. కంటికి చెయ్యి ఓరగా పెట్టుకుంటేగానీ చూపానదు. ఈ మధ్య నాన్న బలవంతం మీద పళ్లు కట్టించుకున్నారు. పగటిపూట కూర్చున్న



పడక కుర్చీ మీదే సుఖంగా నిద్రపోతారు. రాత్రిపూట నిద్రరాక పక్క మీద అటూఇటూ కదులుతూ ఉంటారు.

బామ్మ ఉన్నప్పుడు ఇద్దర్నీ చూస్తుంటే ఎంతో ముచ్చటగా ఉండేది. వసారాలో కాఫీ తాగినా, టేబుల్ దగ్గర భోజనం చేసినా ఇద్దరూ కలిసే చెయ్యాలి. సాయంత్రం అయ్యేసరికి, జరీచీర కట్టుకుని కొప్పులో పూలు పెట్టుకొని, ముస్తాబయ్యేది బామ్మ. తాతయ్య కూడా జరీ అంచు పంచె కట్టుకుని తెమిలేవారు. ఇద్దరూ కలిసి గుడికో, చుట్టాల ఇంటికో వెళ్లి వచ్చేవారు. భోజనాలయ్యాక, నిద్రొచ్చే వరకూ డాబా మీద కూర్చుని కబుర్లు చెప్పుకునేవారు. వాళ్లకి వాళ్లిద్దరూ తప్ప మరో మనిషి అక్కర్లేదు. ఇల్లే వాళ్ల స్వర్గం.

కానీ బామ్మ ఏడాదిక్రితం పోయింది. దాంతో తాతయ్య ఒంటరి అయిపోయారు.

'మా దగ్గరికి వచ్చి ఉండండి' అని అమ్మా నాన్నా చాలా బతిమిలాడారు. "సీతని ఇక్కడ వదిలి నేను ఎక్కడికీ రాను" కచ్చితంగా అన్నారు తాతయ్య. ఆ మాటకి మేమందరం కన్నీళ్ల పర్యంతం అయ్యాం.

ఆయనకి బామ్మ తన చుట్టుపక్కల ఉన్నట్లే అనిపిస్తుంది. ఆయన మనసుని కష్టపెట్టదలచుకోక, ఊళ్లోనే ఉండటానికి ఒప్పుకున్నాం. ఎవరికి వీలైతే వాళ్లు ఊరెళ్లి చూసి వస్తున్నారు తాతయ్యని.

తాతయ్య ఫోన్ తర్వాత నాకూ ఊరి మీదకు గాలి మళ్లింది.

ఆ రోజు ఆఫీసులో ఓ వారం సెలవు కావాలని అడిగాను.

"అర్జంటు పనులున్నాయి కదా, ఇప్పుడు సెలవుపెడితే ఎలా" అన్నాడు మేనేజరు.

"ఇంటి నుంచి పని చేస్తాను సార్"... నా గొంతు ప్రాధేయపడింది. సాఫ్ట్‌వేర్ ఉద్యోగంలో ఇదో సౌలభ్యం.

"సరే అయితే, సెలవులో ఉన్నాను కదా అని పని అశ్రద్ధ చేయకు" అని హెచ్చరించారాయన.

"సెలవులో పనేమిటి? పని చేస్తుంటే సెలవు కాదుగా మరి!" అనుకున్నా మనసులో, పైకి "సరే సార్" అన్నా.

ఆ రోజు ఇంటికి వెళ్తూ తాతయ్యకి, ఇంట్లో పనివాళ్లకీ బహుమతులు కొన్నాను. ఇంటికెళ్లి భోజనం చేసి, సామాన్లు సర్దుకుని ఊరికి వెళ్లడానికి నా కారులో బయల్దేరాను.

తెల్లారి ఉదయం ఆరింటికి ఊరి పొలిమేర చేరాను. నా ముందు ఓ పాత టెంపో వెళ్తోంది. దాని డ్రైవరు గట్టిగా జనపదాలు పాడుతూ, తీరిగ్గా నడుపుతున్నాడు. నేను ఎంత హారన్ కొట్టినా వెళ్లటానికి సందివ్వలేదు. ఓ అరగంట ప్రయాసపడితేగానీ, ఆ టెంపోని దాటలేకపోయా. ఇరుకు సందులూ, మురికి కాలువల మధ్యలో కారు నడపటానికి స్థలమే లేదు. టెంపో ముందర కారాపా. "ఏం హారన్ వినపడటం లేదా? చెవుడా?" అన్నా కోపంగా.

"బానే వినపడింది, అయినా ప్రాణం కంటే వేగం ముఖ్యం కాదుగదా" డ్రైవరు చిన్నగా నవ్వుతూ అన్నాడు. అతనితో వాదించి లాభం లేదని, కారు వేగం పెంచా.

'మహానగరంలో అయితే రకరకాల వాహనాలు, మనుషులు, పశువులు, ఒకరినొకరు పట్టించుకోకుండా, సందు దొరికించుకు మరీ దూసుకుపోతూ ఉంటారు. వేగం ప్రధానం. అందుకే తరచూ ప్రమాదాలు జరుగుతాయి మరి', ఏంటిలా ఆలోచిస్తున్నాను.. 'టెంపోవాడి మాటలు నాకు బాగా ఎక్కినట్లున్నాయి!'... నవ్వుకున్నా.

ఇల్లు చేరేప్పటికి ఏడయ్యింది.

ఇదివరకులా తాతయ్య వసారాలో కాఫీ తాగుతూ కనిపించలేదు. బామ్మ లేనిలోటు కొట్టొచ్చినట్లు కనిపించింది. గేటు తీసిన చప్పుడుకి 'ఎవరక్కడ?' అంటూ పరుగున వచ్చాడు వెంకన్న.

"శేఖర్‌బాబా! ఎన్నాళ్లకి! బాగా చిక్కిపోయారు బాబూ! ఉండండి, అయ్యగారిని లేపుతాను" అని హడావుడిగా వెళ్లబోయాడు.

"తాతయ్య ఇంకా లేవలేదా?" అడిగాను ఆశ్చర్యంగా.

"అమ్మగారు పోయాక ఆయన ఆరు గంటలకి లేవటం, కాఫీ తాగడం మానేశారు బాబూ" అన్నాడు వెంకన్న బాధగా.

"నేను తాతయ్యను లేపుతా, నీ పని చూసుకో" అని తాతయ్య గదిలోకి వెళ్లా.

'తాతయ్యా!' అంటూ ఆయన భుజం తట్టా, కళ్లు తెరిచినా గది చీకటిగా ఉండటంతో, ఆయనకి చూపానలేదు. లైటు వేశా. కంటికి చెయ్యి వోరగా పెట్టుకుని, 'ఎవరూ?' అని పరిశీలనగా చూసి "వచ్చావట్రా కన్నా! ఎన్ని రోజులయిందిరా నిన్ను చూసి!" అని నన్ను దగ్గరికి తీసుకున్నారు తాతయ్య. మా ఇద్దరి కళ్లూ మసకబారాయి!

"మీరు రమ్మంటే, రాకుండా ఉండగలనా తాతయ్యా" అన్నా ఆప్యాయంగా.

అంతలో వెంకన్న వచ్చి, చెయ్యి అందించి తాతయ్యని లేపి పక్కనున్న కుర్చీలో కూర్చోబెట్టాడు.

## పిలుపు

రాక పిలుపు

**ఆరుద్ర లేఖలు**

**సన్నిధానం నరసింహశర్మకు రాసినవి**

**పొత్తం విడుదల సభ**

వేదిక: షోయబుల్లా ఖాన్ హాల్, సుందరయ్య విజ్ఞాన కేంద్రం, బాగ్‌లింగంపల్లి, తేది: 28 సెప్టెంబర్ 2014, (ఆదివారం) సా॥ 5.30 గంటలకు

గద్దెపెద్ద

శ్రీ సతీష్ చందర్, సీనియర్ పాత్రికేయులు, కవి

పొత్తం విడుదల

ఆచార్య జయధీర్ తిరుమలరావు

పెద్ద బంధువు

శ్రీ కలశపూడి శ్రీనివాసరావు

చెలిమికాడు

శ్రీ రంగనాథ్, సినీనటుడు, రచయిత

శ్రీ కాకరాల, రంగస్థల నటుడు, రచయిత

సులభమైన తెలుగు పదాలను పక్కనబెట్టి సంస్కృత శబ్దాలను ఆశ్రయించడం సబబేనా? ఈ ఆలోచనలోంచే ఈ 'రాకపిలుపు ఉత్తరం' సిద్ధమైంది. గద్దెపెద్ద (సభాధ్యక్షుడు) పొత్తం విడుదల (పుస్తకావిష్కరణ) పెద్దబంధువు (ముఖ్యఅతిథి) చెలిమికాడు (ఆత్మీయ అతిథి) పదాల్లో తెలుగుదనం గుబాళించడం లేదూ...!

**మీరూ ఇలాంటి సృజనాత్మక 'పిలుపు'లకు ప్రాణంపోసి ఉంటే 'తెలుగువెలుగు'కు పంపండి.**

"సామాన్లు నీ గదిలో పెట్టుకుని మొహం కడుక్కునిరా నాన్నా! నేను కూడా తెములుతాను" అన్నారు తాతయ్య.

ఓ పావుగంటలో ఇద్దరం వసారాలోకి వచ్చి కూర్చున్నాం.

"బాగున్నారా బాబూ" పలకరిస్తూ గౌరమ్మ గారు కాఫీ అందించారు ఇద్దరికీ.

"సీత వెళ్లిపోయాక వసారాలో కూర్చుని కాఫీ తాగడం మానేశాను" దిగులుగా

ఏదో బాధ. తెలియని వెలితి. చుట్టూ బామ్మ జ్ఞాపకాలే!

ఓ గంట నడుం వాల్చా. ఈ లోగా వెంకన్న తువ్వాలు, సబ్బు, పెద్ద బక్కెట్టు నిండా వేడి నీళ్లు బాత్రూమ్‌లో పెట్టాడు. స్నానం ముగించి వచ్చే సరికి తాతయ్య డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుని పేపర్ చదువుతున్నారు. నన్ను చూసి "గౌరమ్మా టిఫిన్ పట్టుకురా చిన్నబాబుకి" అన్నారు.

## ఆణిముత్యాలు... ఆదర్శ నేస్తాలు

జాబిలమ్మని చూడగానే
తలపుకొచ్చే జోలపాట
అమ్మనే పిలుపెంతో
మధురమైన వెన్నముద్ద.
నిశిరాత్రి వెన్నెల జడిలో
నా మది మిణుగురై ఎగురుతున్న వేళ,
రూపమెరుగని చిరుగాలికే
ఎదురీదే నా ఊహల గానం.
కసిగా నాపై కత్తి దూసిన కాలమా
ఒక్కసారి వెనక్కి మరలు
ఏరుకోవాలెన్నో మధుర స్మృతులు.
పలకరిస్తాయో, లేదో నా చిరునేస్తాలు.

కోడికూత, వేపపుల్ల, బావినీరు, చద్దిమూట
పైరగాలి, లేగపరుగు, గోధూళివేళ...
అయ్యో, ఎప్పుడనగా వదిలి వచ్చేశాను.
బడి మానేశాక, బతుకు బండిని లాగే
పనిలో పడి,
అడుగడుగునీ శాసించే, ఆధునికతకు
ఒరవడి,
విధి ఆడే వింతనాటకంలో
మిమ్మల్ని విలువలేని పాత్రని చేసేశాను.

మళ్లీ ఎప్పుడైనా మారాం చేస్తుందేమోనని,
మది గొంతుని కూడా నులిమేశాను.
భారమైన ఈ యాంత్రిక జీవనంలో
ఉడిగిపోతున్న జవసత్వాల మధ్య,
ఎప్పుడైనా తలచుకొంటే, అదో రంపపుకోత.
అప్పుడు... అప్పుడే అనిపిస్తూంటుంది.
ఇవే ఎప్పుడూ పల్లెఒడిలో ఒదిగిపోయే
'ఆణిముత్యాలని'...
నా ఎదలోతుల్ని వదిలిపోని
'ఆదర్శ నేస్తాలని'...

- **విజయ రుద్రరాజు,**
హైదరాబాదు, 8977311737



అన్నారు తాతయ్య.

"ఇవాళ మనిద్దరం కాఫీ తాగుదాం తీసుకోండి తాతయ్యా" అన్నాను మాట మారుస్తూ, ఇద్దరం నిశ్శబ్దంగా కాఫీ ముగించాం.

"కాసేపు అలా బయటికి వెళ్లొస్తా, నువ్వు విశ్రాంతి తీసుకో" అని చేతికర్ర తీసుకుని, మరో చేత్తో వెంకన్న చెయ్యి పట్టుకుని తోటవైపు వెళ్లారు తాతయ్య.

ఆవిడ ఎన్నో ఏళ్ల నుంచీ మా వంటమనిషి. రోజూ వేళ తప్పకుండా మాకు వండి పెట్టడం ఆవిడకి ఇష్టం. టిఫిన్ చేశాక నేను తెచ్చిన బహుమతులు అందరికీ ఇచ్చా. అంతలో మొబైల్ మోగింది. 'ఆఫీసు నుంచేమో.. మాట్లాడొస్తా' అని నా గదిలోకి గబగబా వెళ్లి లాప్‌టాప్‌కి డేటాకార్డు పెట్టి, అంతర్జాలం కనెక్ట్ చేశా. అది సిద్ధం అవుతోండగా కిటికీలోంచి బయటికి చూస్తున్నా.

వెంకన్న పెద్దకొడుకు రాము జాజిపూలు కోస్తున్నాడు. 'ఇష్, ఇష్' అని గోడ అవతల ఉన్న పనమ్మాయి జయని పిల్చాడు. 'ఏంటి?' అంది జయ. 'నీ కోసం!' అంటూ దోసిలి నిండా పూలు చూపించాడు.

"అయ్యగారు చూస్తే బాగోదు?" మురిపెంగా మందలించింది జయ.

"అందుకేగా, ఆయన చూడకుండా ఇస్తున్నా, తీసుకో" అని నవ్వుతూ జయ కొంగులో వేశాడు రాము.

"పొద్దున్నే నీ నవ్వు మొహం చూస్తే హుషారుగా ఎంత పనయినా చేసేస్తా" అన్నాడు రాము, ఆమెను ప్రేమగా చూస్తూ. జయ సిగ్గు పడింది. నేను నవ్వుకున్నా.

'ఇంత చిన్న విషయం... ఎంత సంతోషం కలిగించింది ఇద్దరికీ. ఇలాంటి సంతోషం నాకెప్పుడైనా కలిగిందా?' ఆలోచనల్లో పడ్డా. మొబైల్ మోగడంతో ఊహాలోకం నుంచి బయటకు వచ్చా.

ఆఫీసు పని అయ్యేటప్పటికి పన్నెండు దాటింది. హాల్లో చూస్తే వాలు కుర్చీలో తాతయ్య నిద్రపోతున్నారు. నిశ్శబ్దంగా వెళ్లి, వసారాలో ప్రేమ్ కుర్చీలో కూర్చున్నాను. పేపరు చదువుతుంటే "అయ్యగారూ.." అన్న పిలుపు. పేపరు తప్పించి చూశా.

"మీరు వచ్చారని గౌరమ్మ చెప్పింది" అంటూ పెరుగు ముంత ఇచ్చాడు పాలేరు రంగన్న.

"బావున్నావా రంగన్నా? ఇవన్నీ ఎందుకూ?" అన్నా ముంత తీసుకుంటూ.

"ఎంత మాట చినబాబుగారూ? మీరు తింటే మాకు సంతోషం" అన్నాడు రంగన్న వినయంగా.

"సరేగాని ఒక్క నిమిషం ఉండు", అని లోపలికి వెళ్లి నేను తెచ్చిన కొత్తచొక్కా తెచ్చి ఇచ్చా. "చల్లగా నూరేళ్లపాటుండండి బాబు" అని ఆనందంగా ఆశీర్వదించాడు రంగన్న.

"ప్రతి చిన్న విషయమూ ఎంత సంతోషం కలిగిస్తుంది వీళ్లకి!" అని నవ్వుకున్నా.

తాతయ్య లేచి వసారాలోకి వచ్చారు. "లేపలేకపోయావా కన్నా?" అన్నారు. "పేపరు చదువుతూ కూర్చున్నాను" అన్నా.

మధ్యాహ్నం గౌరమ్మగారు పెటిన రుచికరమైన భోజనంతోపాటు రంగన్న

తెచ్చిన పెరుగూ తిన్నా.

'సిటీలో పెరుగు రుచి ఇలాగెందుకుండదో?' అనుకున్నా.

సాయంత్రం తోటలో తాతయ్యతో కూర్చున్నప్పుడు, వెంకన్న కుటుంబంతో వచ్చాడు.

"రాము పెట్రోలు బంకులో పని చేస్తున్నాడు. ఓ అయిదు వందలు చేతి ఖర్చుకని ఉంచుకుని మిగతాది మాకిచ్చేస్తాడు", అని గొప్పగా చెప్పాడు వెంకన్న. 'ఏనాడూ నా జీతం డబ్బులు నాన్నకి పంపలేదు'... నాకు సిగ్గనిపించింది.

"మరి పెళ్లెప్పుడూ?" నవ్వుతూ అడిగా.

"మంచి పిల్ల దొరికితే చేసేస్తాం"

"పక్కింట్లో పనిచేసే జయ మంచి పిల్లలాగే ఉంది" అన్నా, క్రీగంట రాముని చూస్తూ. తను సిగ్గుతో తలవంచుకున్నాడు.

"మీ మాట కాదంటామా బాబూ, ఆ పిల్ల పెద్దోళ్లతో మాట్లాడి అన్నీ కుదిరితే ఈ మాఘంలోనే పెళ్లి చేస్తాం, ఏమంటావురా?"

| | |
|---|---|
| గంపెడు చెట్లలో చక్కని దారి | (పాపిట) |
| జంటగా ఉండి తిరుగనిది | (తిరుగలి కింది కల్లు) |

కొడుకు వంక చూశాడు వెంకన్న. రాము ముసిముసిగా తలూపాడు.

"చిన్నోడు ఇంకా బళ్లో చదువుతున్నాడు బాబూ" అన్నాడు వెంకన్న. "మీలా కంప్యూటర్ ఉద్యోగం చేస్తానంటున్నాడు బాబూ" అంది వెంకన్న భార్య. "నాలానా!" అన్నాను ఆశ్చర్యంగా.

"అవును సార్! ఆ ఉద్యోగమైతే జీతం బాగా వస్తుందట కదా? అమ్మానాన్నలని పని మానిపించి బాగా చూసుకుంటా" అన్నాడు చిన్నోడు ఉత్సాహంగా.

"చాలా మంచి ఆలోచనే! మీరు అదృష్టవంతులు" అన్నా.

"భార్య, పిల్లలూ, ఇల్లూ... ఇంతకంటే స్వర్గమా బాబుగారూ" అన్నాడు వెంకన్న.

"వీళ్లు ప్రతీ విషయాన్నీ తేలికగా తీసుకుని తృప్తిగా సమాధాన పడతారు. అందుకే వీరికి జీవితం స్వర్గంలా అనిపిస్తుంది. నాకెన్నో కోరికలు. అందుకోలేని ఆశలు. ఎంత ఉన్నా ఏదో అసంతృప్తి. ఆ రాత్రంతా అదే ఆలోచన. ఏదో తెలియని ఆవేదన.

మర్నాడు లేచే సరికి తాతయ్య వసారాలో పేపరు చదువుతున్నారు. నేను వచ్చినప్పటి నుంచీ ఆయన కొంచెం హుషారుగా అనిపిస్తున్నారు.

'ప్రతి మనిషికీ ఓ తోడు కావాలి' అనుకున్నా. ఈ కొత్త ఆలోచనకి ఉలిక్కిపడ్డా. పనికి బయల్దేరిన రాము, గులాబీపువ్వు కోసి జేబులో పెట్టుకోవడం చూసి నవ్వుకున్నా. 'బతకడానికి ప్రేమ అవసరం' అనుకున్నా.

ఈసారి మరింత ఆశ్చర్యపోయా, బడికి వెళ్తున్న కొడుకుని తృప్తిగా చూస్తూ నుంచున్న వెంకన్న భార్యని చూశా. 'జీవితంలో తృప్తి చాలా అవసరం' అనుకున్నా. ఒక్క ఉదుటున లేచి నుంచున్నా. గౌరమ్మగారు వేళ తప్పకుండా టిఫిన్ పెట్టి వెళ్లారు. 'ఆరోగ్యకరమైన జీవితానికి క్రమశిక్షణ మంచి మందు' అనిపించింది గౌరమ్మ గారిని చూస్తే.

| | |
|---|---|
| దమ్మిడి గుర్రం దానికి కళ్లెం | (సూది దారం) |
| ఎక్కడ తిరిగినా చివరికి మూలకే | (చీపురు) |

స్నానం చేసి ఉదయాన్నే, చక్కగా వస్తుందావిడ పనికి. వేళ తప్పకుండా శుభ్రంగా వంట చేస్తుంది.

'ఏమిటి నా ఆలోచనలు!' ఇలా ఇదివరకెప్పుడూ ఆలోచించలేదు, 'ఏంటీ మార్పు?' ప్రశ్నించుకున్నా.

"నాన్న ఫోన్ చేశాడు", తాతయ్య మాటలకి, ఆలోచనల్లోంచి బయటపడ్డా. "ఏమంటారు!" అడిగా.

"మంచి సంబంధం వచ్చిందట. పద్ధతైన కుటుంబం. అమ్మాయి బాగా చదువుకుంది. మంచి ఉద్యోగమట మరి..."

"చూడమనండి! అన్నీ బావుంటే..." నా మాటలకి నేనే ఆశ్చర్యపోయా. బహుశా ఆ క్షణం నా గుప్పెట్లో స్వర్గం నాకు మొదటిసారిగా కనిపించిందేమో!




**ప్రియదర్శిని చాగంటి,**
పుణె. 093724 13078




## పునరపి...

బంధాలన్నీ
పండుటాకుల్లానో
పూరేకుల్లానో
వాడిపోయి రాలిపోతుంటే
జారిపోతున్న బంధాలతో
ఒంటరి బాటసారైన మనిషి
శిథిలమవుతున్న పూతీగ!
కళ్ల దొరువుల్లో
వట్టిపోతున్న కన్నీటి చెలమలు
జీవితానికి కొత్త అర్థం చెబుతుంటయ్.
కాల ప్రవాహపు వంతెనకు
పుట్టుక ఒక కొన
చావు రెండో కొన
ఈ దరి బయలుదేరింది
ఆ దరికి చేరుకోటానికే అయినా
వేసే ప్రతి అడుగుకూ
రెండో కొనకు
దగ్గరవుతున్నామనుకోరు
అట్లా అనుకుంటే
రెండో అడుగే పడదు!
భ్రమల భ్రమణాల మధ్య
ఆశాజీవి మనిషి!
ఇప్పుడిక్కడ
ఒక బంధాన్ని తెంపుకోవటం
ఎక్కడో
మరో బంధానికి పురుడు పోసుకోటానికే,
పునరపి జననం!
పునరపి మరణం!


**- ఎన్.వి.రత్నశర్మ**
హైదరాబాదు. 98663 76050



# బాలలే ఆయన బంధువులు

**బాల ప్రపంచం**
**పాల ప్రపంచం**
**పాలవలె తియ్యనిది**
**పాలవలె చిక్కనిది**

అంటూ బాలప్రపంచాన్ని మనముందు నిలుపుతారు ఏడిద కామేశ్వరరావు. వయసుతో నిమిత్తం లేకుండా అందరిచేతా ప్రేమగా 'అన్నయ్యా' అని పిలిపించుకున్న అదృష్టవంతులు ఆయన. ఆకాశవాణిలో పనిచేస్తూ బాలలకోసం సాహితీ సృజన చేసి బాలబంధుగా ప్రసిద్ధి చెందిన ఆయన 1913 సెప్టెంబరు 12న తూర్పుగోదావరి జిల్లా ఏడిద గ్రామంలో పుట్టారు. అమ్మానాన్నలు వెంకటరాజ్యలక్ష్మి, పెద కొండలరాయుడు. ఆయన విద్యాభ్యాసం మండపేట, రాజమండ్రిల్లో కొనసాగింది. తాను రాసేది బాలసాహిత్యం అని తెలియకుండానే చిన్ననాటనే రచనలు మొదలుపెట్టారు.

పిల్లలకు ఆటపాటలు తల్లిపాల వంటివి. ఆటపాటలతో అరవిచ్చిన వారి కళాహృదయాలు పసిడికాంతులను విరబూసే పద్మకిశోరాలై భాసిల్లుతాయి. బాలవాక్కు బ్రహ్మవాక్కు అయినా కాకున్నా, వారి వాక్కు అమృతవాక్కు- బాలల పలుకు పంచదార. అఖండమైన, అనంతమైన మన సంస్కృతీ స్రవంతిలో చిరుతరంగాలుగా తళుకులీనేది బాలసాహిత్యం.

**'బాలల' అన్నయ్య**

బాలల కోసం రచనలు చేయడం చాలా కష్టమనే విషయం అందరికీ తెలిసిందే. కానీ, రేడియో అన్నయ్యగా ప్రసిద్ధి చెందిన ఏడిద కామేశ్వరరావు పిల్లల కోసం అనేక సాహిత్య ప్రక్రియలు చేశారు. పిల్లల మనసుకు హత్తుకునేలా రాయడంలో ఆయనది అందె వేసిన చేయి. ఆయన రచనా వ్యాసంగం విశిష్టంగా ఉంటుంది. కథైనా, పాటైనా, నాటికైనా అవి విజ్ఞానాన్ని, వినోదాన్ని సంతరించి పిల్లలకు అర్థవంతమైనవిగా ఉంటాయి.

ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో బాలల కార్యక్రమాల నిర్వాహకునిగా పాటలు, నాటికలు, నాటకాలు, కథలు, నృత్యనాటికలు, బుర్రకథలు, జముకుల కథలు, హరికథలు వంటివెన్నో రాసి బాల ప్రపంచానికి అందించారు కామేశ్వరరావు.

**పిట్టలవలె నెగురుదుము/ జట్టుగాను తిరుగుదుము/ ఒక్కొక్కరందరము/ అందరమే యొక్కరమని** అని ఆయన పాడినట్లే ఆయన రచనలన్నీ బాలల మనో, నైతిక, బుద్ధి వికాసాలను పెంపొందించేలా సాగాయి.

**అమ్మమాట ఎంతో అందము - మా**
**అమ్మ మనసు మంచి గంధము**
**అమ్మ ముద్దు చల్లన, అమ్మసుద్దు తెల్లన**
**అమ్మ ముద్దు సుద్దులే ఆదిగురువులు**
**అమ్మ మించి కానము వేరొక్కటి జగము**
**అమ్మ మించి లేదు కానరాదు దైవము**

అనూచానంగా వస్తున్న 'మాతృదేవోభవ' నానుడి ఆయన రాసిన 'అమ్మమాట' పాటలో అలతి అలతి పదాలతో సొంపుమీరి కనిపిస్తుంది. మాతృహృదయం చలువపందిరి. అమ్మ మాట వాకలు తేరిన తేనెతేట.

**అమ్మా చూడు ఈ వింతలు**
**పాపలాడు పంతాలు**
**నీటిలోన నే తొంగి చూడగా**
**నన్ను చూచి తా తొంగి చూచె**

**కుచ్చుజడ ఆ పాప ఎవ్వరే**
**అచ్చము నను బోలి యున్నది**

పసిపాపలు పరమాత్ముని ప్రతిరూపాలు. అమాయకత్వంతో స్పందించిన ఈ ముద్దు మాటలు ప్రతి అక్షరమూ చదివేవారిలో వేయి వీణలు మీటుతాయి. నింగినీలాల జడలో చందమామ ఓ చేమంతి, వెలలేని అందం. పసిపాపల బోసినవ్వులు కురిసే ఇల్లు పగడాల ఆనందం. ఎంత సిరిసంపదలతో తులతూగుతున్నా, చిన్నారుల హొయలు, చిరునవ్వుల సింగారాలు లేని ఇల్లు దీపం పెట్టని గుడి వంటిది.

**ఇంటికి పాపాయి అందము**
**మింట దాయిదాయి చందము**
**అందమా చందమా అన్ని ఉండి అవిలేక**
**అర్బుదాల తారలు ఆకాశము కందమా**
**తారలలో చందమామ తళ్కొత్తిన చందమా**
**కోటి కలువ పూచినా కొలను చూడ అందమా**
**కలువలలో పద్మమొకటి విరిసిన అది చందమా**
**తోటలోన పూలలతలు విరబూసిన అందమా**
**లతలలోన ఒక గులాబి పూవు నవ్వ చందమా**
**మేలిమి బంగారముతో మలచిన నగ అందమా**
**నగలోన రత్నమొకటి రంగు మెరవ చందమా**

ఇంటికి పిల్లలే అందమూ చందమూ అని ఉదాత్తంగా చెప్పే ఈ పాటలోని భావం పసిపాపల బోసినవ్వులకు వెలలేదన్న అమూల్యమైన సందేశాన్ని అందిస్తుంది.

**ఆడుతూ పాడుతూ చదువు**

పాప పసిహృదయంలో ఎన్నో సందేహాలు ఉంటాయి. వారి మనసులోంచి పుట్టే ప్రశ్నలకు మన దగ్గర సమాధానాలు ఉండవు. అయినా తల్లి పిల్లలకు సమాధానాలు ఇస్తూనే ఉంటుంది. కల్లబొల్లి కబుర్లతో కాలక్షేపం చేయక, అర్థవంతంగా పిల్లల మనసు మరలుస్తుంది.

**అమ్మా అమ్మా రావమ్మా - ఒక్కమాట వినవమ్మా**
**పలకలు మరి బలపాలు - పుస్తకాలు లేని**
**చదువు**
**ఉంటే బాగా ఉండునమ్మా ఉఫ్ అని**
**చదివేద్దునమ్మా!**

బడికి వెళ్లే సరదాలో పలకా పుస్తకాలు మోయలేని ఆదుర్దాలో చిన్నారి పాపడు ఉఫ్ అని ఇట్టే చదివేసే ఉపాయం అమ్మను అలవోకగా అడుగుతాడు. అలాంటి ఉపాయం ఏదైనా దొరికితే పలకల బరువూ, పుస్తకాల మోతా లేని చదువు ఉంటే మహా పండితుడవుతాడట వాడు.

సాహిత్య ప్రక్రియలన్నింటినీ చేపట్టిన రేడియో అన్నయ్య తేట తెలుగులో 'బాలరామాయణం' రాశారు. వెయ్యికిపైగా రాసిన పాటల్లో పిచ్చుక, కాకి వంటి పక్షులపైన పాటలు, పండుగ పాటలు, ఆకాశం నక్షత్రాల పాటలు, జంతువుల పాటలు, కాఫీ, టీ పైన పాటలు, ఇంట్లో ఉండే ప్రతి వస్తువుపైనా పాట రాసి దాని ఉపయోగం చెప్పారు. ఇక పర్యావరణంపై రాసిన పాటలైతే చాలానే ఉన్నాయి. అంటరానితనం లాంటి సమస్యలపై, సత్యం, అసత్యం వంటి వాటిపై పాటలు, కథలు, నాటికలు, రాశారు.

భారతదేశంమీద రాసిన పాటలు ఎంతో ప్రాచుర్యం పొందాయి. తెలుగుగడ్డ మీదున్న



విశిష్టతను తెలుపుతూ పాటలు రాశారు. కవి హృదయానికి, ఆ ప్రాంతం... ఈ ప్రాంతమని, ఈ రాష్ట్రం ఆ రాష్ట్రమని, ఈ జిల్లా ఆ జిల్లా అని బేదాభిప్రాయాలు ఉండవు. అందుకు ఆయన కరీంనగర్, ఆదిలాబాద్, మహబూబ్‌నగర్, వరంగల్ వంటి జిల్లాలపై రాసిన పాటలే తార్కాణం.

బాలప్రపంచాన్ని తన రచనలతో అలరించిన కామేశ్వరరావు ఆధ్యాత్మికంగానూ ఎంతో ఎత్తుకు ఎదిగారు. 'పిలిచితే పలుకుతారట', 'తరిగొండ వెంగమాంబ', 'గోవర్ధన గిరిధారి', 'బాలరామాయణం' వంటి రచనలు కొన్ని ఉదాహరణలు మాత్రమే.

ఇవన్నీ సంగీత రూపకాలు. '**పిలిచితే పలుకుతారట/ నా పలుకులో కులుకుతారట**' అనే పాట ఇప్పటికీ తిరుమల దేవాలయంలో మారుమోగుతోంది. ఈ పాటను శ్రీరంగం గోపాలరత్నం పాడారు. ఆయన రాసిన సుమారు 200 జోలపాటల్లో ఒక పాటకు మరో పాటకు పోలిక ఉండదు. అన్నీ ఏదో ఒక ఆలోచనను, విజ్ఞానాన్ని, ఆనందాన్నీ కలిగించేవే.

**సద్దు చేయకండి, ఎవ్వరిటు రాకండి**
**బుద్ధిగా మాపాప, నిద్దరోతోంది**
**కాకమ్మ అరవకే, మా ఊరుపోతే**
**మామయ్య వచ్చేది, కబురు కొనితేవే**
**పిచికమ్మ పలుకవే, మా పొలముపోవే**
**పప్పులెన్నో తెచ్చి, మా పాపకీయవే**
**చిట్టి పిల్లిపోవే, వంటిల్లు విడిచి**
**ఉట్టిమీద పాలు, అన్నీ మా పాపలకే**
**కుక్క పిల్ల రావె, గుమ్మంలో కూర్చోవే**
**ఎవ్వరిటు రాకుండా, కాపలా కాయవే**
**చిట్టి పాపల్లార, అటెటో వెళ్లండి**
**నిదురలేచి పాప, ఆడగా వస్తుంది**
**బజ్జుంది మా పాప, బంగారు చిలక**
**బబ్బుంది హాయిగ, రతనాల మొలక**

ఇలా పాటలు పాడుతూ, జోలలూపుతూ పాలబువ్వ తినిపిస్తూ అమ్మ చెబితే పాపాయి 'ఆం' తింటూ కాకీ పిచ్చుకలు, కుక్కా పిల్లుల గురించి తెలుసుకుంటుంది. అమ్మ లాలనే పాపాయి తొలి చదువు. అందుకే అమ్మనే ఆది గురువుగా చెబుతారు.

పిల్లల కోసం రేడియో అన్నయ్య చారిత్రక నాటకాలు ఎన్నో రాశారు. కృష్ణాతీరం వెంట జరిగిన కథకు అద్దం పట్టే నాటిక 'ధనకటక మహాచైత్యం', శాలివాహన శకం ఆరంభాన్ని వివరించే 'శాలివాహన' లాంటి నాటకాలు ఎన్నింటినో రాశారు.

**బాలల కోసం విద్యాలయం**

రేడియో అన్నయ్యగా బొమ్మరిల్లు, పాలవెల్లి కార్యక్రమాలు నిర్వహిస్తూ, ఆయా పండుగల సమయాల్లో, ప్రత్యేకమైన పాత్రలు రూపొందించి వాటి విశేషాలను పిల్లలకు పాటలుగా, నాటకాలుగా రూపొందించి వారిచేత వేయించేవారు. బొమ్మ, చిట్టి, పండు, కాంతం, పెద్దబావగారు, ఎల్లమంద, చిట్టిమరదలు, కబుర్లపోగు - ఇవే అన్నయ్య నాటకాల్లోని పాత్రలు. ముఖ్యమైన పండుగలనాడు ఆకాశవాణి పిల్లలకు

రంగస్థల ప్రదర్శనలు ఏర్పాటు చేసేది. వాటిలో పిల్లలు నాటకాలు, నృత్యాలు, కోలాటాలు ప్రదర్శించేవారు.

చిన్ననాటి నుంచే ఏడిద గ్రామంలోనూ, చదివిన మండపేటలోనూ, విద్యాభ్యాసం చేసిన రాజమండ్రిలోనూ ఎన్నో నాటక ప్రదర్శనలిచ్చారు కామేశ్వరరావు. వాటిలో ముఖ్యమైంది హరిశ్చంద్ర నాటకంలోని నక్షత్రకుడి పాత్ర. ఆ రోజుల్లో జరిగిన నాటకోత్సవాల్లో బంగారు పతకం అందుకున్నారాయన.

పిప్పరలో నిర్వహించిన సాహిత్య సభలో ఆయనకు 'బాలభారతి' బిరుదు ప్రదానం చేశారు. ఆ బిరుదునే ఆలంబనగా చేసుకొని సంగీత సాహిత్యాలకు నిలయంగా 'బాలభారతి' సంస్థను ప్రారంభించారు. విద్య, విజ్ఞాన, వినోదాల సంస్థ బాలభారతి. దీనిలో ఒక గ్రంథాలయం కూడా ఏర్పాటుచేశారు. ఇందులో తెలుగు, సంస్కృతం, ఇంగ్లిషు భాషల్లో వచ్చిన బాలల పుస్తకాలు అందుబాటులో ఉండేవి. బడి అయిపోగానే పిల్లలు బాలభారతికి వచ్చేవాళ్లు. అందరిలో కొంచెం పెద్దవారిని నాయకుణ్ని చేసి వాళ్లతో ఆటలు ఆడించడం, పుస్తకాలు చదివించడం వంటివి చేయించేవారు. వారం వారం వచ్చే బొమ్మరిల్లు, పాలవెల్లి కార్యక్రమాలకు పిల్లల్ని తయారు చేసేవారు. అంతేకాదు పాటలు, నాటికలు, బుర్రకథలు నేర్పించి ప్రదర్శనలు ఇప్పించేవారు. శ్రీరామనవమి, వినాయక చవితి, నవరాత్రుల్లో, ఇతర ఉత్సవాల్లో పిల్లలచేత వీటిని ప్రదర్శింపజేసేవారు. ఈ ప్రదర్శనల్లో పాటలకు రాగాలు కూర్చి పాడేవారు. తాను రాసిన ప్రతి పాటకూ రాగాలు పిల్లలకు నేర్పించి, రేడియోలో పాడించేవారు. తెలుగువారైనా ఆయన కూర్చిన పాటలు హిందూస్థానీ సంగీత కోవలో ఉండేవి.

'బాలభారతి'ని ఆయన ఒక నమూనా విద్యాలయంగా తీర్చిదిద్దారు. పిల్లలకు ఇందులో పాఠశాల చదువుతోపాటు సంగీతం, నాట్యం, చిత్రలేఖనాలను నేర్పేవారు. ఎవరికి ఇష్టమైంది వారు నేర్చుకొని పదో తరగతి పూర్తయ్యేసరికి ఈ కళాప్రక్రియల్లో సర్టిఫికెట్ కోర్సు పూర్తిచేసేవాళ్లు. ఆయా రంగాల్లో ప్రఖ్యాతులైన ఉపాధ్యాయులు ఇక్కడ బోధించేవారు. వివిధ పాఠశాలల్లో జరిగే ఆటపాటల పోటీలు, వక్తృత్వం, చిత్రలేఖనం పోటీల్లో బాలభారతి విద్యార్థులు పాల్గొని బహుమతులు సాధించేవారు.

**ఆయనకూ ఉంది ఓ కల**

విద్యలు, కళలు, వృత్తులు, సాంకేతిక విద్యలు వంటి సమస్తాన్ని కలిగిన ఒక నూతన విద్యావ్యవస్థను రూపకల్పన చేస్తున్న తరుణం ఇది. రేడియో అన్నయ్య ఆశయ బాటలో నడుస్తూ స్వయంప్రతిపత్తి కలిగిన 'బాలల విశ్వవిద్యాలయం'ను నెలకొల్పేందుకు ప్రభుత్వం కృషి చేయాలి. సేవానిరతి కలిగినవాళ్ల సారథ్యంలో, అనుభవజ్ఞులైన అధ్యాపక

బృందం పర్యవేక్షణలో విద్యావిధాన పాఠ్యగ్రంథ రచనలను కొనసాగించి, విద్యారంగ సముద్ధరణకు కృషి చేయాలి.

ఈ నేపథ్యంలో హృదయ వికాసానికి తోడ్పడే విద్యను ప్రవేశపెట్టాలి. ఈ బాలల విశ్వవిద్యాలయంలో శిక్షణ పొందిన బాలలు స్వయం ప్రతిభావంతులుగా కావడంతో పాటు, జాతి ఔన్నత్యానికి దోహదంచేసే సంపూర్ణ వ్యక్తిత్వం కలవారుగా తీర్చిదిద్దాలి.

ఏడిద కామేశ్వరరావు గాంధేయవాది. ప్రకాశంపంతులు శిష్యరికంలో ఆయన వితంతు వివాహం చేశారు. స్వాతంత్ర్య పోరాటంలో లాఠీ దెబ్బలు తిని జైలుజీవితమూ అనుభవించారు. స్వాతంత్ర్య సమరయోధునిగా గుర్తించి... భారత ప్రభుత్వం అయిదు ఎకరాల భూమిని ఇవ్వబోగా 'భూమి కోసం నేను పోరాటం చేయలేదు' అని తిరస్కరించారు.

పిల్లల్లో పిల్లవాడిగా, పెద్దల్లో పెద్దవాడిగా, సాహితీవేత్తల్లో కవిగా, ఆధ్యాత్మిక చర్చల్లో తత్త్వవేత్తగా విరిసిన బహుముఖ ప్రజ్ఞాశాలి ఏడిద కామేశ్వరరావు. ఆయన కలంపేరు 'హంస'. అచ్చం హంసలాగే, ఆయన కూడా బయటి ప్రపంచంతో తాదాత్మ్యం చెందక, ఓ మునిలా తమ లోకంలో మునిగిపోయి కలం చేబూని కవితలు, గేయాలు, నాటికలు, ఆధ్యాత్మిక రచనలూ చేశారు.

'బాలచంద్రిక', 'బాల' పత్రికలకు సంపాదకత్వం వహించి, బాలల్ని ఉర్రూతలూగించిన కామేశ్వరరావు గురించి ఒక్కమాటలో చెప్పాలంటే... పిల్లల పాలిట 'జ్ఞాన భాండాగారం'. ఆయన స్ఫూర్తిని అందిపుచ్చుకొని తెలుగులో బాలసాహిత్యం మరింత వెలుగులీనాలి.



**ఎం.రాజ్యలక్ష్మి,**
హైదరాబాదు. 90321 00168
**(ఏడిద కామేశ్వరరావుగారి అమ్మాయి)**



# రాగమాలికలు

అశల ఆకాశంలో విహరించే
మనో విహంగం....
సమస్యల గ్రీష్మం విసిరిన
వడగాలి దెబ్బకు-
మట్టికరచినప్పుడు....
స్పందించే మట్టికణాల
గుండె లోతుల్నుంచి
మానవత్వం ఉబికి వస్తుందని-
ముళ్లమధ్య బతికే
గులాబీరేకుల గుసగుసలు
వింటే తెలుస్తుంది..

ఆ గులాబీల గుణరత్నాల
నయనాలనుంచి ప్రవహించే
కాంతిధారల దారుల్లో
పయనించే జీవితనౌక
అంతరంగాల తరంగాలపైన
గమ్యం చేరిప్పుడు-
తీరాల పెదవులపైన
పచ్చని నవ్వులు ప్రతిఫలిస్తాయని
కవికోకిలలల్లిన రాగమాలికలు
రవళించును, పరిమళించును
మది - వీణియలై, నవవేణువులై!!

**- డా॥ అన్నపురెడ్డి శ్రీరామరెడ్డి**
గుంటూరు, 94907 76238

## తెలుగు పాలనకు పట్టం కట్టాలి

**రూ. 116 బహుమతి పొందిన లేఖ**

కర్ణాటక ప్రభుత్వం... మాతృభాషా మాధ్యమ విద్యార్థులకు సర్కారీ ఉద్యోగాల ప్రవేశ పరీక్షల్లో 15 అదనపు మార్కులిస్తోంది. తమ మాతృభాషను నవతరం నేర్చుకోవటానికి ప్రోత్సహిస్తోంది. ఎనిమిదో తరగతి వరకు తమిళాన్ని నిర్బంధ బోధనా భాషగా తమిళనాడు ప్రభుత్వం అమలు చేస్తూ ప్రోత్సాహకాలు అందిస్తోంది.

తెలుగు కూడా ప్రాథమికస్థాయిలో మిగిలిపోకుండా ఉండాలంటే, అలాంటి వ్యూహం మన రాష్ట్రాల్లోనూ అమలవ్వాలి. ప్రభుత్వాలు నిర్వహించే అన్ని ఉద్యోగ ఎంపికలకూ తెలుగును ప్రధానర్హతగా నిర్ణయించాలి. ఉత్తర్వులను జారీ చేయడం, విజ్ఞాపన పత్రాలను తీసుకోవడం వంటి ప్రభుత్వ అధికార కార్యకలాపాలన్నింటిలో తెలుగును ఉపయోగించాలి. సర్కారీ కార్యాలయాల్లో వివిధ స్థాయిల్లో మేటవేసిన ఆంగ్ల పైత్య ప్రకోపాన్ని క్రమేణా తగ్గించి, తెలుగునాట తెలుగు పాలనకు పట్టం కట్టాలి.

తెలుగు భాషను సంస్కరణ పద్ధతిలోకి తీసుకొని, ఆంగ్లం కంటే దీటుగా మాట్లాడేలా చేయాలి. ఎందుకంటే తెలుగులో నేడు అవసరాన్ని బట్టి అనేక అన్యభాషా పదాలు ప్రవేశిస్తున్నాయి. వ్యక్తీకరణ పద్ధతులూ మారుతున్నాయి. అలాగే తెలుగు భాషలో సనాతనంగా కనిపించే కొన్ని ధ్వనులు నిరుపయోగాలై నశించిపోతున్నాయి

ఆకాశంలో తారలెన్ని ఉన్నా వెలుగంతా సూర్యుడిదే. నేర్చే చదువులెన్ని ఉన్నా మాతృభాషలో నేర్చిందే నిజమైన జ్ఞానం. అందుకే ఉడ్సు నివేదికలోనూ (1854), గాంధీజీ ప్రాతిపదిక విద్యలోనూ (1938), కొఠారి కమిషన్ నివేదికలోనూ (1966) మాతృభాష ప్రాధాన్యం స్పష్టంగా ఉంది. దాన్ని అర్థం చేసుకుని... అమ్మభాషకు పాలనలో, విద్యావ్యవస్థలో సముచిత ప్రాధాన్యం ఇవ్వాల్సిన బాధ్యత తెలుగు పాలకులదే.

**- బుడుము కొండలరావు,** అలజంగి,
విజయనగరం

# తెలంగాణ జాతీయ గ్రంథాలయం

**తెలుగు కావ్యాలు, సంస్కృతం, ఉర్దూ గ్రంథాలకు నిలయమది. ఆ పొత్తపుగుడిది చరిత్రలో ప్రత్యేకస్థానం. శతాధిక వసంతాల ఆ సరస్వతీ నిలయం ఆవరణలో నిలబడితే చాలు నూతనోత్తేజం వెల్లివిరుస్తుంది. అది తెలుగు సామాజిక సాంస్కృతిక రేఖ. తెలుగు భాషా సంస్కృతుల ఉద్యమ స్ఫూర్తితో స్థాపించిన ఆ గ్రంథాలయం ఎంతోమంది గొప్పవాళ్లకు మార్గదర్శిగా నిలిచింది. నిజాం రాజుకు వ్యతిరేకంగా సాగిన హైదరాబాదు రాష్ట్ర స్వాతంత్ర్యోద్యమంలో దీని పాత్ర చిరస్మరణీయం. తెలుగుగడ్డ మీద ఇప్పటికీ కాంతులీనుతున్న ఆ తొలితరం గ్రంథాలయమే శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం.**

నాడు శ్రీకృష్ణదేవరాయల కాలంలో అంగళ్లలో రత్నరాశులు!

నేడు హైదరాబాదు సుల్తానుబజారులో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో పాఠక పరిశోధకుల్ని ఆకర్షిస్తూ వివిధ గ్రంథ రత్నరాశులు- విభాగ విభాగాల అమరికల్లో.

రాయల సభలో అష్టదిగ్గజ కవులు- కావ్యగానాల విందులు.

రాయలపేరిట వెలసిన పొత్తపుగుడిలో బహుప్రాంతాల, వివిధ కాలాల దిగ్గజాలు గ్రంథాల రూపంలో.

కృష్ణరాయలకు గ్రంథాలు అంకితాలు. శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయానికి, దాని వైభవ ప్రాభవాలకు ఎంతోమంది మహనీయుల జీవితాలే సేవాంకితాలు.

కేవలం పత్రికలో, గ్రంథాలో చదివే పఠన మందిరం మాత్రమే కాదిది. తెలుగువారి భాషాత్మ గౌరవ సంకేతమైన సంతకం ఈ పొత్తాల నిలయం. గ్రంథ నిలయంబునందలి గ్రంథములకు/ గుణమెకాని ప్రధానము గణము కాదు/ ఎన్నియో చెత్తపొత్తములున్న కన్న/ ఉత్తమ గ్రంథములు కొన్ని ఉన్న చాలు అన్నారు మధురకవి నాళం కృష్ణారావు. ఉత్తమ గ్రంథాలు యాభైవేల పైచిలుకు ఉన్న ఉన్నత గ్రంథ సంస్థ ఇది. ఇందులో తెలుగు, ఆంగ్లం, సంస్కృతం, హిందీ, తెలుగు లిపిలో తమిళం భాషల్లో గ్రంథ సంచయం ఉంది.

కొన్ని గ్రంథాలయాల్లో ప్రాచీన గ్రంథాలుండి ఆధునిక గ్రంథాలు తగినంతగా ఉండవు. కొన్నిటిలో ఆధునిక గ్రంథాలుండి ప్రాచీన గ్రంథాలుండవు. కానీ శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయం మాత్రం 'ప్రాతక్రొత్తల క్రొమ్మెరుంగులు చిమ్ము'తూంటుంది. సాధారణంగా గ్రంథాలయాలు రెండు రకాలు... కొన్ని గ్రంథాలు ఉండి భవనాలు లేనివి. మరికొన్ని భవనాలు ఉండి గ్రంథాలు లేనివి. కానీ ఈ భాగ్యనగర నిలయానికి నాలుగంతస్తుల భవనమూ ఉంది, నలుగురికీ ఉపయోగ పడే తగిన గ్రంథ సంచయమూ ఉంది.

తెలుగునాట ఇతర ప్రాంతాల్లో ఒక స్థిమిత ప్రశాంత వాతావరణంలో గ్రంథాలయాలు స్థాపించడం, నిలబెట్టడం, నడపటం వేరు. ఒకనాటి తెలంగాణ ప్రాంతంలో పరిస్థితులు వేరు.

'ఆంధ్రపత్రిక' చదివితే దేశద్రోహం చేశారన్నంత అపోహతో రక్షకభట నిలయానికి తీసుకెళ్లిన దారుణ సంఘటనలు ఇక్కడివి. తెలంగాణ సోదరులలో పరకాయ ప్రవేశం చేసి, పర'గాయ' ప్రవేశం చేస్తే లోతట్టు అంశాలు తెలుస్తాయి. ఉర్దూ, ఆంగ్లభాషలు గొప్పవే. కాని తల్లిబాస తీపి పాలను మరచిపోయి బతికే రోజులవి.

**దోహదం ఆంగ్ల గ్రంథ పఠనమే...**

అది 1901వ సంవత్సరం. స్థలం హైదరాబాదు సుల్తానుబజారులోని రావిచెట్టు రంగారావనే జాగీర్దారు ఇల్లు. అక్కడ సమావేశం అయింది మునగాల రాజా నాయని వెంకట రంగారావు, కొమర్రాజు లక్ష్మణరావు, రావిచెట్టు రంగారావులు. ముగ్గురూ రాబర్ట్







రావిచెట్టు రంగారావు



నాయని వెంకటరంగారావు



మాడపాటి హనుమంతరావు



సురవరం ప్రతాపరెడ్డి

కొమర్రాజు లక్ష్మణరావు



నూతి శంకరరావు



ఎం. ఎల్. నరసింహారావు

స్యూయల్ 'ఏ ఫర్‌గాటెన్ ఎంపైర్' గ్రంథాన్ని చదివినవారే. అది విజయనగర సామ్రాజ్య ఉత్థాన పతనాలకు సంబంధించింది. రాయలనాటి తెలుగు భాషా సాహిత్యాల సమున్నత పరిస్థితిని తలచుకొని ఆనందాన్ని పంచుకున్నారు. అక్కడితో ఆగకుండా, తమ కాలంనాటి తెలంగాణలో తెలుగు భాషా సంస్కృతులకు పట్టిన దుర్గతికి బాధపడ్డారు. తెలుగుభాషకు పూర్వపు వైభవ ప్రాభవాలు తేవాలని భావించారు. ఫలితం శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం స్థాపన. దీనికి కందుకూరి 'ఆంధ్రకవుల చరిత్ర' స్ఫూర్తిగా నిలిచింది.

పుస్తక అధ్యయనం చరిత్రనే సృష్టింపజేసింది. 1901 సెప్టెంబరు 1, ఆదివారం సాయంకాలం 5 గంటలకు హైదరాబాదులోని రామకోటిలో రావిచెట్టు రంగారావు బంగళాలో గ్రంథాలయం ప్రారంభమైంది. దీని స్ఫూర్తితో నిజాం రాష్ట్రంలో ఒకటీ రెండూ కావు, ఎన్నో పేర్లతో పట్టణ, గ్రామాల్లో 114 పొత్తపుగుళ్లు వెలశాయి. ఈ గ్రంథ నిలయం కాలగమనంలో అక్షర కల్పవృక్షమైంది. తెలుగుదేశమంతటికీ భాషా సాహిత్య సంస్కృతులకు తీర్థస్థలమైంది.

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయానికి మొట్టమొదటి గౌరవ కార్యదర్శి రావిచెట్టు రంగారావు. మాతృభాషను వెన్నెముకగా భావించారు. పండితద్వయం ఆదిపూడి సోమనాథరావు, మైలవరపు నరసింహశాస్త్రి ఉపన్యాస కవిత్వాల ద్వారా ఆంధ్రోద్యమాన్ని జనబాహుళ్యంలోకి విస్తరింపజేశారు. తెలుగు మాధ్యమంగా రెండేళ్లపాటు తెలుగు పాఠశాలను ఆ రోజుల్లో నడపగలిగారంటే చేతులెత్తి మరీ మొక్కాలి. రావిచెట్టు 'కూలిన' దృశ్యం తరువాత ఆయన ధర్మపత్ని లక్ష్మీనరసమ్మ విరాళంతో ఒక పెంకుటిల్లు కొన్నారు. సరస్వతికి ఆవాసాన్ని కల్పించారు. తరువాత దాతల విరాళాలతో నిర్మించిన నూతన భవనాన్ని 1921 సెప్టెంబరు 30న కట్టమంచి



రామలింగారెడ్డి ప్రారంభించారు.

ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు దీనిని తెలుగు భాషా సంస్కృతుల పరిరక్షణ కేంద్రంగా మలచారు. ఆదిరాజు వీరభద్రరావు వంటి నామవాచకాలెన్నో ఈ నిలయ సర్వనామానికి సేవా ప్రతిబింబాలయ్యాయి. ఉనికి, మనికి తెలంగాణలోనే అయినా ఈ నిలయం దేశవ్యాప్త తెలుగు పరిశోధకులకు ఆకర్షణ స్థానమైంది. అంతేకాదు రాయల జయంతి

**కొన్ని ప్రాచీన, అపురూప గ్రంథాలు**

| శీర్షిక | ప్రచురణ |
|---|---|
| బ్రాహ్మణ మహిమ్నా దర్శమనియు యాజ్ఞవల్క్యప్రభావమణి మంజూష | 1874 |
| విష్ణుపురాణం | 1882 |
| రామాయణ గ్రంథం | 1884 |
| రామాయణ శ్లోకీ | 1892 |
| విషూచిక రోగశమని | 1895 |
| గౌతమీ మాహాత్మ్యమ్ | 1891 |
| బృందావన విహారమ్ | 1894 |
| ముముక్షుప్పడియమ్ తెలుగు లిపిలో తమిళగ్రంథం | 1890 |
| వసుచరిత్రము | 1893 |
| వేదాంత పంచదశి | 1881 |
| మూంతఖబు | 1898 |

అంకురార్పణతోపాటు, నన్నయ, తిక్కన, పోతన, వేమనల జయంతులూ పండుగల్లా ప్రతియేటా జరిపేవారు. ప్రాంతాలకు అతీతంగా సాహిత్యవేత్తల్ని, పండితుల్నీ, కవుల్నీ పిలిచి అమూల్య ఉపన్యాసాలిప్పించి సముచితంగా గౌరవించి సంస్కారాన్ని చాటుకొనేవారు. తక్కిన వారికి ఆదర్శంగా నిలిచేవారు. గురజాడ, గిడుగు, కొమర్రాజు వంటి వారి జయంతులు జరిపిస్తూ స్ఫూర్తిమూర్తుల్ని వర్తమాన తరానికి ఆత్మదర్శనాలు చేయిస్తున్నారు. ఎంతో పేరు ప్రఖ్యాతులు గాంచిన సందర్శకులు, ఉపన్యాసకులు, సన్మానితులు, పురస్కార గ్రహీతలు ఎవరిని పేర్కొనాలన్నా పట్టికలుగా ఇవ్వాల్సినంత మంది ఉండటం శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ

కార్యకలాపాల విస్తృతికి దాఖలాలు.

**పాత పత్రికా సంపుటాలూ**

ఎన్నో పెద్ద గ్రంథాలయాల్లో సైతం ఉన్న గ్రంథనిధుల్ని పాఠక సభ్య పరిశోధకులకు అందించడంలో సిబ్బంది కొరత వంటి ఇబ్బందులు లేకపోలేదు. కానీ ఈ గ్రంథనిలయంలో అడిగిన వెంటనే ఉన్న గ్రంథాల్ని ఉన్న పళంగా ఇచ్చే సొంత అమరికల విధానాలు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. 'విద్యార్థిగా నేను హైదరాబాదుకి వచ్చిన తొలినాళ్లలో అనర్ఘ రత్నాల్లాంటి తెలుగు గ్రంథాలను నా కళ్లలో నిలిపింది, ఈ భాషా నిలయమే' అంటారు సినారె. 1900కు పూర్వం అచ్చయిన పుస్తకాలు ఇక్కడ చాలానే ఉన్నాయి. యామిజాల ఆనంద్ అనే రచయిత సేవాభావంతో పట్టికను తయారు చేస్తూండటం అభినందనీయం. సాధారణంగా పెద్ద గ్రంథాలయాల్లో ఉండే వేదపురాణ శాస్త్రకృతులకు తోడు ఆధునిక ప్రక్రియల గ్రంథాలూ అనేకం ఇక్కడ ఉన్నాయి. ఆయా కవుల గ్రంథాలు, సంపుటాలూ ప్రత్యేకంగా ఉంచారు. రాష్ట్రవ్యాప్తంగా వచ్చిన ప్రత్యేక సంచికలెన్నింటినో దాచడం ఓ ప్రత్యేకత.

ఇలాంటివి ఇంకా ఉన్నాయి. వివిధ జ్ఞానశాఖల్లో సుందరయ్య విజ్ఞానకేంద్రం అభిలేఖ పత్ర రక్షణ కార్యక్రమంలో భాగంగా, ఇందులోని కొన్ని ముఖ్య ప్రాచీన గ్రంథాల్ని 2005- 2006 సంవత్సరాల్లో మైక్రోఫిల్ము చేశారు. కోస్తాప్రాంతంలో ప్రకటితమై ఇప్పుడు అక్కడ లభించని ప్రతికా సంపుటాలు కొన్ని ఇక్కడ లభ్యమవుతాయి. విశ్వశ్రీ అలాంటి పత్రికే.

ఇంకా... కృష్ణా పత్రిక, భారతి, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు, నవ్య సాహిత్య పరిషత్తు 'ప్రతిభ' సంపుటాలు, అరుదైన గోల్కొండ సంపుటాలు, త్రిలింగ, కిన్నెర, ఆంధ్రభారతి, ప్రబుద్ధాంధ్ర, నవ్వులతోట, శారద వంటి పత్రికల సంపుటాలు అన్ని ప్రాంతాల పరిశోధకులకు నిధి నిక్షేపాలుగా ఇక్కడ ఉన్నాయి. అంతేకాదు, బ్రాహ్మణేతర ప్రజాహిత పత్రిక 'సమదర్శి' కొన్ని సంచికలుండటం గమనార్హం.

**ఉత్సవాలు**

ఉత్సాహాన్ని ప్రేరేపించేవి, ముందుకు నడిపించేవి ఉత్సవాలు. 1927లో వజ్రోత్సవం, 1952లో స్వర్ణోత్సవం, 1962లో వజ్రోత్సవం, 1990లో నవశతాబ్ది ఉత్సవం, 2002లో శతాబ్ది ఉత్సవం వైభవోపేతంగా జరిగాయి. ప్రత్యేక సంచికలు విశేషాలతో చరిత్రాంశాలతో వచ్చాయి. నాలుగంతస్తుల సర్వాంగ సుందర భవన నిర్మాణానికి విశ్రాంత ఐఏఎస్ అధికారి కె.వి.రమణాచారి, ఎనభై అయిదేళ్ల స్వాతంత్ర్య సమరయోధులైన అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు నూతి శంకరరావు, డాక్టర్ ఎంఎల్ నరసింహారావు సేవలు అమూల్యం. ముఖ్యంగా 113 ఏళ్ల శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయానికి యాభై ఏళ్లకు పైబడి ప్రత్యక్ష సాక్షిగా ఉన్న ఎం.ఎల్.నరసింహా రావు కృషి గణనీయం. దీనికి ప్రస్తుతం ఇంచార్జి గ్రంథపాలకుడు శంకరరావు.

తెలంగాణ జాతీయ గ్రంథాలయంగా మరింతగా వృద్ధి చేసుకోవాల్సిన గొప్ప పొత్తపు గుడి ఇది. దాశరథి రంగాచార్య అన్నట్లు 'వెయ్యేళ్లు ఈ సంస్థ కాంతి మంతంగా జీవించాలి'.



**సన్నిధానం నరసింహాశర్మ**
హైదరాబాదు. 92920 55531



**వెంగళప్ప:** డాక్టర్, రోజూ రాత్రి ఎలుకలు ఫుట్‌బాల్ ఆడుతున్నట్లు కలలు వస్తున్నాయ్.

**డాక్టర్:** సరే, ఏం ఫర్లేదు. పడుకునే ముందు ఈ మాత్ర వేసుకోండి.

**వెంగళప్ప:** రేపు తీసుకుంటాలేండి, ఈ రోజు ఫైనల్ మ్యాచ్.



**సుక్కడు:** వెంగళప్పా, మీ ఇంట్లో దోమలబెడద ఎక్కువలా ఉంది?

**వెంగడు:** అవును ఏం చెయ్యాలో అర్థం కావడం లేదు.

**సుక్కడు:** రోజూ పడుకునే ముందు గుడ్‌నైట్ పెట్టు. అవే పారిపోతాయ్.

**వెంగడు:** అలానే పెట్టాను కానీ ప్రయోజనం కనిపించలే.

**సుక్కడు:** పెట్టి స్విచ్చాన్ చేశావా? లేదా?

**వెంగడు:** మరీ... మీ తెలివి గానీ, స్విచ్చాన్ చేయకుండా గుడ్‌నైట్ మెసేజీలు వెళ్తాయా ఏంటీ?

సుమేధల కండ్లల్ల నీల్లు కారబట్టినై. "అమ్మా! నేనూ నీ కొడుకునే అనుకో. నా పేరు సునీల్, ఈమె నీ కోడలు సుమేధ. మమ్మల్ని దీవించాలె కాని దండంపెట్టద్దు. నువ్వు దండంపెడ్తే మాకు ఆయుస్సు తగ్గుతది. ఇంక నువ్వేమీ సోంచాయించకు. నిన్ను సూసుకొనే బాధ్యత మాది. సుమేధ నీ దగ్గర్నే ఉండి సేవలు చేస్తది. ధైర్నం సెడద్దు. మన్సుల ఎస్మంటి రంది పెట్టుకోకు. అట్లైతెనే జల్దిన కోలుకుంటవ్" అనుకుంట సునీల్ జీవన ఆయురేదం దవకాన డాక్టర్ తోటి మాట్లాడిండు. తాను జి.బి.సిండరోమ్ వైర్స్ పాకిన గిసోంటి రోగుల్ని పత్తేకంగ కేర్ల (కేరళ) పాంతం వైద్గం (వైద్యం) లెక్కనే టీట్‌మెంటు చేత్తనని సెప్పిండు. కేర్లకెల్లి తెప్పిచ్చిన ఆయురేద నూనెతోటి మాలిష్ చేయిత్తనని ఒక నెల లోపల్నె కనకమ్మ పరిస్థితిల మార్పు అత్తదని, రెండు నెల్లలోపల్నే తాను నడిచేలా చేత్తనని భరోసా ఇచ్చిండు డాక్టర్. ఒక ఆయాను సుత ఏర్పాటు చేసిండు.

కనకమ్మ దవకాన్ల చేరిన తెల్లారి తన బిడ్డ రమ్య కండ్ల ముందర అగుపడెటాల్లకు ఇది కలగిట్లనా ఏంది? అన్నట్టు సూడబట్టింది. కనకమ్మను సూడంగనె రమ్య కెక్కడలేని దుక్కం రాబట్టింది. కలగాదు బిడ్డ నిజంగనే తన ముందర నిలబడ్డ దనిపియ్యంగనే దెబ్బకు రోగం పోయినట్టు లేవబోయింది కనకమ్మ. కాని లేవశాతగాలె. తల్లి అవత్త సూసి రమ్య తల్లి మీదపడి గొల్లుమన్నది. సుమేధ ఓదార్చసాగింది.

సునీల్‌ను సూసుకుంట కండ్లతోనే 'నా పానం నిలబెట్టినౌ కొడుకా' అన్నట్టు సూడబట్టింది కనకమ్మ. నిత్తె కేర్ల నూనెతోటి మాలిష్, దినం తప్పించి దినం కరెంటు షాకులిచ్చుడు, యాయామం. ఈటికి తోడు సుమేధ సొంత తల్లి లెక్క అర్సుకొనడంతో అనుకున్న గడువు కంటె ముందే కనకమ్మ వాకరు పట్టుకొని నిల్సుండడం, మెల్లంగ, మెల్లంగ అడుగులేయడం చూసి డాక్టర్ ఆశ్చర్యపోయిండు. ఆ గొప్ప సునీల్, సుమేధలకే దక్కుతదని చెప్తాంటె కనకమ్మ రెండు చేతులెత్తి సునీల్‌కు దండం బెట్టింది.

"కాదమ్మా, గొప్పదనమంతా నా సెల్లెలు రమ్యదే. తాను ఒక్తి మనిషిగాకున్నా సుమేధకు సారగంల సాయం సేసింది" అంటూ కనకమ్మ చేతులు పట్టుకొని సంబురపడబట్టిండు సునీల్.

కనకమ్మ డిచ్చార్జి అయింది. ఇంట్ల కడుగుపెట్టంగనే ఇద్దరు పిల్లలు "నాయనమ్మా!" అనుకుంట ఉర్కచ్చిండ్లు. ఎన్కాల్నె సిరునవ్వుల తోటి సుమేధ. పిల్లలను గుండెలకొత్తుకుంట సుమేధ వంక నోరు తెర్చి సూడబట్టింది కనకమ్మ. 'ఇంత చిన్న వయసుల ఇద్దరు పిల్లలా?' అన్నట్టు.

రమ్య, సునీల్ ఒక్కతోటోల్లే. కనకమ్మ సూపును తెలుసుకున్న సుమేధ "ఈ సందుల మా ఇంటిపక్క పాతమిద్దె కూలి తల్లిదండ్రులు సచ్చిపోతె అనాదలైన ఈ పిల్లలను సాదుకుంటానం. బాబుపేరు అవినాష్, పాపపేరు అనూష. నాకు పిల్లలు పుట్టే అవకాశం లేదు. పెండ్లయిన కొత్తలో

> ఎండిన బావిలో పిల్లలు గంతులు వేస్తారు
> (బాణలి)

కారు ప్రమాదం జరిగింది. గర్భసంచి తీసెయ్యకుంటే నా పానానికే పమాదమని ఆప్రిషన్ సేసి తీసేసిండ్లు" అని చెప్తాంటె కనకమ్మ, రమ్యలు బీర్పోయి ఇనబట్టిండ్లు.

ఏనాటి అనుబంధమో! ఇసోంటి మంచి మనుసుల ఇంట్ల అడుగు పెట్టుడు అని మన్సులో దేవున్ని మొక్కుకుంట కండ్లు మూసి తెర్సెటాల్లకు ఎదురుంగ గోడకు పూలదండేసి, దీపం ఎలిగిచ్చి ఊదుబత్తీలు పెట్టిన నిలువెత్తు పోటువ కన్పిచ్చింది. కనకమ్మకేదో యాదికత్తానట్టు కాబట్టింది. సునీల్ వంక సూసింది.

"అవునమ్మా, డాక్టర్ లచ్చుమయ్య మానాయన. ఈ మద్దెనే కాలం సేసిండు. మీ బతుకు పయనాన్ని సూసుకుంటనే ఉండేటోడట. 'మనమెంత సేసినా తక్కువే. కనకమ్మ బాకి తీరనిది' అని నాతోని అనేటోడు. 'ఆ మహాతల్లి ఇప్పుడు ఆపదలో ఉంది వెళ్లి ఆదుకోరా' మాకు సెప్పిన ఆకరి మాట అదే. చాతిల నొప్పచ్చింది. మమ్మల్ని ఇడ్సి ఎళ్లిపోయిండు. నాయన దినాలెల్లినంక నేను హరి ఇంటికి వచ్చిన. అప్పుడే హరి నిన్ను రోయిని దవకానకు తీసుకపోంగ సూసి మీ ఎన్కాల్నె అచ్చిన. హరి దవకాన కెల్లి బైటికి పోవుడు, గిరిని కలుసుకొని మాట్లాడుకొనుడు, ఏందో కీసులాడుకుంట ఇద్దరూ కోపంగా బైటికి ఎల్లిపోవుడు సూసిన. ఇంగత్తలేరు, అంగత్తలేరు.

ఆ డాక్టర్ మానాయన దోస్తే. ఇషయమంత సెప్పి ఒప్పిచ్చి నిన్ను తీసుకచ్చిన. నేను పుట్టిన సెనంలనే తల్లిని పోగొట్టుకున్న దురదుట్టవంతున్ని. నన్ను మీ పొత్తిల్లకు తీస్కొని మీ అమ్మాయి రమ్యతోబాటు నాకూ పాలిచ్చి నాకు పానదానం సేసావని నాయన నీ గురించి గొప్పగా సెప్పెటోడు. నాకు పోతపాలు యిమిడేవి గావంట. పెయ్యంత దద్దుర్లు లేసేటియట. కక్కుడు, నీల్లకు నీల్లు పారుకునేదట. రోజురోజుకీ నా పానం దగ్గర పడబట్టిందట. ఇంక నేను బతుకనని నా మీద ఆశ వదులుకున్నడట మానాయన. వచ్చే పానం... పోయే పానం అన్నట్టు నేను గావర చేత్తాంటె నాకు తల్లి పాలు పట్టాలని నువ్వు తెలుసుకొని నువ్వు సేసిన సాయం నా జన్మల తీరని బాకి. ఏ జన్మల బంధమో. నేను తిర్గి బతికి బట్టకట్టిన. 'ఒక డాక్టరుగా నేను చేయలేని పనిని ఆ మహాతల్లి సేసింది. తన బిడ్డతోబాటుగా నీకూ పాలిచ్చింది. ఇప్పుడామె పరిత్తితి అద్వాన్నంగా తయారైంది. కొడుకులు ఆమె బాగోగులు పట్టించుకుంట లేరు. ఆమెను ఆదుకొని కొంతలో కొంతైనా నీ బాకీ తీర్చుకో'మన్న తన ఆఖరి మాటలే నన్ను నీ కాడికి తీసుకచ్చినై. నీకు కొడుకులను, మనుమన్ని సూడాలనే బుద్ధి పుట్టినప్పుడల్లా నేను తీస్కపోయి సూయించుకొని వత్త. నీ దీవెన్ల తోటి సచ్చిబతికిన నేను మీసేవ సేసుకుంట" అనుకుంట సునీల్ బతిలాడ్తాంటె కనకమ్మ మనసు ఎన్నపూసోలె కర్గిపోబట్టింది. తన కడుపులో పుట్టకపోయినా సునీల్ సూయించే పేమ తన రెండు కాల్లను కట్టేసింది.

కంట్లె నీల్లు తుడ్సుకుంట కన్నద్దాలు సదురుకుంటాంటె కిటికీల కెల్లి హరి, గిరి దొంగ పిల్లుల లెక్క నక్కి, నక్కి తమ మాటలన్ని ఇంటానట్టు కనకమ్మ పసిగట్టింది.

* * *



**చెన్నూరి సుదర్శన్**
విశ్రాంత ప్రధానాచార్యులు,
హైదరాబాదు. 94405 58748

# పశ్చిమగోదావరి పలుకే బంగారం

ఏవండీ..! బాగున్నారాండి!! కొంపలో అంతా కులాసాయేనాండి!!! ఇలా వచ్చి, పెరట్లోకెళ్లి, రాతి గోళెం కాడ, మడాలు తడిసేటట్టు కాళ్లు కడుక్కోండి. టిపినీలు చేస్తారాండి.. ఏకంగా విస్తరేయమంటారాండి.. ఏవండీ, మిమ్మల్నేనండీ.. భోజనాల కాడ ఇంత మొగమాటం అయితే ఎలాగండి!? మాంచి వయసులో ఉండగా పేగు మాడనివ్వకుండా ఆరారగా ఏదో ఎంతోకొంత పంటికింద పడేసుకొంటే నిస్సత్తువ నిజంగా రాదని బతికున్నా రోజుల్లో మా బామ్మ అనేదండీ.. అదేటండీ గడ్డపెరుగు అంటే తల అడ్డంగా ఊపుతూ గబుక్కున నీళ్లు వొంపేసుకుంటారేంటండీ..!? అలాగైతే పూరీలాంటోరు చపాతి మాదిరి తయారవుతారండీ...

**మాట మాటలో మట్టిపరిమళం... సంభాషణలో సునిశిత హాస్యం... జాతీయాలు, సామెతల ప్రయోగంలో దిట్టతనం... అన్నీ కలిస్తే, ఒకనాటి 'పావన గోదావరి'. అదే నేటి పశ్చిమగోదావరి. తెలుగు నుడికారానికి గుడికట్టిన గడ్డ ఇది. తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన మహామహులకు ఊపిరిపోసిన ప్రాంతమిది.**

గోదారమ్మ ఒడి... కొబ్బరి చెట్ల సవ్వడి! ఎటు చూసినా పచ్చదనం!! ఏడాదికి మూడు పంటల ధనం!!!

మాగాణి భూముల్లో రత్నాల్లాంటి వరిగింజలు... పందాల బరిలో పౌరుషాన్ని ప్రదర్శించే కోడి పుంజులు... పరిమళాలు వెదజల్లే పూల తోపులు... ఔరా అనిపించే ఔషధ మొక్కల మోపులు... మిలమిల లాడే మొక్క జొన్న తోటలు... తీరగ్రామ భూముల్లో కూరగాయల మేటలు... మెట్ట ప్రాంతంలో మణిపూసల్లాంటి వాణిజ్య పంటలు... ఏజెన్సీలో ఎపుడూ తరగని అటవీ సంపదలు... తీపిని పంచే చెరుకు.. మంగళప్రదమైన పసుపు... శుభాల్నిచ్చే అరటి... మధురమైన మామిడి... పసిపిల్లలు ఇష్టపడే ఐస్‌క్రీమ్‌ల్లో వాడే 'కోకో' దగ్గర నుంచి తమలపాకు వరకూ అన్నీ పలకరిస్తాయి! పల్లవిస్తాయి!! పరిమళిస్తాయి!!! ఇలా అన్ని రుచులతో కడుపునిండా అన్నంపెట్టే అన్నపూర్ణగానే కాదు, సంపద... సంస్కృతి... సాహిత్యం... త్రివేణి సంగమంగా పేరులోనే గోదా'వరి'ని పెనవేసుకున్న పశ్చిమ వాసుల నిలయం! ప్రశాంతికి ఆలయం!!

అటు వ్యవసాయ రంగం- ఇటు ఆధ్యాత్మిక, కళ, సాంస్కృతిక రంగాల్లోనూ ఈ జిల్లాకు తనదైన ప్రత్యేకత ఉంది. చిన్న తిరుపతిగా పేరుగాంచిన ద్వారకా తిరుమల, ఆర్యవైశ్యుల ఇలవేల్పు కన్యకాపరమేశ్వరి ఆలయం, నిండు గోదావరి మధ్య దేవకూటాద్రిపై వీరభద్రేశ్వర స్వామి ఆలయం, భీమవరం గునుపూడి సోమేశ్వరాలయం, పాలకొల్లు క్షీరరామలింగేశ్వరాలయం, నరసాపురం ఆదికేశవ ఎం బెరుమన్నారు స్వామి కోవెల, కొల్లేరు పెద్దింటమ్మ గుడి, భీమవరం మావుళ్లమ్మ ఆలయం, తాడేపల్లి గూడెం బలుసులమ్మ దేవాలయం... ఆధ్యాత్మిక సౌరభాలకు ఇక్కడ కొదవ లేదు. గుంటుపల్లి బౌద్ధారామాలు, నిర్మలగిరి,



ఏలూరులోని సయ్యద్ బాజీ రహంతుల్లా దర్గా, కేథలిక్ చర్చ్ పుణ్యప్రద పునీతాలు. విదేశీ పక్షులతో అలరారే కొల్లేరు సరస్సు, ప్రకృతికి ప్రత్యక్ష ఆకృతులైన పాపికొండలు, పట్టిసీమ, పేరుపాలెం, అంతర్వేది అన్నాచెల్లెలు గట్టు తదితర పర్యాటక కేంద్రాలైతే ప్రపంచ ప్రఖ్యాతం.

**మీరెక్కడ్నించొచ్చారండీ!**

'గోదావరికి అటూ ఇటూ ఉంటాయి కాబట్టి ఈ రెండు జిల్లాలనూ పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి అన్నారు కాబోలు' అని అనుకుంటారు చాలామంది. కానీ, పశ్చిమగోదావరి జిల్లాకు ఆ పేరు రావడం వెనుక చాలా చరిత్ర ఉంది. అపుడెపుడో.. తణుకు, భీమవరం, నరసాపురం, కొవ్వూరు తాలూకాలలో కొల్లేరు వరకూ ఉన్న ప్రాంతాన్ని 'పానార విషయం' అనేవారు. వర్షం, పదం, విషయం, రట్టం, నాడు, పడి, బడి, వాడి, పాడి, వళహతం, వెంఠ, మండలం, మాగాణి, స్థలం, భోగం, దండ, కంపనం, కొట్టం, భూమి, పాంచాలి, సీమ మొదలైన పేర్లు వివిధ కాలాల్లో, విభిన్న ప్రాంతాలకు వినియోగించేవారు. అలా వేగినాడ, పావునవార, పానావార, పావినవార, పాగునార, ప్రాకునార, పాగుణార, పావనసీమ తదితర పేర్లు వివిధ శాసనాల్లో, గ్రంథాల్లో కనిపిస్తాయి. పవిత్ర గోదావరీ తీర్థంతో పశ్చిమంగా తడిసిన నేల కాబట్టి 'పావనవారి సీమ' అయ్యింది. జన వ్యవహారంలో అది 'పానావరం'గా, 'పావన గోదావరి'గా, అదే 'పశ్చిమ గోదావరి'గా మారిందన్నది చారిత్రక సత్యం!!!

**పద్యాన్ని హృద్యంగా...**

భారతీసతికి నైవేద్యంగా ఆధునిక కవిత్వాన్ని అద్భుతంగా, అనితర సాధ్యంగా సమర్పించగల కవి పండితులెందరో ఈ గడ్డపై పుట్టారు. చారిత్రక పరిశోధక పారంగతుడు చిలుకూరి వీరభద్రరావు (పెనుమదం), పరిశోధక పరమేశ్వర మల్లంపల్లి సోమశేఖర శర్మ (మినుమించిలిపాడు), తెలుగు కథకు అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చిన పాలగుమ్మి పద్మరాజు (తిరుపతిపురం), 'అమృతం కురిసిన రాత్రి' కవి బాలగంగాధర తిలక్ (తణుకు), చిలకమర్తి లక్ష్మీనరసింహం (వీరవాసరం), 'ఎంకి - నాయుడు బావ' కవి నండూరి వెంకట సుబ్బారావు (వసంతవాడ), హాస్యబ్రహ్మ భమిడిపాటి కామేశ్వరావు (ఆకివీడు), దివాకర్ల తిరుపతి శాస్త్రి (యండగండి), 'చివరకు మిగిలేది' బుచ్చిబాబు (ఏలూరు), విమర్శవ్యాస చక్రవర్తి దివాకర్ల వెంకటావధాని (యండగండి), ఒంటిచేత్తో భారత, భాగవత, రామాయణాలను రాసిన శ్రీపాద కృష్ణమూర్తి (యర్నగూడెం), ప్రముఖ నవలా రచయిత్రి ముప్పాళ్ల రంగనాయకమ్మ (బొమ్మిడి), కవిసుధానిధి భల్లం తిరుపతిరాజు (వీటం), అందమైన వెన్నెల కవి రసరాజు (తణుకు) తదితరులెందరో ఈ జిల్లా వాసులే.

'సురభి' మూల పురుషుడైన వనారస గోవిందరావు... 1916లో భీమడోలు గ్రామానికి పక్క, ద్వారకా తిరుమలకు వెళ్లేదారిలో ఉన్న 'పోలసానిపల్లె'లో స్థిరపడ్డారు. ఆయన సమాజం పేరు 'గోవిందరాయ సురభి నాట్యమండలి'. ఇక్కడ ఆయన ఓ పాఠశాల కట్టించారు. అది ఇప్పటికీ విద్యాపరిమళాలను వెదజల్లుతోంది. ఆ తర్వాత కాశీనాథుని నాగేశ్వరావు పంతులు, ఆచంట సాంఖ్యాయనశర్మ ప్రభృతులతో 1929లో ఆంధ్రనాటక కళాపరిషత్‌కు ఈ జిల్లాలోనే అంకురారోపణ జరిగింది. ప్రముఖ నాటక నటులు కర్రి అబ్బులు (అత్తిలి), బాల గంధర్వ షణ్ముఖి ఆంజనేయ రాజు (తణుకు), మద్దాల రామారావు (తాడేపల్లి గూడెం) వంటి వారూ పుట్టింది ఈ నేల మీదే.

**మాటల ముత్యాలు**

అరిపానం - బలహీనం
వర్ర - కారం
పొవ్వాకు - పొగాకు
పేవ - ప్రేమ
అత్తం - స్నేహం
ఆబోరు- పరువు
ఆవ - గడ్డివాము
ఇంగిలి కాయలు - మంచినీటి చేపలు
ఉమ్మనం - పొగరు
ఐనిల్లు - మంచి ఇల్లు
ఒల్లడు - ఒప్పుకోడు
ఓట్రింపు - నిరసన
కనమ - మిగిలిన
సీనా - చక్కెర
ఆదోబూదో - లాభమో నష్టమో
తాకళ్లు - తాకట్టు
పలగం - పొలం
అమ్మక్క - పెద్దమ్మ

**మాట మధురం**

ఇక్కడ ఇనుము కూడా మెత్తగా ఉంటుంది అంటాడో కవి మిత్రుడు. తీర ప్రాంతం కదా తడి ఎక్కువ.. మడి కూడా ఎక్కువ కానీ ఆతిథ్యానికి అప్పు చేసైనా లోటు రానీరు. ఇంటికి వచ్చిన అతిథినే కాదు చిరునామా అడిగిన వారిని సైతం రండి.. అయ్యా.. అమ్మా.. తమరు.. మీరు అంటూ గౌరవంగా పలకరిస్తారు. అందులో అప్యాయతనూ మేళవిస్తారు. చిత్రమేమిటంటే- దెబ్బలాడుకునేటప్పుడు కూడా తమరు, మీరు, అండి అని సంబోధించుకుంటారిక్కడ.

పుస్తెల తాడు అమ్మి అయినా పులసలు తినాలి... అప్పు దొరికితే పప్పుతో పాటు ఉప్పు చేప కూడా... కంచం అమ్మి మట్టెలు కొన్నట్టు... చేతిలోది లేత, చేలోది ముదర... బంగారముంటే సింగారానికేమి కొదువ... ఇలాంటి సామెతలెన్నో ఇక్కడి ప్రజల నాలుకలపై తరచూ నాట్యం చేస్తాయి. ఇక పశ్చిమాన పరిఢవిల్లే పలుకుబడులైతే ఎన్నో... ఎన్నెన్నో! వాటిలో ముఖ్యమైనవి...

**అఘోరించు:** అఘోర శబ్దం సంస్కృతం. శివుడి అయిదో ముఖం. దక్షిణ దిశలో శ్మశానం వైపు ఉండేది. అతిభయంకరంగా ఉంటుందని అర్థం. ఈ పదాన్ని ఇక్కడ రెండు రకాలుగా ప్రయోగిస్తారు. ఎలాగో

ఒకలాగ చెయ్యమనో.. చెప్పమనో.. వినమనో.. కనమనో.. బాధపడమనో.. అనడానికి ఒకరకమైతే, రెండోది ఆక్షేపణ. నిరసన, నిర్లక్ష్యం, విచారం, వేళాకోళంగా 'అఘోరించావులే' అనే విధంగా!

**ఊదరపెట్టు:** నసపెట్టు, పొగపెట్టు అనే రెండు విధాలుగా వాడుకలో ఉంది. పొగచుట్టల్ని ఒక దానికొకటి ఆనించి నిప్పు అంటించుకోడాన్ని 'ఊదర' అంటారు. సణుగుడుగా బాధించడాన్ని కూడా ఇదే పదంతో వ్యవహరిస్తారు.

**దేవిరించు:** దేవిరింపు, దేవిరింత, దేబెరింత, దేవురుగొట్టు లాంటి అర్థాలున్నాయి. 'దేబె' అనే నామ పదానికి 'ద్రాపె' అని అర్థం. అంటే కక్కుర్తి మనిషి, అప్రయోజకుడు, మూర్ఖుడు, అధముడు అనే అర్థాల్లో ఈ జిల్లా వాసులు వాడుతుంటారు. 'పోర్లితే గాని దేబెగాడు కాడు' అనే సామెత ఇక్కడ ప్రఖ్యాతం.

**ఛప్పన్నారు:** పూర్వం- అంగ, వంగ, కళింగ, కాశ్మీర, కాంభోజ... 56 ప్రత్యేక

దేహమంతా కళ్లు కానీ దేవేంద్రుడిని కాను
నరుడు సాయం లేకపోతే
ఎటూ నడవలేను ఎవరు నేను (బండి)

నూనె కండకు నూటొక్క తూట్లు
(జల్లెడ)

ఆకాశాన అరవైఆరు కొడవళ్లు
(నెలవంక)

రాజ్యాలుండేవి. వీటిని హిందీలో 'ఛప్పన్న దేశ' అంటారు. ఛప్పన్ అంటే యాభై ఆరు. దానికి చివర తెలుగు సంఖ్యాపదం ఆరును చేర్చి అర్థభేదం లేనట్లు వ్యవహరించటం ఈ జిల్లా వాసుల ప్రత్యేకత. విడివిడిగా వినూత్నంగా బతికే వారిని ఈ మాటతో పిలుస్తుంటారు. ఇందులో కొంత వ్యంగ్య వైభవం లేకపోలేదు.

పశ్చిమగోదావరి జిల్లాకు తనదైన పదసంపద ఉంది. 'గూదోడు' అంటే 'చిన్నపిల్లాడు'... 'కూడ' అంటే 'అరుపు'... ఇలాంటి మాటలెన్నో ఇక్కడ వినపడతాయి. తినడానికి, చూడటానికి తదితర పదాలిక్కడ 'తిన్నాకి, చూన్నాకి' అవుతాయి. 'దగ్గరికి' బదులు 'కాడికి', 'ఎక్కడ'కు మారుగా 'ఏడ' లాంటివి పలుకుతాయి. పోలిక చెప్పాల్సిన వచ్చినప్పుడు 'మల్లే' ('లాగా'కు బదులుగా) వాడుక ఎక్కువ. చీకట్నే, తెల్లార గట్ట (తెల్లవారుజామున)... బారెడు పొద్దు (ఉదయం)... మజ్జానాలు (మధ్యాహ్నం)... సందాల (సాయంత్రం)... మాపున, మాపటికి, మాపటేల, మాపులకి (రాత్రి)... కాలసూచికల్లోనూ పశ్చిమం ప్రత్యేకమే.

కట్టపడితేనే ఒత్తాయండీ అంటూ చేలల్లో రెక్కలు ముక్కలు చేసుకునే పశ్చిమగోదావరి ప్రజ... ఆధునిక కాలంలోనూ నాటి తెలుగు సంస్కృతిని 'జారత్తగ' కాపాడుకుంటోంది. తనదైన యాసను నిలుపుకుంటూ ముందుకు సాగుతోంది.

ఇంతేనండీ మరి!



**ఎస్.ఆర్.భల్లం,**
సాహితీవేత్త, తాడేపల్లిగూడెం.
98854 42642

# మీ ఊరూ... అందమైన పేరూ...

గుర్రంపోడ్ · ఓజిలి · మోపిదేవి · బేల · పూడి · ఔకు

**కార్వేటినగరం**

ఇది చిత్తూరు జిల్లాలోని ఒకప్పటి సంస్థానం. ఈ ఊరు తమిళనాడు సరిహద్దులో ఉంది. కనుక ఇక్కడ తమిళ భాషా సంస్కృతుల ప్రభావం కనిపిస్తుంది. తమిళంలో 'కాడి' అంటే 'అడవి', 'వెట్టి' అంటే 'నరకడం' అని అర్థం. నగరి అంటే రాజులు నివాసం ఉండే ప్రాంగణం. అడవిని నరికి నిర్మించిన రాజప్రాసాదం అన్న అర్థంలో దీనికి 'కాడివెట్టినగరి' అన్న పేరు వచ్చింది. కాలక్రమంలో రూపాంతరం చెంది 'కార్వేటినగరం'గా స్థిరపడింది. ఇక్కడ ఇప్పటికీ ఆనాటి సంస్థానపు ఆనవాళ్లు కనిపిస్తాయి.

**- జె.నందిని, కార్వేటినగరం**



**కాతేరు**

రాజరాజ నరేంద్రుడి మొదటి భార్య కుమారుడు సారంగధరుడు. రెండో భార్య చిత్రాంగి. ఆమె సారంగధరుణ్ని మోహించింది. రాకుమారుడు ఒప్పుకోక పోవడం, అతనిపై చిత్రాంగి నింద వేయడం, ఆ తర్వాత కథ తెలిసిందే. నిజం తెలుసుకున్న రాజు చిత్రాంగిని చంపి రాజమహేంద్రి శివార్లలో ఒకచోట పాతేరు. రాన్రాను ఆ ప్రదేశంలో గ్రామం ఏర్పడింది. అదే పాతేరు. ఈ పేరే కాతేరైంది. ఇప్పుడిది గ్రేటర్ రాజమండ్రిలో భాగం. చిత్రాంగిని పాతిన స్థలంలో ఒక రాయి పాతేరు. ఇప్పుడు ఆ రాయి ఆనవాళ్లు లేవు.

**- తూట తాతారావు, రాజమండ్రి**

**ఈ పేర్లన్నీ మన రాష్ట్రంలో ఉన్న కొన్ని ఊళ్లవి! ప్రతి పేరు వెనుకా ఓ చరిత్ర ఉంది. ఇలాంటి అందమైన పేర్లు గల ఊర్లు, వాటి పేర్లకున్న చరిత్ర మీకు తెలిస్తే మాకు పంపించండి. సాధికారికంగా ఉన్నవి మీ పేరుతోనే తెలుగు వెలుగు పత్రికలో ప్రచురిస్తాం.**



# రంగమ్మ రోడ్డున పడింది

రోజంతా ఎండ గొడుగు కింద నడుస్తూ చేతివేళ్ల కొసల్లోంచి పత్తి
పూలను పూయించి ముగ్గుబుట్ట తలను మట్టిబుట్టలా మార్చి
చెరువంత చెమటోడ్చి
దోసిలంత తిండిగింజలను తెచ్చేది రంగమ్మ
పేరులోనే అమ్మ ఉన్నందుకేమో
రంగమ్మ మమకారాన్ని రెండింతలు చూపేది
కన్నవాళ్లని ప్రాణంపెట్టి పెంచింది
కట్టుకున్నవాడికి ప్రాణం పోసి నిలిపింది.

* * *

పుట్టినప్పుడు ఆమె పేరు రంగి... పాలనురుగులా మెరిసిపోయేదట
బుద్ధెరిగిన నాటి నుంచి అవ్వతోపాటు పొలం గట్లంట నడిచి
కూలీగా పదోన్నతి పొందిందట పెళ్లిచేసుకొని
అత్తగారింటికి వచ్చాక పొయ్యి దగ్గరే బతుకంతా తెల్లారి
నల్లని మసిబొగ్గులా మారిందట అయితేనేం
చల్లని తల్లి రంగమ్మ కడుపునిండా బిడ్డల్ని కన్నది
కంటిపాపల్లా చూసుకొన్నది
కొడుకుల్ని చదివించటం కోసం
చేతులతో దుక్కిదున్నింది, బిడ్డల పెండ్లి కోసం
కళ్లని నాగళ్లుగ చేసుకొన్నది రంగమ్మ, కన్నీటి విత్తనాలు
పంటల్ని పండించాయో లేదో తెలీదు కానీ కొడుకుల బతుకుల్లో
ఉద్యోగాల పూలను మాత్రం పూయించాయి
ఆ పూలను బొకేలుగా మార్చి వారంతా పట్నానికి ఎగిరిపోయారు
ఇప్పుడు...
ఆకాశమంత చెట్టుకింద భూదేవంత అరుగు మీద
గడ్డిగుడిసె సూరునీడలో రంగమ్మ ఒంటరి...
పల్లెపాటలు చదివినందుకో
రైతు జీవితం అర్థం చేసుకున్నందుకో
మొదట్నుంచీ గుండెను మాత్రం నమ్ముకుంది
అందుకే- గుండెను బద్దలు చేయటం
కొడుకులకు సులువైంది

* * *

బిడ్డల తర్వాత బిడ్డలాగా పొలాన్ని నీళ్లతో తలంటుపోసింది
విత్తనాలతో అలంకరించింది. వరినాట్లతో రంగులు పూసింది.
పొలానికి కూడా కొడుకుల లక్షణాలు వచ్చాయేమో,
విరగ కాసిన వరిచేను కాస్తా ఒక్కనాటి గాలివానతో
గింజలన్నీ నేలపై రాల్చేసింది అప్పుడు
కండ్లలో వత్తులేసుకుని కాపాడుకున్న కొడుకులు మోసం చేశారు.
ఇప్పుడు...
కంటిమీద కునుకు వెయ్యకుండా
కాయకష్టం చేసిన పంట దగాచేసింది
మొండి రంగమ్మ బండబారిపోయింది
జగమొండి రంగమ్మ జల్లెడలా గాయపడింది
దిక్కుతోచక తన దిక్కుచూసేవారు లేక
దిక్కుల్ని వెతుకుతూ దిక్కుకో కన్నీటి సందేశాన్ని పంపుతూ
అందరికి అన్నం పెట్టిన రంగమ్మ ఆకలితో రోడ్డునపడింది
రోడ్డుకే బలైంది రంగమ్మ రోడ్డులో కలిసిపోయింది.

* * *

ఆ రంగమ్మ
మనలో ఎవరి అమ్మైనా కావొచ్చు
కొన్నాళ్ల తర్వాత
మనమే కావొచ్చు...

- **శ్రీలక్ష్మి ఐనంపూడి,** ఆకాశవాణి కేంద్రం ప్రయోక్త, హైదరాబాదు. 99899 28562

కళ్లు
సీతాకోక చిలుకలు
ఎగరనీయండి
అద్భుతాలు చూస్తాయి.



గడప
కట్టుబాట్లకు చివరి మెట్టు
అయినా దాటవలసిందే
చాలా విజయాలు బయటే ఉన్నాయి.



ఎప్పుడో రాసుకున్న పద్యాలు
మళ్లీ చదువుకున్నాను
పాతముత్యాలు తళుక్కుమన్నాయి.



- **సూరారం శంకర్,** కామారెడ్డి, నిజామాబాద్ జిల్లా.

# ఏడవకు ఏడవకు వెర్రినాగన్న

**బాలసాహిత్యం ఒక కళా స్వరూపం. సంగీతంలా, చిత్రలేఖనంలా దాని సందేశం సౌందర్యయుతం, ఆనందమయం. బాలసాహిత్యంవల్ల విద్యాప్రయోజనాన్ని సాధించవచ్చు. దాని ఆశయం ఆనందమే అయినా, దాని గమ్యం జ్ఞాన ప్రధానం.**

విని, జ్ఞాపకం ఉంచుకోగల వయసు కలిగినవారే బాలలని చిన్నయసూరి భావన. నేటి బాలలే రేపటి పౌరులు. కనుక ఉత్తమ పౌరులుగా తయారవ్వాలంటే బాలలలో సుగుణాలు పెరగాలి. 'పౌరుల నైతికాభివృద్ధే దేశాభివృద్ధి' అన్నాడు అంబేద్కర్. పౌరులు మంచివారిగా మనగలగాలంటే పిల్లలుగా ఉన్నప్పుడే వారికి పంచతంత్ర కథల్లోని సారాన్ని అందించాలి.

సాహిత్య శ్రవణం వల్ల శ్రమ కలుగదు. పైగా శ్రమ నివారణ అవుతుంది. ఉత్సాహం, ఊహా బలం పెరుగుతుంది. ఆత్మగౌరవం, నైతిక విలువలు, సృజనాత్మకత, మానవ సంబంధాల ఎరుకను, నాయకత్వ లక్షణాన్ని, సామాజిక బాధ్యతను పెంచి రేపటి ప్రపంచంలో ఉత్తమ పౌరులుగా తయారవడానికి పిల్లలకు బాలసాహిత్యం ఎంతో తోడ్పడుతుంది.

ప్రాచీన కాలంలో మగపిల్లలకు అయిదు నుంచి ఎనిమిదేళ్ల మధ్య ఉపనయనం చేసి, వేదాలు, శాస్త్రాలు నేర్చుకోవడానికి గురుకులాలకు పంపేవారు. ఒక వేదానికి పన్నెండు, శాస్త్రానికి పన్నెండు సంవత్సరాల కాలం పట్టేది. గురువులు వాటితోపాటు, తాము చూసిన, విన్న, రాజాస్థానాల్లో జరిగిన సంగతులను తెలిపి శిష్యులను తీర్చిదిద్దేవారు. దీని గురించి హర్షవర్ధనుని కాలంలోని సంఘటనల గురించి శ్రీహర్షుడు సంస్కృతంలో చెప్పగా, శ్రీనాథుడు శృంగారనైషధంలో 'ఘట్టకుటీప్రభాతన్యాయం' గురించి ఇలా చెప్పాడు. ఒక వ్యాపారి ఒక పట్నంలో తన పని పూర్తయ్యాక పన్ను వసూలు అధికారుల నుంచి తప్పించుకుందామని అర్ధరాత్రి వేరే తోవలో ఊరు దాటాలనుకుంటాడు. రాత్రంతా సందులూ గొందులూ తిరిగి అలసిపోతాడు. తీరా తెల్లవారే సరికి ఆ పన్ను వసూలు అధికారి ఇంటి ముందుకే చేరతాడు. ధర్మం తప్పి, పక్క మార్గాన వెళ్లాలనుకున్నా కుదరదన్నది దాని సారాంశం.

**పురాణాల్లోనూ జానపదాల్లోనూ..**

ఆనాటి కాలంలో ఉన్న సాహిత్యమంతా పురాణ, కావ్య సాహిత్యమే. భారతంలో ఉదంకోపాఖ్యానము, కచదేవయాని, లుబ్ధకపోతోపాఖ్యానం, భాగవతంలోని గజేంద్రమోక్షం, ప్రహ్లాద చరిత్ర, ధ్రువ చరిత్ర, అనంతామాత్యుని భోజరాజీయంలోని ఉపకథలు ఇలాంటివన్నీ తొలితరం బాలసాహిత్యంగా చెప్పుకోవచ్చు. అయితే ఇది కేవలం ఆనాడు బాలురకు, అందునా కొన్ని వర్గాలకు గురుకులాల్లో పరిమితమైంది. మిగిలిన సామాన్య జనులకు జానపద సాహిత్యం తోడై నిలిచింది. శిశువు పుట్టినప్పటి నుంచే తల్లి ఆశువుగా పాడే జోలపాటలు, లాలిపాటలు పిల్లల మనసును పట్టుకునేవి. పిల్లలు గుక్కపట్టి ఏడ్చినప్పుడు, 'జోజో... హాయి/ ఏడవకు ఏడవకు వెర్రినాగన్న/ ఏడిస్తే నీ కళ్ళు నీలాలు కారు/ నీలాలు కారితే నేచూడలేను/ పాలైన కారవే బంగారు కళ్లు/ ఉచ్చోళొ... ళో... హాయి' అంటూ తల్లి పాడుతుంటే పాపలు ఆదమరచి నిద్రపోయేవారు.

కాస్త పెద్దయ్యాక భారత, రామాయణ కథలతోపాటు వీధి భాగవతాలు, చిందు, యక్షగానాలు జానపదులు వినిపించే పాటలు, కథలు పిల్లలను రంజింపజేస్తుండేవి. వారికి తెలియకుండానే పిల్లల మనసులో సుగుణాల పట్ల, సాహిత్యం పట్ల ఆకర్షితులయ్యేవారు.

**అనువాద బాల సాహిత్యం..**

తెలుగునాట అనేక ప్రక్రియలు ఆంగ్ల ప్రభావంతో అడుగు పెట్టినట్లుగానే, బాలసాహిత్యం కూడా దాని ప్రభావంతోనే ఒక శాఖగా వచ్చింది. 1897లో గిడుగు సీతాపతి 'బోయ్స్ ఓన్ మాన్యువల్' పుస్తక ప్రభావంతో చిలుకమ్మ పెండ్లి, రైలుబండి మొదలైన గేయాలు రాసినట్లు, బాల






సాహితీమాల పరిచయంలో చెప్పుకున్నారు. అప్పటికే ఆంగ్లంలో ఉన్న జొనాథన్ స్విఫ్ట్ రాసిన 'గలివర్స్ ట్రావెల్స్'ను గలివర్ నౌకాయాత్రలు పేరుతో కాళ్లకూరి హనుమంతరావు, అంగుష్టమాత్రుల చిత్రద్వీపం, తాళప్రమాణుల లంకా రాజ్యం శీర్షికలతో కమలాకర వెంకట్రావు తెలుగులోకి అనువదించి ప్రచురించారు. అలాగే మార్క్ ట్వైన్ రాసిన 'ప్రిన్స్ అండ్ పాపర్' రాజు పేద పేరుతో, హకల్ బెరిఫిన్ - 'అడ్వెంచర్స్ ఆఫ్ హకల్ బెరిఫిన్' పేరుతో, లూయి స్టీవెన్సన్ నవల 'ట్రెజర్ ఐలండ్' కాంచనద్వీపం పేరుతో అనువాదాలై 'ఆంధ్ర వారపత్రిక'లో ధారావాహికగా వెలువడ్డాయి. ఇవి బాలల్లో ధైర్యసాహసాలను పురికొల్పి, చదువు పట్ల ఆకర్షితులను చేశాయి.

అలాగే 'ది కాల్ ఆఫ్ ది వైల్డ్' జాక్ లండన్ నవలను కొ.కు ప్రకృతి పిలుపు పేరుతో అనువదించగా, వీరనారి శీర్షికన 'జోన్ ఆఫ్ ఆర్క్' గురించి లతానాథ్ అనువాదం చేశారు.

ప్రపంచ ప్రసిద్ధి చెందిన పంచతంత్ర కథల్ని మిత్రలాభం, మిత్రభేదం, సంధి, విగ్రహం పేర్లతో చిన్నయసూరి, వీరేశలింగం వంటివారు తెలుగులోకి అనువదించారు. ఈసప్ కథల్ని కూడా కందుకూరి తెలుగులోకి అనువదించారు.

**బాల సంస్కరణ సాహిత్యం**

వీరేశలింగం చింతామణి, సతీహిత బోధిని, సత్యసంవర్ధిని పత్రికల్లో చిన్నచిన్న కథలు రాసి, పిల్లలకు, స్త్రీలకు చక్కగా అర్థమయ్యేలా తమ వ్యక్తిత్వాన్ని మెరుగుపరచుకునేలా అందించారు. బాదంకాయ, వరికంకులు, బ్రాహ్మణి, ముంగిస, పరోపకారము అనే చిన్న కథలు, నీతిపద్యాలు సతీహిత బోధినిలో ప్రచురించారు. బాలబాలికలకు మంచిపుస్తకాలు అందించాలనే సదాశయంతో శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి వంటి పండితులు స్త్రీ నీతిశాస్త్రమనే పద్యకావ్యాన్ని రచించారు. 1871లో కొమ్ము రంగయ్య 'స్త్రీ నీతి సంగ్రహం' విద్యార్థుల చేతుల్లోకి వచ్చింది. 1874లో గజ్జెల రామానుజుల నాయుడు కడపలో జిల్లా మున్సిఫ్‌గా పనిచేస్తూ, బాలుర కోసం వివేక సంగ్రహం, బాలికల కోసం సతీహిత సంగ్రహం అనే చక్కని బాలసాహిత్యం ప్రకటించారు.




**ఆకాశవాణిలో బాలానందం...**

1937 నుంచి మద్రాసు రేడియో కేంద్రం పిల్లల కోసం కార్యక్రమాలు ప్రసారం చేసింది. 1939లో న్యాయపతి రాఘవరావు, కామేశ్వరిలు రేడియోలో చేరి, బాలానందం కార్యక్రమానికి కొత్తరూపును తీసుకొచ్చారు. 1940లో బాలానంద సంఘం ఏర్పడింది. 40 ఏళ్లపాటు ఈ దంపతులు రేడియోలో ఆబాలగోపాలాన్నీ అలరించారు. పిల్లల కోసం గేయాలు, కథలు అనేకం వెలువరించారు. వీరితోపాటు ఏడిద కామేశ్వరరావు, తాళ్లపూడి వెంకటరమణ, యం.ప్రభాకర్‌రెడ్డి, తాడి వెంకట కృష్ణారావు, వింజమూరి లక్ష్మి వంటివారు చక్కని పిల్లల కార్యక్రమాల్ని అందిస్తూ, బాలసాహిత్యం ఎదుగుదలకు ఇతోధికంగా కృషి చేశారు.

తరువాత కాలంలో లబ్ధప్రతిష్ఠులైన వెంకట పార్వతీశ్వర కవులు, వావిలికొలను సుబ్బారావు, చింతా దీక్షితులు, ఏటుకూరి వెంకట నర్సయ్య, చక్రపాణి, అడవి బాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణ, నాళం కృష్ణారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, కె.సభా వంటి వారు బాలల కోసం అనేక రచనలు చేశారు. దాశరథి, సినారె రామాయణ, భారతాలను కమ్మని శైలిలో రాశారు.

**వైజ్ఞానిక కథా వీచికలు**

1947లో స్వాతంత్ర్య వెలుగు రేఖలు భారతమంతా పరుచుకోగానే బాలసాహిత్యం కూడా రెక్కలు విప్పుకుంది. చిన్నతనంలోనే సాహిత్యం అలవాటు చేయాలనే సదుద్దేశంతోనూ, పురాణ, నీతి కథలే కాకుండా పిల్లల్లో వైజ్ఞానిక దృష్టి, శాస్త్రీయ ఆలోచనలు, లోకజ్ఞానం, స్నేహం, పట్టుదల, శ్రద్ధ, పరోపకారం వంటి సుగుణాలను బాలలకు అందించాలని పెద్దలు తలచారు.

1951 ప్రాంతంలో వేమరాజు భానుమూర్తి 'సైన్స్ కథ' అనే వైజ్ఞానిక పుస్తకాన్ని విజ్ఞానం ఎలా వికసించిందో పిల్లలకు అర్థమయ్యే శైలిలో రాశారు. అలాగే ఈయన సమకాలికులు వసంతరావు వెంకటరావు 1950-60ల మధ్యకాలంలో, విజ్ఞాన వికాసం, విజ్ఞాన వీధులు, విజ్ఞాన విస్ఫులింగాలు, ఎలక్ట్రాను ఆత్మకథ వంటివి రాశారు. కొడవటిగంటి కుటుంబరావు శాస్త్ర పరిశోధనలు, ప్రాణుల ప్రపంచం, లోకాంతర యానం వంటివి రాశారు. రావూరి భరద్వాజ విచిత్ర ప్రపంచం, తెలుసుకుందాం వంటివి రాయగా, మహీధర ప్రపంచానికి ఆఖరు ఘడియలు, బంగారు ఉన్ని రాశారు.

దేవులపల్లి రామానుజరావు ఆదిమ నివాసులు పుస్తకాన్ని రాశారు. మహ్మద్ ఖాసింఖాన్ తెలుగులో తొలి బాలవిజ్ఞాన సర్వస్వాన్ని ప్రచురించారు. ప్రస్తుతం సి.వి.సర్వేశ్వరశర్మ, జమ్మి కోనేటిరావు, వాసవ్య మొదలైనవారు విజ్ఞాన శాస్త్ర రచనలను వెలువరిస్తున్నారు.

**బాలల కోసం పత్రికలు**

మొదటిసారిగా తెలుగులో మేడిచర్ల దక్షిణామూర్తి 1940లో 'బాలకేసరి' అనే పిల్లల పత్రికను ప్రారంభించారు. ఆ తరువాత 1945లో 'బాల' మాసపత్రిక వెలువడింది. ఈనాడు రచయితలుగా, చిత్రకారులుగా ప్రసిద్ధులైన వాళ్లందరూ ఒకప్పటి 'బాల' రచయితలే.

తరువాత 1947లో నాగిరెడ్డి, చక్రపాణి 'చందమామ' పత్రికను స్థాపించి, 16 భాషల్లో వెలువరించారు. సుమారు 60 సంవత్సరాలపాటు అప్రతిహతంగా నడిచింది. ఇందులో పురాణ, విజ్ఞాన, లౌకిక కథలే కాకుండా చదువరుల బుర్రకు పదును పెట్టే బేతాళ కథను కూడా ఇచ్చేవారు.

1979లో బాలల అకాడమీ ఆధ్వర్యంలో ఏడిద కామేశ్వరరావు సంపాదకులుగా 'బాలచంద్రిక' వెలువడి, కథలే కాకుండా పిల్లలకు క్విజ్, జనరల్ నాలెడ్జ్ వంటి శీర్షికలను అందజేశారు. 1980లో నండూరి రామమోహనరావు సంపాదకత్వంలో వెలువడిన 'బాలజ్యోతి' వైజ్ఞానిక నవలల పోటీలను కూడా నిర్వహించింది. బాలబంధు బి.వి.నరసింహారావు సంపాదకత్వంలో 'చిరుమువ్వలు', విశాలాంధ్ర 'చిన్నారి లోకం', అరిబండి బాల సాహిత్య ట్రస్టు నుంచి 'మామయ్య' పేరుతో వెలువడిన పిల్లల పత్రికలు చక్కని రచనలను అందించాయి.

**నేటి బాల సాహిత్యపు దివ్వెలు**

ఇప్పటి వరకూ 70 నుంచి 80 వరకూ పిల్లల పత్రికలు తెలుగునాట వెలువడినా, ప్రస్తుతం నిలబడినవి వేళ్లపై లెక్కించదగినన్ని మాత్రమే. మద్రాసు కేంద్రంగా వెలువడుతున్న బాలమిత్ర, బాలభారతి, బుజ్జాయి, బొమ్మరిల్లు ఇతోధికంగా సాహిత్యసేవ చేస్తున్నాయి. హైదరాబాద్ నుంచి వేదాంత సూరి సంపాదకత్వంలో వెలువడుతున్న 'మొలక', చందమామలో ఆర్టిస్టుగా పనిచేసిన శక్తిదాస్ 'చంద్రబాల', విశాఖ నుంచి యస్వీ రమణమ్మ సంపాదకత్వంలో 'బాలబాట', ఎం.వి.వి.సత్యనారాయణ సంపాదకత్వంలో 'శ్రీవాణి పలుకు' బాల సాహిత్యాన్ని వెలువరిస్తున్నాయి.

రామోజీ ఫౌండేషన్ ద్వారా 2013 జూన్ నుంచి 'బాలభారతం' వెలువడుతోంది. మారిన బాల, బాలికల అభిరుచులకు అనుగుణంగా విజ్ఞాన, వినోద విషయాలే కాకుండా, జానపద, సాంఘిక కథలతోపాటు వింతవింత సంగతులనీ అందిస్తూ బాలసాహిత్యాన్ని ఇష్టపడే వారికి మృష్టాన్న భోజనాన్ని వడ్డిస్తోంది.

ఇవేకాక తెలుగునాట దిన, వార, మాసపత్రికలు పిల్లల కోసం ఒక పేజీని కేటాయించి, చక్కని కథలు, క్విజ్‌లు, వింతలు, విశేషాలతో బాలల పట్ల తమ ప్రేమను చెప్పకనే చెబుతున్నాయి.

**మరింత ప్రోత్సాహం అవసరం..**

కేంద్ర సాహిత్య అకాడమీ 2010 సంవత్సరం నుంచి తెలుగులో బాలసాహిత్యానికి కూడా పురస్కారాలు ప్రకటిస్తోంది. 2010లో కలువకొలను సదానంద, 2011లో భూపాల్, 2012లో రెడ్డి రాఘవయ్య, 2013లో సుజాతాదేవి, ఈ ఏడాదిలో దాసరి వెంకటరమణకు అకాడమీ పురస్కారాలు దక్కాయి. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం బాలసాహిత్య రచయితలను గౌరవిస్తోంది. పురస్కారాలతో సత్కరిస్తోంది.




తెలుగులో ప్రముఖంగా వెలగా వెంకటప్పయ్య, పత్తిపాక మోహన్, ఎన్.శివనాగేశ్వరరావు, మాచిరాజు కామేశ్వరరావు, చొక్కాపు వెంకటరమణ, వసుంధర, పి.చంద్రశేఖర్ ఆజాద్, అంజన, పుట్టగుంట సురేశ్‌కుమార్, శాంతిశ్రీ, వాణిశ్రీ, ఎం.హరికిషన్, బెలగాం భీమేశ్వర్‌రావు, పైడిమర్రి రామకృష్ణ, పెండెం జగదీశ్వర్, శాఖమూరి శ్రీనివాస్, పుప్పాల కృష్ణమూర్తి, మేకల మదన్‌మోహన్, డాక్టర్ సిరి, ప్రతాప రవిశంకర్, తిరుమలశ్రీ, ఉండ్రాల రాజేశం, సమ్మెట ఉమాదేవి, నారంశెట్టి ఉమామహేశ్వరరావు ఇంకా అనేకమంది పిల్లల కోసం రాస్తున్నారు.

ప్రతి కవి, రచయిత బాల సాహిత్యాన్ని స్పృశించే మిగతా ప్రక్రియల వైపు వెళ్లిపోతున్నారు. బాల సాహిత్యానికి తగిన గుర్తింపు కానీ, ఆర్థిక లాభం కానీ లేని కారణంగా ఎక్కువమంది ఇందులో నిలబడి రచనలు చేయడం లేదు.

సాహితీ సంస్థలు కానీ, ప్రచురణ కర్తలు కానీ పెద్దల కథ, కవితలకు ఇస్తున్న అవార్డులు, నగదు పారితోషికాలు పిల్లల కోసం రచనలు చేసిన వారికి ఇవ్వడం లేదు. ఇది ఒక విషాదం.

తెలుగు బాలసాహిత్యం వర్ధిల్లాలంటే ప్రజలు, సంస్థలు, ప్రభుత్వం వ్యూహాత్మకంగా పూనుకోవాలి. బడిలో ఒక గంట 'కథ చెబుతా వింటావా' తరగతి ఉండాలి. అలాగే పిల్లలు చేసిన రచనలు దిద్దే బాధ్యత తెలుగు పండితులు తీసుకోవాలి. పిల్లలకు కార్యశాలలు, సెలవుల్లో చర్చాగోష్ఠులు వంటివి ఏర్పాటు చేయాలి. బాల సంఘాలు ఏర్పడి పిల్లల సాహిత్యాన్ని గ్రంథాలయాల్లో భద్రపర్చుకునేలా చేయాలి. అలా జరిగిన నాడే బాల సాహిత్యానికి మంచి రోజులు వస్తాయి.



**పుప్పాల కృష్ణమూర్తి**
సూపరింటెండెంట్,
మండల ప్రజా పరిషత్తు, కోదాడ,
నల్లగొండ జిల్లా. 99123 59345

# మాటకట్టు 23

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | ■ | 4 | 5 | | 6 |
| | ■ | 7 | 8 | | 9 | ■ | | ■ | |
| ■ | 10 | ■ | | ■ | 11 | 12 | ■ | 13 | |
| 14 | | 15 | ■ | 16 | ■ | 17 | 18 | ■ | |
| | ■ | | ■ | 19 | | ■ | 20 | | ■ |
| ■ | 21 | | | | ■ | 22 | | ■ | 23 |
| 24 | ■ | | ■ | 25 | 26 | | ■ | 27 | |
| 28 | | ■ | 29 | ■ | | ■ | 30 | ■ | |
| | ■ | 31 | ■ | 32 | | ■ | 33 | 34 | |
| 35 | | | | ■ | 36 | | ■ | | ■ |

## ఆధారాలు

### అడ్డం

1. అర్జునుడు (3)
4. పాములవాడు ఊదేటి బుట్ట (4)
7. సాగుకు పనికిరాని, సాగు చేయని భూమి (4)
11. చితికాదు, నేల (2)
13. తెలుగు సంవత్సరం భవ కాదు... (2)
14. బంతి-చెండు(3)
17. ఉమ కాదు, సుగ్రీవుని భార్య (2)
19. అటునుంచి శాఖ, స్త్రీ (2)
20. జిత్తులమారి జంతువు (2)
21. ఏలినవారు - ఆంగ్లేయ అధికారులను సంబోధించు తీరు (4)
22. కవనం ఇతని ఆభరణం (2)
25. దేవసభ, మంచి ధర్మం (3)
27. కల్ల (2)
28. ధనం (2)
29. ప్రణవనాదం (1)
32. ఎండ్రకాయ (2)
33. ఇది పెరుమాళ్లకెరుక అని సామెత (3)
35. ఏనుగు (4)
36. నక్షత్రం (2)

### నిలువు

1. సువాసనాయుత తాంబూలం (2)
2. కింది నుంచి స్పర్థ (2)
3. మరమనిషి. రజనీకాంత్ సినిమా (2)
5. చంపూ కావ్యంలో పద్యంతోపాటు ఇదీ ఉంటుంది. (2)
6. ముగ్గు (4)
8. నలకూబరుని ప్రేయసి, ఒక అప్సరస(2)
9. ఉదరం (2)
10. ఇరుకు వీధి (2)
12. అరవంలో శ్రీ (2)
14. వరి, జొన్న మొదలైన వాటి వెన్ను (2)
15. సింహం (4)
16. శ్రీకృష్ణదేవరాయల మహామంత్రి (4)
18. విన్నపం, విజ్ఞప్తి (3)
22. పని (2)
23. పాండవుల అజ్ఞాతవాస కాలంలో ధర్మరాజు మారుపేరు (4)
24. వినాయక చవితి ఈ మాసంలో వస్తుంది (4)
26. దేవవైద్యుడు (4)
30. హిందీలో పదమనండి (2)
31. సారం, బలం (2)
34. కందరం (2)

సమాధానాలు 71లో....

***



**చుక్కల నాగేశ్వర్**
వనపర్తి, మహబూబ్‌నగర్.
99662 25486



తర్కం...
వి - తర్కం
కు - తర్కం
'పండిత' - భాష!
....పామరునికి పట్టని
'ఓ' - పరి - బాస!

**తేడా**

**స్వార్థ జీవి!**

నోటితో - శాంతి వచనాలు
'వల్లె' వేస్తున్నాడు
మనసులో కుతంత్రాలు...
'పన్ను'.. తున్నాడు!



**తై తక్కిట!**

'కళ్లు'
నాట్యం చేస్తున్నాయ్...
కనురెప్పలు
'తాళం' వేస్తున్నాయ్....
.... "లయ విన్యాసాలు!"



**- యు.చిట్టిబాబు,** కొత్తపాల్వంచ, ఖమ్మం

# బతుకునిచ్చిన భాష

**'తెలుగు ఎందుకూ పనికిరాదనే వారికి నా ఎదుగుదలే సమాధానం. చిన్నప్పుడు భాషను అంతగా ప్రేమించాను కాబట్టే ఇప్పుడు చలన చిత్ర గీత రచయితనయ్యా. చిన్న వయసులోనే ఫిలింఫేర్ పురస్కారాన్ని అందుకోగలిగా'... గుండెల నిండా ఆత్మవిశ్వాసం, మది నిండా మాతృభాషాభిమానం నింపుకున్న పాతికేళ్ల కుర్రాడు పాగోలు గిరీష్‌ను పలకరిస్తే చెప్పిన మాటలివి.**



ఎవరీ గిరీష్? గుర్తుపట్టలేదా? అయితే, శ్రీమణి అంటే జ్ఞప్తికి వస్తాడేమో! అవును... అతడే! యువతరం నుంచి మలితరం వరకూ అందరినీ ఆకట్టుకున్న 'గగనపు వీధి వీడి...' (అత్తారింటికి దారేది?) పాట రచయిత. కళాశాల చదువు కూడా పూర్తి చేయని శ్రీమణి ఇప్పుడు తెలుగు చలనచిత్ర పరిశ్రమలో సాహితీ సంచలనం సృష్టిస్తున్నాడు. పదో తరగతి పూర్తయ్యే నాటికే తెలుగు సాహిత్యంలోని మేరునగాలను చదివేసిన ఈ కుర్రాడు... ఆ తెలుగే పెట్టుబడిగా పైకెదిగాడు.

**గగనపు వీధి వీడి వలస వెళ్ళిపోయిన నీలిమబ్బు కోసం**
**తరలింది తనకు తానే ఆకాశం పరదేశం**
**శిఖరపు అంచు నుంచి నేల జారిపోయిన నీటి చుక్క కోసం**
**విడిచింది చూడు నగమే తన వాసం వనవాసం**

భావసంద్రం అనే పదానికి నిర్వచనంగా ఈ పాటను ఉదాహరిస్తే సరిపోతుందేమో! ఇంత చక్కటి అక్షరాలను ఎలా కూర్చారంటే త్రివిక్రమ్ శ్రీనివాస్‌ను తల్చుకుంటాడు శ్రీమణి. ఆ పాట రాయించుకునే ముందు తన దగ్గర ఆయన పావుగంట కూర్చొని రెండు కథలు చెప్పిన విషయాన్ని గుర్తు చేసుకుంటాడు.

మొదటి కథ... చెట్టు మీద ఓ పిట్ట గూడు పెట్టింది. కొన్నాళ్లకి ఆ పిట్ట ఎగిరివెళ్లిపోయింది. అది తిరిగి రాలేదని చెట్టే పిట్ట కోసం కదిలి వెళ్లింది.

రెండో కథ... ఆకాశం గుండెల్లో మేఘాలు ఇమిడి ఉన్నాయి. కొన్నాళ్లకి మేఘాలు వెళ్లిపోయాయి. చివరికి తనని వదిలి వెళ్లిన మేఘం కోసం ఆకాశమే కదిలి వెళ్లిపోయింది.

'ఈ రెండు కథలతో నాకు సందర్భం అర్థమయ్యేలా చెప్పారు త్రివిక్రమ్. ఎంత సమయమైనా తీసుకో... నీకు సంతృప్తిగా అనిపించినప్పుడే పాట నాకివ్వు అన్నారు. ముప్ఫై రోజులు పట్టింది ఆ పాట రాయడానికి. అందుకే అది అంత పెద్ద హిట్టయ్యింది. ఆ గొప్పదనమంతా త్రివిక్రమ్ గారికే దక్కుతుంద'ని అంటాడు శ్రీమణి వినయంగా. తనకు కావాల్సిన పాట కోసం త్రివిక్రమ్ చెప్పిన కథల్లో భావుకతకు శ్రీమణి సృజనాత్మక అక్షరాలు తోడవటంతోనే ఆ పాటకు ఇప్పటికీ నీరాజనాలు అందుతున్నాయి.

**వారి ఒడిలోనే...**

శ్రీమణి సొంతూరు ప్రకాశం జిల్లా చీరాల. నాన్న వెంకటాచలం చనిపోయినప్పుడు తనకు ఎనిమిదేళ్లు. మరో నాలుగేళ్లు గడిచాయో లేదో అమ్మ నాగమణి కూడా వెళ్లిపోయింది. అప్పటి నుంచి అమ్మమ్మ రమణమ్మా, తాతయ్య దత్తాత్రేయలే పెంచారు. ఏడో తరగతి వరకూ ప్రభుత్వ పాఠశాలల్లోనే చదువుకున్న శ్రీమణి... బడి నుంచి రాగానే అమ్మమ్మా తాతయ్యలతో పురాణ పఠనం చేసేవాడు. పిల్లాడికి వినోదం, విజ్ఞానం కలిపి అందించడానికి ఆ పెద్దవాళ్లు చేసిన ప్రయత్నం సత్ఫలితాలను ఇచ్చింది. మనవడిలో భాషాభిమానం పెంచింది. తాను కూడా ఏదైనా రాయాలన్న స్ఫూర్తిని రగిలించింది.

చేమకూర వేంకటకవి విజయవిలాసం నుంచి ఆరుద్ర త్వమేవాహం వరకూ, మార్క్ ట్వెయిన్ రచనల నుంచి కన్నడ భైరప్ప పుస్తకాల వరకూ అన్నింటినీ ఆపోశన పట్టాడు శ్రీమణి. 'పరిశ్రమలో అడుగు పెట్టాలనుకున్నప్పుడే చలంగారి పుస్తకాలు, తిలక్ అమృతం కురిసిన రాత్రి చదివా. నా మీద ప్రభావం చూపిన పుస్తకం... కన్నడ రచయిత భైరప్ప రాసిన 'పర్వ'. మాయలూ, మంత్రాలు లేకుండా మహాభారతాన్ని రాశారాయన. అందులో భావాలూ, భావోద్వేగాలు మనసును హత్తుకుంటాయి. ఒక దళారీ పశ్చాత్తాపం కూడా బాగా నచ్చింది. ప్రపంచ బ్యాంకు ఉద్యోగి జీవితం అది. అతని

దృష్టిలో అతను చేసింది తప్పుకాదు. సమాజం దృష్టిలో మాత్రం అది అవినీతి. పుస్తకం గొప్పగా ఉంటుంది. రంగనాయకమ్మ గారి రామాయణ విషవృక్షం ఎన్నిసార్లు చదివానో లెక్కలేదు. మార్క్ ట్వెయిన్ రచనలు నాకిష్టం. అలాగే, శ్రీపాద గారు ఓ కథలో వందేళ్ల అవతల నుంచి రాసుకుంటూ వచ్చారు. స్వాతంత్ర్యానికి పూర్వం సగటు భారతీయుడు ఎలా ఉండేవాడు... ఆ తర్వాత ఎలా మార్పులు వచ్చాయనేది విశ్లేషిస్తూ రాశారు. ఆ రచనలు బాగా నచ్చాయి'

**ఊరికే రాలేదు...**

పద్యాలు, కవితల రచనలతో సాహితీ సేద్యంపై ఆసక్తి పెంచుకున్న శ్రీమణి...కళాశాల చదువుకి టాటా చెప్పేసి హైదరాబాద్ వచ్చేశాడు. చలనచిత్రాల్లో అవకాశాల కోసం ప్రయత్నాలు ప్రారంభించాడు. 2006 - 10 మధ్యలో ప్రైవేటు రవాణా కంపెనీలో గుమాస్తా, పిజ్జా డెలివరీ బాయ్, మార్కెటింగ్ ఉద్యోగిగా పని చేశాడు. పద్యాలు రాసే చేత్తో లోడింగ్ లెక్కలు రాశాడు. పిజ్జాలను అందించాడు. అలా కష్టపడుతూనే సినీ ప్రయత్నాలు

100% లవ్‌లో 'అహో బాలు' పాట (మొదటిసారి ఈ పాట సాహిత్యాన్ని చూసినప్పుడు శ్రీమణిని హత్తుకుని మరీ సంగీత దర్శకుడు దేవీశ్రీప్రసాద్ అభినందించారట) నుంచి 'గగనపు వీధి' వరకూ రెండేళ్లలో దాదాపు డెబ్భై గీతాలు రాశాడు శ్రీమణి. అంత తక్కువ కాలంలో అన్ని పాటలు రాసిన సినీ రచయితలు అరుదు. అంతేకాదు, 'గగనపు...' పాటకు ఫిలింఫేర్ పురస్కారాన్ని అందుకున్నాడు. చిన్న వయసులోనే ఆ ఘనతను సొంతం చేసుకున్నాడు. 'పాడుతా తీయగా' కార్యక్ర

**కళాశాలలో కవిసమ్మేళనాలు పెట్టాలి**

శ్రీశ్రీ, ముళ్లపూడి గార్ల భాష, భావజాలం నాకు చాలా ఇష్టం. శ్రీశ్రీ సాహిత్యాన్ని చదివితే సోమరి కూడా శక్తిమంతుడిగా తయారవుతాడు. ఇక, స్వటైరు అనే పదాన్ని సృష్టించిన ముళ్లపూడి గారి గురించి ఏం చెప్పగలం? సెటైర్ అంటే ఎదుటి వాళ్ల మీద వేసేది, స్వటైర్ అంటే మన మీద మనం వేసుకునేది అని చాలా చక్కగా చెప్పారాయన. ఆ మాటకు నేను ఫిదా అయ్యా. సినారె, యండమూరి, యద్దనపూడి రచనలు బాగుంటాయి. దర్గమిట్ట కథలు అద్భుతం. వాటిలో భావోద్వేగాలు, సందేశాలు చాలా బాగుంటాయి. అనుభవాలను బాగా విశ్లేషించి రాయడంలో రచయిత ప్రజ్ఞ కనిపిస్తుంది. రావూరి భరద్వాజ గారి 'వెలుతురు చినుకులు', మల్లాదిగారి 'చలవ మిరియాలు', 'అసురుడు' కూడా నాకు బాగా ఇష్టం.

చలనచిత్ర రచయితల్లో చంద్రబోస్ గారి సాహిత్యంలో భావుకత బాగుంటుంది. కళ్లు కళ్లు ప్లస్ పాటలో... 'ప్రాయానికే పరీక్షలా' అని కౌమారంలో ఉండే ఇబ్బందులను భలే వర్ణించారు. వేటూరి, సిరివెన్నెల గార్లూ నాకూ స్ఫూర్తినిచ్చిన రచయితలే. సిరివెన్నెల కొత్త బంగారులోకంలో 'నీ ప్రశ్నలు నీవే ఎవ్వరో బదులివ్వరుగా... నీ చిక్కులు నీవే ఎవ్వరూ విడిపించరుగా' అంటూ పాట మొదలవుతుంది. ఆయన రాసిన ప్రతి పాటలో ఓ సందేశం ఉంటుంది. 'దళం' అనే సినిమాలో 'ఎటెళ్లినా అరణ్యమే... స్థితి గతీ అగమ్యమే' పాట సాహిత్యం చాలా బాగుంటుంది. తెలుగు సినిమా పాటల్లో ఆంగ్ల పదాలంటే, సందర్భాన్ని బట్టి కొన్నిసార్లు తప్పవు. కళాశాల నేపథ్యంలో పాట అంటే అవి వస్తాయి. గ్రామీణ నేపథ్యం, కుటుంబం బంధాలు అంటే ఆంగ్ల పదాల వినికిడి దాదాపు ఉండదు. యువతరానికి తెలుగును దగ్గర చేయాలంటే కళాశాలల్లో భాషా సదస్సులు, శతావధానాలు నిర్వహించాలి. కవి సమ్మేళనాలు ఏర్పాటు చేయాలి. తెలుగు పాఠాలను ఆసక్తికరంగా చెప్పాలి. **- శ్రీమణి**

అనే శ్రీమణి చిన్నప్పుడే పద్యాలంటే ఆసక్తి కనబరిచేవాడు. ఇంటర్‌కి వచ్చాక తరగతి గదిలో కనిపించే సందర్భాలను తీసుకుని పద్యాలుగా, కవితలుగా మలచేవాడు. నూనుగు మీసాల వయసులోనే పద్య రచనా నైపుణ్యం ఎలా వచ్చిందంటే, 'అప్పట్లో తాతయ్య పెద్దబాలశిక్ష, తెలుగు పద్యాలు, కవితలూ బాగా చదివించేవారు. ఆ చదువే దారి చూపింద'ని చెబుతాడు. ఈ కాలం పిల్లలకు పద్యాలను మూసధోరణిలో కాకుండా ఆసక్తికరంగా అర్థమయ్యేట్టు విడదీసి చెప్పాలి ... వర్ణిస్తూ, దృశ్య కావ్యంలా వాళ్ల కళ్లకు కట్టాలి... అప్పుడే వాళ్లు పద్యసాహిత్యంపై ఆసక్తి పెంచుకుంటారని అంటాడు.

చేశాడు. రోజంతా అలా పని చేస్తూ పుస్తక పఠనానికి సమయం ఎలా మిగుల్చుకునే వారని అడిగితే... 'అప్పటికే ఎన్నో పుస్తకాలు చదివా. ఉద్యోగంలోకి వచ్చాక మాత్రం వ్యక్తులను, వ్యక్తిత్వాలను చదవడానికి సమయం కేటాయించుకున్నా. ఎక్కడ ఎవరితో ఎలా మెలగాలో తెలుసుకున్నా. అప్పుడే నాకు తెలిసిన వ్యక్తి దర్శకుడు సుకుమార్ దగ్గర చేరాడు. అతనే సుకుమార్ గారిని పరిచయం చేశాడు. కట్ చేస్తే, నా పాటలు ఆయనకు బాగా నచ్చాయి. 100% లవ్‌లో అవకాశం ఇచ్చారు. తర్వాత సుకుమార్, త్రివిక్రమ్ గార్ల ప్రోత్సాహంతో నిలదొక్కుకున్నా' అంటూ చెప్పుకొచ్చాడు.

మంలో ఓ అమ్మాయి సెగ సినిమాలోని 'వర్షం ముందుగా...' పాట పాడినప్పుడు బాలసుబ్రహ్మణ్యం, 'కొత్తవాడైనా చక్కటి సాహిత్యం అందించిన శ్రీమణికి అభినందనలు' అన్నారు. ఆ కార్యక్రమాన్ని చూసే, శ్రీమణికి 'జులాయి'లో పాటలు రాసే అవకాశమిచ్చారు త్రివిక్రమ్. గీత రచయిత చంద్రబోస్ కూడా 'ఈ కుర్రాడికి మంచి భవిష్యత్తు ఉంద'ని అంటుంటారు.

అవును మరి... శ్రీమణి నమ్ముకుంది అమ్మభాషను కదా!



**పద్మ కంటిపూడి**
హైదరాబాద్.
padmaavasu@gmail.com

# చిన్నారుల శతక పతాకం

**పువ్వు పుట్టగానే** పరిమళిస్తుంది. పిల్లల్లో ప్రతిభ కూడా బాల్యంలోనే మొగ్గ తొడుగుతుంది. కాకపోతే దాన్ని గుర్తించి ప్రోత్సహించి, వికసింపజేయటంలో పెద్దలకు నేర్పూ ఓర్పూ అవసరం.

ఖమ్మం జిల్లా సత్తుపల్లి మండలం, సిద్దారం ప్రాథమికోన్నత పాఠశాలలో మట్టిలో మాణిక్యాలను వెలికిదీసి, సానబెడుతున్న ఉపాధ్యాయుల కృషి, దాన్ని అందిపుచ్చుకుని కఠోర సాధనతో రాణిస్తున్న పిల్లల పట్టుదల స్ఫూర్తిదాయకంగా నిలుస్తున్నాయి.

**జంట గులాబీలు**

తోటకూర భవాని, తోటకూర విజయలక్ష్మి ఇద్దరూ ప్రస్తుతం సత్తుపల్లి (పాత సెంటర్) జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో పదో తరగతి చదువుతున్నారు. 6,7,8 తరగతులు సిద్దారం ప్రాథమికోన్నత పాఠశాలలో పూర్తి చేశారు. వీళ్లిద్దరిదీ గిరిజన నాయకపోడు తెగ. మాతృభాష తెలుగు. భవానికి తండ్రి, విజయలక్ష్మికి తల్లి చిన్నతనంలోనే చనిపోయారు. తల్లి రెక్కల కష్టంతో భవాని, మేనత్త ఇంట్లో ఉండి విజయలక్ష్మి చదువుకుంటున్నారు.

**అవధానానికి తొలి అడుగులు**

సిద్దారం పాఠశాల ఉపాధ్యాయురాలు మాదిరాజు మాలతి విద్యార్థులకు శతక పద్యాల పఠనం, లేఖనాల్లో శిక్షణ ఇచ్చారు. ఈ శిక్షణలో భవాని, విజయలక్ష్మి పద్యాలంటే మక్కువ చూపిస్తూ అందరికంటే చురుగ్గా ఉండేవాళ్లు. శిక్షణానంతరం సత్తుపల్లి శాఖా గ్రంథాలయ వారోత్సవాల్లో నిర్వహించే పద్య పఠన, లేఖన పోటీలకు ఉపాధ్యాయుల సహకారంతో హాజరయ్యారు. ఆ పోటీల్లో వీళ్లిద్దరూ బహుమతులు సాధించారు. ఈ క్రమంలో దాశరథి శతకకర్త భక్తరామదాసు జన్మస్థలమైన నేలకొండపల్లిలో ఏటా జరిగే దాశరథి శతక పద్యపోటీలో పాల్గొన్నారు. ఆ పోటీలో శతకంలోని అన్ని పద్యాలనూ ధారణతో అప్పగించిన విద్యార్థుల్లో భవాని, విజయలక్ష్మి ప్రథములుగా నిలిచారు. ఉపాధ్యాయుల నమ్మకాన్ని నిలబెట్టారు. వీళ్ల ప్రతిభ, ధారణ శక్తిని, ఆసక్తులను గుర్తించిన పాఠశాల ప్రధానోపాధ్యాయులు మధుసూదనరాజు వీళ్లతో అవధానం చేయిస్తే బాగుంటుందనుకున్నారు. శతకాలు కంఠస్థం చేయించటంలో శిక్షణ ఇచ్చిన మాదిరాజు మాలతి, ఇతర ఉపాధ్యాయులతో చర్చించారు. వాళ్లూ ఉత్సాహంగా స్పందించారు. వెంటనే ప్రణాళిక సిద్ధమైపోయింది.

**శిలలు శిల్పాలవుతాయి**

పాఠశాల పనివేళల తర్వాత అదనపు సమయాన్ని సాధనకు కేటాయించేవారు. సెలవు రోజుల్లో ఉపాధ్యాయిని మాలతి ఇంట్లో వీళ్లకు శిక్షణ కొనసాగేది. ముందు దాశరథి శతకాన్ని ఎంచుకున్నారు. మొదటి పది పద్యాలు సంఖ్యతో సహ ధారణ చేయించారు. మొదటి పదం చెప్పగానే పద్యం సంఖ్య చెప్పి పద్యం మొత్తం అప్పగించాలి. ఇలా ఆ శతకంలోని మొత్తం 103 పద్యాలూ అప్పగించేలా సాధన కొనసాగింది. ఈ కృషిలో ఆ బడిలోని ఉపాధ్యాయులంతా



భాగస్వాములయ్యారు.

**సాధన ఇలా...**

దాశరథి శతక అవధానం కోసం ఉపాధ్యాయులు ఇద్దరు పిల్లలతోనూ నిరంతర శిక్షణ ఇస్తూ, సాధన చేయించారు. అందులో భాగంగా ఎనిమిది అంశాలను క్రమంగా నేర్పుతూ వెళ్లారు.

* పద్యం మొదటి పదం చెపితే పద్యం క్రమసంఖ్య చెప్పి పద్యాన్ని ధారణచేసి చెప్పటం...
* పద్యం సంఖ్య, పాదం చెప్తే అడిగిన పాదాన్ని అప్పగించటం...
* పద్యంలోని నాలుగు పాదాలలో ఏదో ఒక పాదం చదివితే, పద్యం సంఖ్య చెప్పి పద్యాన్ని సంపూర్ణంగా అప్పగించటం...
* పద్యం క్రమసంఖ్య చెప్పి ఒక పదం చెప్తే, ఆ పదం ఎన్నో పాదంలో ఉందో చెప్పటం...
* పద్యం క్రమసంఖ్య, పదం చెపితే, తర్వాత వచ్చే పదం చెప్పటం...
* ఏ అక్షరంతో ఎన్ని పద్యాలున్నాయో చెప్పటం...
* అడిగిన అక్షరానికి మొత్తం పద్యాల సంఖ్య, వాటి క్రమసంఖ్యలు, పద్యాల మొదటి పదాలు చెప్పటం...
* తయారు చేసిన పద్య పట్టికలోని రామాయణ సంబంధ ప్రశ్నలకు సమాధానాలు చెప్పటం...


సత్తుపల్లిలో విజయలక్ష్మి, భవానిల తొలి అవధానం

ఉపాధ్యాయుల ప్రోత్సాహంతోనే గత నాలుగేళ్లుగా అనేక పాఠశాలల్లో ఈ ఇద్దరు పిల్లలూ ప్రదర్శనలిచ్చారు. ఇప్పటికి ఖమ్మం జిల్లాలోని వివిధ ప్రాంతాల్లో 20కి పైగా ప్రదర్శనలిచ్చారు. పండితులు, కవులు, పృచ్ఛకులుగా వ్యవహరించి శతక పద్యాలపై సంధించిన ప్రశ్నలకు అలవోకగా సమాధానాలిచ్చి వారి ప్రశంసలు, సభికుల మన్ననలూ పొందుతున్నారు. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా 2012లో ఖమ్మం భక్తరామదాసు కళాక్షేత్రంలో జిల్లా కలెక్టరు సిద్ధార్థ జైన్‌తో పాటు వేలమంది ఆహూతుల సమక్షంలో పండితులైన మహిళా అధ్యాపకులు, పృచ్ఛకుల సమక్షంలో అద్భుత ప్రదర్శన ఇచ్చారు. ఈ ప్రదర్శనకు నిర్వాహకులు ఇచ్చిన వ్యవధి పదినిమిషాలు. కానీ ఈ పిల్లల ప్రతిభా పాటవాలు అరగంట పాటు సభికులు మైమరచి తిలకించటం విశేషం. ఇది పిల్లలకూ ఉపాధ్యాయులకూ మరచిపోలేని మరో అనుభూతి. ఈ



### ఇష్టంగా నేర్చుకున్నారు

మన సంస్కృతీ సంప్రదాయాలకు పద్యాలే ప్రతిబింబాలు. మా చిన్నప్పుడు ఇంట్లో అమ్మ చక్కగా పద్యాలూ, శ్లోకాలూ పాడేది. అలా నాకూ వాటి మీద ఆసక్తి కలిగింది. వాటిని నేటి తరానికి అందించాలని నా వంతుగా పదేళ్లుగా పిల్లలకు పద్యాలూ, భగవద్గీత శ్లోకాలూ నేర్పిస్తున్నాను. కొంతమంది విద్యార్థులు 15, 20 పద్యాలు నేర్చుకొని మానేసేవారు. భవాని, నాగలక్ష్మి, శ్రీలత, నాగవంశీలు మాత్రం ఎంతో ఇష్టంగా నేర్చుకున్నారు. పాఠశాలలో అదనపు సమయం, సెలవు రోజులను దీనికి వాడుకున్నారు. రెండు మూడు రోజులు సెలవులొస్తే సాధన కోసం పిల్లలు మా ఇంట్లోనే ఉండేవాళ్లు. మా కుటుంబసభ్యులు కూడా పూర్తిగా సహకరించారు. అవధానంలో ఒత్తిడికి గురైనా పిల్లలు అధైర్య పడలేదు. రెట్టింపు ఉత్సాహంతో మాకే ఆశ్చర్యం కలిగించేలా సమాధానమిచ్చేవారు. క్లిష్టమైన అంశాలను సులభంగా పరిష్కరించి ప్రతిభను చాటుకున్నారు. పిల్లల విజయాలు ఆనందం కలిగిస్తున్నాయి.

**- మాదిరాజు మాలతి, ఉపాధ్యాయురాలు,**
99591 33714

### కష్టమనిపించలేదు

మాలతి టీచర్ పద్యాలు నేర్పారు. వేమన, సుమతి, కృష్ణ, దాశరథి శతకాలను నేర్చుకున్నాం. ఇవేమీ కష్టమనిపించలేదు. మా ప్రధానోపాధ్యాయులు అవధాన పద్ధతులు ఒక్కొక్కటి నేర్పేవారు. దాశరథి, కృష్ణ శతకాలను ఒకే సమయంలో అవధానం చేశాం. మా సమాధానాలు విని పెద్దలు చప్పట్లు కొడుతున్నప్పుడు భలే సంతోషం వేసింది.

**- తోటకూర భవాని, విజయలక్ష్మి,**
**పదో తరగతి**

క్రమంలోనే నేలకొండపల్లిలో భక్తరామదాసు ఆరామంలో దాశరథి శతకంపై అవధానం నిర్వహించారు. దాశరథి శతకంపై అవ ధానం నిర్వహించిన తొలిజంట వీళ్లదే. ప్రభుత్వ పాఠశాలలో చదివే విద్యార్థులు పద్యధారణ ఆధారంగా అవధానం నిర్వహించటం కూడా ఇదే ప్రథమం.

**ఒకేసారి రెండు శతకాల మీద**

దాశరథి శతకంతో పాటు మరో శతకం మీదా ఎందుకు అవధానం చేయించకూడ దన్న ఆలోచనతో కృష్ణ శతకాన్ని కూడా నేర్చుకోమని ప్రధానోపాధ్యాయులు ప్రోత్సహించారు. దాంతో భవాని, విజయ

| | |
|---|---|
| ఇంటిలో మొగ్గ బయట పువ్వు | (గొడుగు) |
| మూట విప్పితే ముత్యాలు | (దానిమ్మ) |
| తునికలో పెట్టి తూచరు, అంగట్లో పెట్టి అమ్మరు | (తాళిబొట్టు) |

ఈ నలుగురు పిల్లల తల్లిదండ్రులూ నిర క్షరాస్యులే. తమ పిల్లల ప్రతిభ, ఈ అద్భుత కార్యక్రమాలూ వాళ్లకు అర్థంకావు. ఎక్కడ కార్యక్రమం జరిగినా ఉపాధ్యాయులే స్వయంగా వీళ్లని తీసుకెళ్తారు. ఆహూతుల కరతాళ ధ్వనులూ ప్రశంసలూ చెమర్చే కళ్లతో తిలకిస్తారు. తమ పిల్లలవల్ల ఊరికీ,




లక్ష్మి కృష్ణ శతకమూ నేర్చుకున్నారు. గంటలు, రోజులు, వారాలు, నెలల తరబడి అభ్యసించారు. ఒకే సమయంలో రెండు శతకాల మీదా తొలి ప్రదర్శన సత్తుపల్లిలో విజయవంతంగా పూర్తి చేశారు.

**కొనసాగిన స్ఫూర్తి**

భవాని, విజయలక్ష్మి తర్వాత సిద్దారం పాఠశాలలో చదువుతున్న నాగవంశి (తొమ్మిదో తరగతి), చింతకాయ శ్రీలత (ఎనిమిదో తరగతి)లకు సుమతి శతకంలో అవధాన శిక్షణ ఇచ్చారు. ఈ అవధానంలో రెండు మార్పులు చేశారు. అడిగిన క్రమసంఖ్య, పద్యాన్ని ఇద్దరూ చూడకుండా రాసి చూపడం. అడిగిన సంఖ్యతో ఉన్న పద్యానికి భావాన్ని అప్పగించటం. ఈ రెండు మార్పులతో కూడిన అష్టావధానాన్ని ఈ బాలావధానులు ఇప్పటికే ఎనిమిది సార్లు విజయవంతంగా నిర్వహించారు.

**తల్లిదండ్రులు నిరక్షరాస్యులు**

భవాని, విజయలక్ష్మి, శ్రీలత, నాగవంశి...

పాఠశాలకు మంచిపేరు వచ్చినందుకు గర్వ పడతారు. ఉపాధ్యాయులు విరాళాల రూపంలో వచ్చే ఆదాయాన్ని విద్యార్థులకే అందిస్తూ వాళ్లకీ, వాళ్ల కుటుంబాలకూ వెన్నుదన్నుగా నిలిచి ఉపాధ్యాయవృత్తికి వన్నె తెస్తున్నారు.

**మిగిలిన వారికీ ప్రేరణ**

ఈ నలుగురి అవధానం ఈ ప్రాంతంలోని మిగిలిన విద్యార్థుల్లో స్ఫూర్తిని రగిలిస్తోంది. ఈ ఏడాది నవంబరు నెలలో సత్తుపల్లి గ్రంథాలయ వారోత్సవాల్లో సుమతి శతక పద్యాలపై పఠన, లేఖన పోటీలు నిర్వ హించనున్నారు. ఇందుకు అనేక పాఠశాలల విద్యార్థులు సిద్ధమవటం వీరిచ్చిన స్ఫూర్తికి నిదర్శనం.



**పసుపులేటి నాగేశ్వరరావు,**
సత్తుపల్లి, ఖమ్మం జిల్లా.
80085 73692



**పద్యాన్ని ప్రోత్సహించండి..**

పద్య సాహిత్యానికి క్రమంగా ఆదరణ తగ్గుతోంది. నిజానికి పద్యాలు పాఠ్య పుస్తకాల్లో ఉన్నవీ, విని నేర్చుకున్నవీ పెద్దయిన తర్వాత కూడా గుర్తుంటాయి. ప్రాథమిక స్థాయిలో విద్యార్థులకు వేమన, సుమతి శతకాలు నేర్పటం మాకేమీ కష్టం కాలేదు. అలాగే ప్రాథమికోన్నత స్థాయిలో దాశ రథి, కుమార, కుమారి, కృష్ణ శతకాలు నేర్పుతున్నాం. ప్రతి ఏటా సత్తుపల్లిలో నిర్వహించే పద్య పఠన, లేఖన పోటీలకు శతకాలను పూర్తిగా నేర్చుకు న్నవాళ్లతో పాటూ 60, 70 పద్యాలు నేర్చుకున్న వాళ్లూ వస్తున్నారు. కొత్త గూడెం, భద్రాచలం, మధిర బాలో త్సవ్‌లోనూ పోటీలు జరుగుతున్నాయి.

**- మధుసూదనరాజు, ప్రధానోపాధ్యాయులు**
94400 02982

**భాష మీద పట్టుదొరికింది**

నాలుగు శతకాలు నేర్చుకున్నాం. వేమన శతకం మీద అవధానం చేస్తున్నాం. పద్యాలు చదవటం, రాయటం వల్ల తప్పులు దొర్లటం లేదు. భాష మీద పట్టుచిక్కడం మాకెంతో ఆనందం కలిగించే విషయం.

**- నాగవంశి, తొమ్మిదో తరగతి**
**శ్రీలత, ఎనిమిదో తరగతి**



**ఎవరికీ తీసిపోరు**

ప్రభుత్వ పాఠశాలల్లో చదువుతున్న విద్యార్థుల ప్రతిభకు కొదవలేదు. ఉపాధ్యాయులు దాన్ని గుర్తించి ప్రోత్సహించాలి. సిద్దారం పాఠ శాలలోని ఈ విద్యార్థులకు తగిన ప్రోత్సాహం లభించినందువల్లనే అవధాన పోటీల్లో కొత్త ఒరవడి చూపగలిగారు. ఇది ఎంతో ఆనందదాయకం.

**- రాములు,**
**జిల్లా ఉపవిద్యాశాఖాధికారి, మధిర**

# సమస్యా వినోదం

## కోతిని కన్నట్టివాడు కోవిదుడౌరా!

నిబంధనలు

- పూరణం తేట తెలుగులో, సరళమైన భాషలో సామాన్యులు సైతం రసానుభూతి పొందేలా ఉండాలి.
- రచయిత ఒక పద్యం మాత్రమే పంపాలి.
- ఈ పద్యం ఎక్కడా ప్రచురితం, ప్రసారం కాలేదని హామీపత్రం జతచేయాలి.
- ఫోన్‌నెంబరు, చిరునామా తప్పనిసరి.
- ఏ నెలలో ఇచ్చిన సమస్య ఆ నెలలోనే పూరించి పంపాలి.
- మీ పూరణం చేరేందుకు గడువు: ప్రతినెలా 10వ తేదీ.
- ఎంపికలో తుది నిర్ణయం సంపాదక వర్గానిదే. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.
- వచ్చిన పూరణాల్లో అత్యుత్తమమైన అయిదింటిని ఎంపిక చేసి ప్రచురిస్తాం.
- ప్రచురితమైన ఒక్కో పూరణానికి రూ. 100 బహుమతి. మిగిలిన వాటిలో మేలైనవి సాధారణ ప్రచురణకు స్వీకరిస్తాం.

అక్టోబరు నెలలో ఇచ్చిన **మగడే గర్భమ్ము దాల్చె మక్కువ మీరన్** సమస్యకు వచ్చిన పూరణాల్లో మేలైన ఐదు పద్యాలు.

సగపాలు పాయసము నిడె
మగడే, గర్భమ్ముదాల్చె మక్కువ మీరన్
జగదభిరాముని జననిగ
అగణిత విఖ్యాతినొందె ఆ కౌసల్యే

- ఎం.శశికాంత్, హైదరాబాద్

యుగములు తరములు మారిన
మగువకె సంతానమేల? మార్చగ మనుచున్
వగలాడి పలుక, కలలో
మగడే గర్భమ్ముదాల్చె మక్కువ మీరన్

- రాంపల్లి ప్రణీత్‌శర్మ, హుజురాబాద్

పగతుని గెల్వగ మోహిని
వగలొల్కుచు తిరుగనాడ వలచిన హరుకున్
తగునటు తనయున్ కన; సిరి
మగడే గర్భమ్ముదాల్చె మక్కువ మీరన్.

ముట్నూరి విజయలక్ష్మి, మచిలీపట్నం, కృష్ణా జిల్లా

భగభగ మండెను వెన్నెల
వెగటాయె సుధారసమ్ము వింతలు గనుమా
ఎగసెను కలియుగ ధర్మము
మగడే గర్భమ్ముదాల్చె మక్కువ మీరన్.

- యెరుకోల పద్మజ, కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా

వగలే జూపుచు భార్యకు
సిగలో మల్లెలను గూర్చి సరసములాడీ
మగటిమి చూపించగ తన
మగడే; గర్భమ్ముదాల్చె మక్కువ మీరన్!

వెన్నెల సత్యం, షాద్‌నగర్, మహబూబ్‌నగర్ జిల్లా

**మాష్టారు:** అమ్మా! సరోజా, నువ్వు చాలా బాగా పాడతావని మీ స్నేహితులంతా అంటున్నారు!

**సరోజ:** ఉత్తినే మాష్టారూ, నన్ను ఆట పట్టించడానికి అలా అంటున్నారు.

**మాష్టారు:** సరే, నీకు ఏ పాట వస్తే అది పాడతావా?

**సరోజ:** సరే, సార్, ప్రయత్నిస్తాను.

**మాష్టారు:** వెరీగుడ్.



**సరోజ:** ఇప్పుడు నేను పాడే పాట అంతఃపురంలో సినిమాలోది. 'అసలేం గుర్తుకు రాదు... ఏం గుర్తుకు రాదు ఏం గుర్తుకురాదు....

**మాష్టారు:** అదేంటమ్మా పాట పూర్తవ్వట్లేదు

**సరోజ:** అదే సార్, నాకు మిగతా పాట గుర్తురావట్లేదు!

**టీచర్:** ఒరే వెంగళం!



**చిన్నవెంగళప్ప:** ఏంటి టీచర్.

**టీచర్:** వెయ్యి కిలోల బరువుని 'టన్' అంటారు. మరి మూడు వేల కిలోలుంటే దాన్నేమంటారు?

**చిన్నవెంగలప్ప:** టన్, టన్, టన్.

## మాట్లాడేది తక్కువైనా.. మాటను కాపాడాల్సిందే!

గ్రామీణ మెక్సికో ప్రాంతంలో కేవలం కొన్ని వేలమంది మాత్రమే మాట్లాడే అయూక్ భాష ప్రమాదం అంచున ఉంది. దాన్ని పరిరక్షించేందుకు, పత్రరచనతో ప్రమాణీక రించేందుకు 2.50 లక్షల డాలర్ల ఫెడరల్ గ్రాంటును సాధించారు ఇండియానా విశ్వ విద్యాలయం పరిశోధకులు. దక్షిణ మెక్సికో లోని వూహ్‌హాకాహ్ రాష్ట్రం పర్వత ప్రాంతంలో కొద్దిమంది మాత్రమే మాట్లాడే అయూక్ భాష ఉచ్చారణను నమోదు చేస్తామనీ, అత్యంత దృశ్య స్పష్టతతో కూడిన వీడియోలతో ఆన్‌లైన్ భాండా గారం రూపొందిస్తామని ఇండియానా వర్సిటీ తెలిపింది. ఈ వీడియోలకు స్పానిష్, ఇంగ్లిష్ ఉపశీర్షికలూ ఉంటాయని వివరించింది. ఈ డేటాబేస్ అయూక్ భాష మాట్లాడే వారికి తోడ్పడే వనరుగా పని చేస్తుంది. ఈ భాషను, సంస్కృతిని అధ్య యనం చేయాలనే ఆసక్తి ఉండే పరిశోధకు లకూ ఉపయోగపడుతుంది. దీని రూపకల్పనకు లింగ్విస్టిక్ ఆంత్రోపాలజిస్ట్ డ్యాన్ సుస్లాక్, డాక్యుమెంటరీ దర్శకులు బెన్ లెవిన్ రెండేళ్ల వ్యవధి కలిగిన ప్రాజెక్టును ఈమధ్యనే ప్రారంభించారు.



వాకాటి పాండురంగారావ్

*ఓ ఆడదాని సంపాదనతో బతికే మగాడు తన కడుపు మంట చల్లారేదాకా వేధిస్తూనే ఉంటాడు. చీకటి మాత్రమే వాళ్ల కాపురం అన్యోన్యమని చెప్పటానికి కారణమెలా అయిందో తెలియాలంటే..*

**మాది మద్రాసుకు** తొంభై మైళ్ళ దూరంలో ఉన్న పల్లెటూరు. ఒకసారి పనిబడితే నేను 'పట్నా'నికి వెళ్ళాను; అదే మద్రాసుకు వెళ్ళాను. అక్కడ మా బాబాయి గారింట్లో బస చేశాను.

జార్జిటౌనులోని గోవిందప్పనాయకన్ వీధిలో మా బాబాయి కాపురం. ఆయన స్కూలు మేష్టారు. నల్గురు పిల్లల కుటుంబం. చిన్న వంటగది, సుమారయిన హాలులాటిది. (దానిని మద్రాసు భాషలో 'కూటం' అంటారు) పడకగది అనబడే భోజనాల గది, బట్టలగది, అన్నీ అదే. ఆ మధ్య మా పిన్నిగారి చెల్లెలికి పురుడొస్తే ఆగదే ప్రసూతి గృహం అయింది. ఈ ఒకటిన్నర గదులవాటాకు ఆయన అప్పట్లో అరవైరూపాయ లిచ్చేవాడు. ఇక బాత్‌రూమ్, పాయ్‌ఖానాల్లాటివి ఆ ఇంటిలోని ఏడువాటాల వారికి కలిపి రెండంటే రెండుండేవి. మిగతా ఆరు వాటాల్లోనూ, ఓ టాక్సీడ్రైవర్, ఓ ఘటం వాయించే అయ్యర్, ఇడ్లీలు చేసి రోజంతా తిరిగి అమ్ముకొచ్చే ఓ ముసలావిడ, పత్రికాలయంలో పనిచేసే మలయాళీ కుర్రాడు, వాళ్లమ్మ, గుడి పూజారి. కాక నటరాజన్ కుటుంబాలుండేవి. అందరికీ ఒక్కొక్క గదివాటాలే; కాకపోతే కొన్ని గదులు కాస్త పెద్దవి; కొన్ని చిన్నవి. కొన్నింటికి వసారా వుండేది; కొన్నిటికి లేదు.

ఆ యిల్లు రెండు భాగాలుగా ఉండేది. ఒక్కొక్క భాగాన్ని 'కట్టు' అంటారు అక్కడ. ముందు కట్టులో మా బాబాయిది కాకుండా రెండు కాపురాలు, వెనక నాలుగుండేవి. మేడ మీద ఆ ఇంటి యజమాని రామలింగం వుండేవాడు. ఆయనకు బంగారపు నగల వ్యాపారం ఉండేది.

వీధిలోంచి ఇంట్లోకి సన్నగా, పొడవుగా, పది-పదిహేను గజాల నడవాలాటిది వుండేది. నడవ దాటగానే బాబాయివాటా వుండేది. నడవా పొడుగునా ఒక అరుగుండేది. అరుగునక్కడ 'తిన్నె' అంటారు. ఆ ఇంటికి విద్యుద్దీపాలు లేవు. కాలేజిలో చదువుకునే కుర్రవాడు వీధి దగ్గరగా అరుగు మీద కూచుని వీధిదీపం వెలుతురులో చదువుకునేవాడు. ఆ ఇంట్లో పిల్లలకు ఆటస్థలం ఆ అరుగే. కూరలవాళ్ళు, పాలవాళ్ళు, బరువులు దించేది ఆ అరుగుమీదే. బయటచేరిన ఆడవాళ్ళు ఆ అరుగుమీదే ఒక మూలగా ఒదిగి ఒదిగి కూర్చుంటారు. మధ్యాహ్నాలూ రాత్రిళ్ళూ, ఆ



అరుగుమీదా, ఆ ఎదుట నేలమీదా నిద్రపోతుంటారు పిల్లలూ, ఏకాంతం అవసరంలేని పెద్దవాళ్ళూ, వాటాలలో ఇమడలేని నాలాటి అతిథులకూ ఆ అరుగే పడకగది కమ్- డ్రాయింగ్ గది.

ఆ ఇంట్లో నివసిస్తున్న నలభై పైచిలుకు మనుషులంతా పాత్రధారులు అనుకుంటే ఆ నడవాను రంగస్థలం అనుకోవచ్చు; ఆ అరుగును మాడరన్ స్టేజ్‌మీది 'ఎలివేషన్' అని చెప్పుకోవచ్చు.

నేనున్న రెండు వారాలలోనూ నా పనిమీద తిరుగుతూ యెప్పుడు వీలయితే అప్పుడు ఇంటికొస్తుండేవాడిని, కొన్నిరోజులు మధ్యాహ్నం ఎండ వేళ ఇల్లుచేరి ఆ అరుగుమీద విశ్రమించేవాడిని. కొన్నిరోజులు పొద్దున్నంతా అక్కడే కూర్చుని పని చూసుకుంటుండేవాడిని.



ఏరోజు చూచినా, ఏవేళప్పుడు చూచినా ఆ అరుగు మీద పడుకునీ కూర్చునీ కన్పించేవాడు నటరాజన్. తాంబూలం నములుతూనో, తెలతెలపోతున్న పొడగాటి వెంట్రుకల్ని విదిలించి ముడి వేసుకుంటూనో, ఎడమ అరచేతిలోని 'తంగభస్మం' పొగాకును కుడి బొటనవ్రేలితో చిదుపుతూనో, కుర్రాళ్ళను అరుస్తూనో, లేక తీరికగా వాళ్ళావిడను బండబూతులు తిడుతూనో కన్పించేవాడు.

నటరాజన్ వృత్తి పెళ్ళిళ్ళకు, పార్టీలకు వంట చేయడం. అలాటి పనులు నెలకు ఒకటోరెండో వుండేవి. పెళ్ళిళ్ళ సీజనయితే రోజుకు రెండేసి బేరాలు తగిలేవి. తడవకు పాతిక ముప్పై పుచ్చుకునేవాడు. నటరాజన్ వాళ్ళావిడ లక్ష్మిఅమ్మాళ్. అతడెంత నలుపో ఆమె అంత తెలుపు. కోలమొహం. యెత్తుపళ్ళు. అతగాడికి యాభై దగ్గరుంటుంది. వయసు ఆమెకు ముప్పైయారు దాటింది. ఒక కూతురు, ఇద్దరు కొడుకులు, కూతురుకి పదహారు దాటింది. మున్సిపల్ బడిలో రెండేళ్ళకొక తరగతి చొప్పున దాటుతూ యిప్పుడు ఎనిమిదవ తరగతిలో వుంది. పెద్దబ్బాయి మణి. చదువు మానేసి జులాయిగా తిరుగుతుంటాడు. వీధిలోని పేచీలను ఇంట్లోకి తీసుకొచ్చి తండ్రిచేత తన్నులు తింటూంటాడు. చిన్నవాడి పేరు ఢిల్లీ! ఒకటో తరగతికి వెళ్ళి వస్తున్నాడు.

అప్పుడోసారీ అప్పుడోసారిగా వచ్చే నటరాజన్ సంపాదన ఇంటద్దెకూ అతడి తాంబూలానికి సరిపోతుంది. అంచేత లక్ష్మిఅమ్మాళ్ ఒక సేఠ్ గారింట్లో రెండుపూటలా వంటచేస్తుంది. మధ్యాహ్నం భోజనం కూడా అక్కడే. నెలజీతం యాభైరూపాయలు. ఇదిగాక పిండి రుబ్బినా, స్వీట్స్ చేసినా ఒకటీరెండూ అదనంగా వస్తుంటాయి. రోజూ ఆమె రాత్రి ఇంటికొచ్చేటప్పుడు గారో, కూరముక్కో, అరటిపండో, కొబ్బరిపచ్చడో సేఠ్ ఇంటి నుంచి తెస్తుంటుంది. పిల్లల కోసం. పిల్లలకన్న

# కథాపారిజాతం

ముందుగా అది లాక్కుని నటరాజన్ తినేయడం అరుదు కాదు. పని యెక్కువగా వున్న రోజులలో లక్ష్మి మధ్యాహ్నం పూట ఇంటికొచ్చేది కాదు. పొద్దున్నే ఇంట్లో వున్నదేదో యింత వుడకేసి వెళ్ళిపోతే- రోజల్లా పనిచేసి అలసిపోయి సాయంకాలం ఏ ఏడు తర్వాతో రెండు మైళ్ళూ నడుచుకుంటూ వచ్చేది.

అలా ఆమె రెండు మూడు సాయంకాలాలు నాకు బజారులో ఎదురయింది. వాడి, వడలి, ఏ తినుబండారమో ముడివేసిన పైటకొంగు ముడిని జాగ్రత్తగా పట్టుకుని నడిచి వస్తుండేది. ఒక్కోసారి ఆమె బుగ్గమీద పిండి మరకలుండేవి. అది చూచినప్పుడల్లా ఆమె యుద్ధభూమి నుండి నెత్తురుమరకలతో తిరిగివస్తున్న ఝాన్సీలక్ష్మిలా అన్పించేది. రోజూ తన బిడ్డల కోసం, భర్త కోసం. ఈమె ఇలా ప్రయాసపడుతుంటే - హాయిగా ఏదో ఇంత తిని తన కుంటికాలినాడించుకుంటూ, అరుగుమీద తాంబూలం నములుతూ, గప్పాలుకొడుతూ కూచున్న ఆ నటరాజన్ అంటే ఏవగింపు కలిగేది. కాని పాపం అతడు మాత్రం ఏమిచేయగలడు?

మధ్యాహ్నం వేళయితే లక్ష్మి కిటికీలు కూడా లేని తమ వంటగదిలోనే కునికిపాట్లుపడేది. నటరాజన్ ఠికాణామాత్రం అరుగుమీదే. రాత్రి తొమ్మిది దాటాక ఆ పొడుగాటి నడవాలో ఒక గోడవార లక్ష్మి పడుకునేది. పిల్లలూ నడవాలోనే నిద్రపోయేవారు. ఆ అరుగుమీదా, నడవా నేలమీదా చిన్నా - పెద్దా - ఆడా, మగా అంతా కలిపి పాతిక మందిదాకా వారివారి ఆశలు, నిరాశలు, దురాశలు మరిచి నిద్రపోయేవారు. నూనెమరకలు అట్టలు కట్టిన ఆ తలదిండ్లు, చిరుగులకు అతుకులు వేసిన దుప్పట్లు, దిండ్లకు బదులు చెక్కపీటలు, మూటలు, దుప్పట్లకు బదులు పాతచీరలు ఆ పడకల మధ్య గురకలు, కలవరింతలు, నిద్రరాక నిటారుగా పిశాచాల్లాలేచి చీకట్లో కూర్చుని వున్న

ఒకరిద్దరు ముసలివాళ్లు - ఇది ఆ బహిరంగ నిద్రాస్థలం యొక్క సమవాకారం.

ఒకరోజు సాయంకాలం ఆరుదాటాక ఇల్లుచేరాను నేను. లోపలికి వెళ్తుండగా నటరాజన్ తమిళంలో ఘాటుగా తిడుతుండడం విన్పించింది.

"లంజ! బజారుముండ... దానికి ఇల్లెందుకు? సంసారం ఎందుకు - దొంగకుంక!"

ఏమిటయిందీ బోధపడలేదు. ఆ అష్టోత్తరనామాలు వాళ్ళమ్మాయికేమో అనుకున్నా. కాని పాపం ఆ పిల్ల తలవంచుకుని ఇంట్లోకి వెళ్తూ కన్పించడంతో జరుగుతున్న పూజ ఆమెకు కాదని గ్రహించాను.

బట్టలు మార్చుకుని, కాళ్ళు చేతులూ కడుక్కుని అరుగుమీద మామూలుగానే కూర్చునే చోటికి వెళ్ళి చేరగిలబడ్డాను. సైకిలు పాలవాడొస్తే ఇద్దరు ముగ్గురాడవాళ్ళు పాలుపోయించుకుని వెళ్ళారు. మలయాళీ కుర్రాడు బెల్ మోగించుకుంటూ సైకిలును లోపలికి తీసుకువెళ్ళాడు. ఇంటాయన పెళ్ళాం మేడమీదనుండే వెనకవాటాలో ఎవరినో కేకేస్తూంది. వీధిదీపం వెలుతురుపడే చోట అరుగు మీదకు కాలేజి విద్యార్థి చేరాడు. చేత్తో నీళ్ళబకెట్‌తో వెళ్తున్నాడు పూజారి. జేమ్స్‌జాయ్స్ రాసిన 'యులిసెస్' నవలలోలావుంది వాతావరణం.

నటరాజన్ తిడుతూనే వున్నాడు తన భార్యను, వస్తూపోతూన్న వాళ్ళందరూ ఇదేదీ వినబడనివాళ్ళలా ఎవరిపనుల మీద వాళ్ళున్నారు.

"నిన్ననగా పోయింది లంజముండ. రాత్రి కొంపకు రానేలేదు. ఏమంటే వాళ్లింట్లో ఇవాళ పండగట, పనుందట.... మరివ్వాళ మధ్యాహ్నం తగలడొద్దూ.... లేదు. అక్కడే శుభ్రంగా పప్పులూ పిండి వంటలూ మెక్కి పడుకుంది. బజారులవిడిక్కే.... ఇవ్వాళరాత్రి కూడా పాయసం తాగి ఆ సేట్ గాడితోనే పడుకుంటుందేమో.... రంకుమరిగిన దానికి మొగుడెందుకు- పిల్లలెందుకు...."

ఇంక అక్కడవుంటే అతణ్ణి ఆచెంపా ఈచెంపా వాయించేస్తానేమో అన్పించి అక్కడినుండి లేచివెళ్ళిపోయాను. ఆ పక్క వీధిలోని ఉడయివర్ల గుడికెళ్లి ఓ గంట కూచుని వచ్చాను. నేను యింటికొచ్చేసరికి తొమ్మిదయింది.

పిన్ని భోజనం వడ్డించింది. ఇంటిలోని అన్ని వాటాల నుండి సంసార నాదాలు గందరగోళంగా- రిపేర్ చేయబడుతున్న రేడియోలోని రణగొణ ధ్వనులలాగా వినబడుతున్నాయి.

నా మనస్సు అడుగుతోంది. -'లక్ష్మి ఇంటికి వచ్చిందా? పాపం ఆమెను గాని ఈ ధూర్తుడు కొట్టాడేమో -'

చెవులు వాళ్ళవాటా నుండి వచ్చే శబ్దాల కోసం యెదురుచూస్తూ కూర్చున్నాయి. చేతులు కడుక్కుంటుంటే -

హఠాత్తుగా వినబడింది - "ఆ సేట్ పెళ్ళానికి పక్షవాతం కాదుటే - వాడు నిన్ను మరిగాడు. అందుకనే...."

"నోరుముయ్యండి, ఎవరన్నా వింటారన్న సిగ్గయినాలేదు మీకు? ఎదిగిన పిల్లల తల్లిని - రెండ్రోజులు చచ్చేట్లు పనిచేసి శవంలా వస్తుంటే నోటికొచ్చినట్లు మాట్లాడతారేం? .... ఆకలయితే చిన్నబిడ్డకన్నా చేటుమీరు. - ఇదిగో ఆ డబ్బాలలో బూరెలు, ఇదిగో పాయసం తీసుకోండి.... చిన్నబిడ్డలయితే ఆకలికి ఏడుస్తారు - మీరు మాత్రం వెధవ నోటికి వచ్చినట్లల్లా కారుకూతలు కూస్తారు - ముందిది తిని వెళ్ళండి." అన్న లక్ష్మి గొంతులో పలికిన రసాలు ఎన్నో చెప్పడానికి లక్షణ గ్రంథాలులేవు. అందులో అనుబంధం వుంది. ఆగ్రహం వుంది. ఆవేదన వుంది. అడియాసవుంది. ఆప్యాయత వుంది.

నేను వెళ్ళి అరుగుమీద పడుకున్నాను.

ఏమి మనుష్యులు, ఏమి జీవితాలు - అని మనసులో పరిపరివిధాల ఆలోచిస్తుండగా యెప్పుడో నిద్రపట్టేసింది.

ఏ అర్ధరాత్రప్పుడో నిద్రలో స్వప్నమో, మెలకువలో నిజమో కానీ- "ఉష్, ష్" అని యెవరో అంటున్నట్లు విన్పించింది.

"- ష్ - లేవు!"

" .... .... .... ఊc!"

నా నిద్రపోయింది. కళ్ళింకా మూసుకునే విన్నాను. చెవులు మాత్రం పూర్తిగా 'అటెన్షన్'లో వున్నాయి.

"రావేలంటుంటే వినపడడం లేదా...."

"ఔన్లే.... నీకెందుకూ.... వాడితో సరిపోయె నిన్నంతా-" ఆ వాక్యం ముగియకుండా హఠాత్తుగా ఆగింది.

కళ్ళు తెరచీ తెరవక దొంగతనంగా చూశాను.

చీకటి.

"నిజంచెపుతే నోరుమూస్తావుటే - " నెమ్మదిగానే వుంది కాని స్పష్టంగావుంది స్వరం.

"నోరుమూసుకుంటారా లేక మూయమంటారా?"

"మూస్తావ్ మూస్తావ్ ...."

"ఛస్ - వెధవగొడవ! కాస్త

**వాకాటి పాండురంగారావ్ (1934– 1999)**



ప్రముఖ పాత్రికేయుడు, కథా రచయిత వాకాటి పాండురంగారావ్ 1934 నవంబరు 15న మద్రాసులో జన్మించారు. ఆయన విద్యాభ్యాసమంతా అక్కడే కొనసాగింది. మద్రాసు రాష్ట్ర ప్రభుత్వంలో, టెలిఫోన్ విభాగంలో, కేంద్ర వ్యవసాయ మంత్రిత్వశాఖ కృషి సమాచార విభాగంలో, విశాఖపట్నం పోర్టుట్రస్టులో డిప్యూటి డైరెక్టరుగా ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించారు. ప్రకాశం పంతులు ఆధ్వర్యంలోని 'ప్రజాపత్రిక'లో ఉపసంపాదకుడు, ఆనందవాణిలో సహాయ సంపాదకుడు, 'న్యూస్‌టైమ్'లో ఫీచర్స్ ఎడిటర్, ఆంధ్రప్రభ వారపత్రిక సంపాదకుడిగా పనిచేశారు. దాదాపు 300 కథలు ఆయన కలం నుంచి జాలువారాయి. వాటిలో కొన్ని 'అపరాజిత', 'ద్వాదశి', 'సృష్టిలో తీయనిది', 'శివాన్విత' సంకలనాలుగా వచ్చాయి. ఆయన కథలు ఇంగ్లిష్, హిందీ భాషల్లోకి అనువాదమయ్యాయి. 'మబ్బు వీడిన సూర్యుడు' అన్న నవలిక, రేడియో నాటికలు, ప్రసంగాలు, ఇంగ్లిష్‌లో వ్యాసాలు, ఇంగ్లిష్, తమిళ గ్రంథాలకు తెలుగులోకి అనువాదాలూ ఆయన రచనల్లో ఉన్నాయి.

నిద్రపోదామంటే పోనీకుండా ...."

"రా మరీ .... నిద్రపోదాం ...."

పెద్దగా ఆవలింత.

నిముషం తర్వాత నటరాజన్ కుంటుతూ తమ వాటావైపు నడిచాడు. వెనకాలే జుత్తు ముడివేసుకుంటూ, నిద్రమత్తుతో బద్ధకంగా వెళ్ళింది లక్ష్మి.

ఇది జరిగి ఇరవై యేళ్ళు దాటింది.

ఢిల్లీలో ఉద్యోగం చేస్తున్నానిప్పుడు.

సత్‌నగర్‌లో మా ఇంటిముందు నిలబడ్డానో ఆదివారం సాయంకాలం.

తలకు నీళ్ళు పోసుకున్న సర్దార్జీలు జుత్తు విరబోసుకుని, ఖుషల్లా వున్నారు. వారి భార్యలో తల్లులో, చెల్లెళ్ళో వాళ్ల జుత్తుకు నూనెరాచి దువ్వుతున్నారు. వీధిలో మంచాలమీద కూచుని.

హఠాత్తుగా ఎక్కడనుండో పరుగెత్తుకొచ్చింది ఒక నల్లకుక్క. దాని నోటిలో చపాతీముక్కవుంది.

దాన్ని తరుముతూ వచ్చింది ఇంకొక చారల శునకం.

రెండూ కలియబడ్డాయి, చపాతీని చారలకుక్క లాక్కుంది.

నల్లకుక్క తోకాడిస్తూ నిల్చుంది.

చపాతీ తినడం అవగానే చారలకుక్క వదనం ప్రసన్నమయింది.

అది నల్లకుక్క దగ్గిరగా వచ్చి దానిమూతినీ ఒళ్లునీ నాకసాగింది. నల్లకుక్క సిగ్గుతో, సంతోషంతో ఏడిపించసాగింది.

కాస్సేపు తర్వాత అవిరెండు ఒకదాని వెంబడి ఒక్కటిగా వెళ్ళిపోసాగాయి.

ముందుగా చారలకుక్క; వెనుకగా నల్లకుక్క!

మనస్సు ఇరవైయేళ్ల క్రిందకు గెంతింది!

***

గ్రంథముల వారితోడ సంబంధమున్న
పండితుల వారి కూరిమి బంధుడితడు
కావ్యముల తోడ విలసిల్లు ఘనుడేకాని
కాళ్ళు కదపక పడియుండు కదలలేడు
(వ్యాసపీఠం)

---

అరువది పిల్లలు గలయది
అరువది అరువదుల మనుమలందిన యదియున్
ఇరువది నలుగురు చెలులన్
స్థిరముగ నుండకను తాను తిరుగుచునుండున్
(గంట)

---

ముత్యాలమ్మకు మూడాలమ్మకు భలే భలే స్నేహం
(కొర్రన్నం - పుంటికూర)

# రైలు జారిపోతోంది



రైలు జారిపోతోంది
చెట్టును దాటి గట్టును దాటి
ఊరును మనుషుల మమతలు దాటి
రాత్రిని గడిపి
పగలును జరిపి
నిశ్శబ్దంగానో
అరుచుకుంటూనో
గుహలలోనో
గురుతులతోనో
గమ్యం చేరగా
ప్రయాణీకుల పయనాల దిశగా
రైలు పారిపోతోంది, జారిపోతోంది
తలపుల తలుపులు తెరచుకుంటూ
బాల్యపు చేష్టలు దాటుకుంటూ
జీవనం సాగిపోతోంది
అమాయకంగానో
అల్లరి చేస్తూనో
నేస్తాల, గురువుల గురుతుల
నంజుకుంటూ
తోడబుట్టినవారి జాడల
నడచుకుంటూ
పెరగాలన్న ఆకాంక్షతో
పరుగులు పెడుతూ
జీవనం సాగిపోతోంది
జ్ఞాపకాల పొరల నెమరువేస్తూ
ఉపాధియత్నాల ఉసూరుల
దాటుకుంటూ
ఉద్యోగాల వేటలో
ధాటిగా అదాటున చేరిన తొలిరోజు
జ్ఞాపకాల అరల తలుపుల్లో
పదిలంగానే ఉంది
ఉత్తేజాల ఉద్వేగాల
ఉద్రేకాల ఉల్లాసాల
ఉనికిని చాటుకుంటూ
సాగిన యవ్వనాల తొలిదినాలు
తలపు తీయగానే ఉన్నాయి
ఆలోచనల్లో జారిపోతూ
నిశ్శబ్దంగానో
ఆవేశాల్లో వాలిపోతూ
అరుచుకుంటూనో
సాగిపోతున్న నేటి దినాలు
తట్టుకుంటూ నెట్టుకుంటూ
జీవనం సాగిపోతోంది
ప్రయాణీకుల పలకరింపులతో
పయనాల్లో ప్రతీ స్టేషన్‌లో
ఆగుకుంటూ
జోగుకుంటూ
దిశ మార్చుకుంటూ
దృష్టి మరల్చుకుంటూ
రైలు జారిపోతోంది
జీవనం సాగిపోతోంది
గమ్యానికి చేరాలంటూ...
ఆగమనంలో ఆలస్యం కావచ్చు కాని
ఆ 'గమనానికి' అలసట లేదంటూ
జీవనం సాగిపోతోంది
రైలు జారిపోతోంది.

**- చావలి విజయ,** సిడ్నీ, ఆస్ట్రేలియా
vijaya_chavali@yahoo.co.au

# కుదుళ్ల తులసికి గోవిందరామ...

**తులసిని పవిత్రంగా భావించి పూజిస్తారు మనదేశంలో. ఆ మొక్కకున్న ఔషధ గుణాలవల్ల దానికి పవిత్రత ఆపాదించి ఉంటారు. ప్రతీ సంవత్సరం కార్తీక శుద్ధ ఏకాదశి నుంచి పౌర్ణమి వరకు తులసి పూజ చేస్తారు. జానపదులు వివిధ సందర్భాలకు అనుగుణంగా పాటలు కట్టుకొని పాడుకున్నట్లే తులసమ్మపై కూడా పాటలు కట్టుకొని పాడుకొన్నారు. తరతరాల తెలుగు జానపద సాహితీ సంపదలో భాగం ఈ తులసిపాటలు.**

మొల్ల తన 'రామాయణం'లో 'తేనె సోక నోరు తీయన యగురీతి...' అన్న పద్యంలో శబ్దార్థాలతో ధిషణా కషణం చేసిన కవిత్వం కవిత్వమే కాదంది. తేనె నాలుకను తాకగానే నోరు తియ్యనైనట్లు... కవిత్వం కూడా తేలికగా అర్థమయ్యేలా ఉండాలట! అలా కాకుండా, నోరు తిరగని పదాలతో అర్థం కాకుండా ఉంటే అది పాషాణపాకమేనట! ఈ మాటలు ప్రతి ఒక్కరూ సమ్మతింపతగ్గవే. అర్థ స్ఫూర్తి లేని శబ్దం కోసం నిఘంటువులు తిరగేయడం నిరర్థకం. అలా చేయడం రసానంద జనకత్వానికి అవరోధం. ఇది సాహితీ లక్షణం కాదని లక్షణకర్తల నిర్ణయం. విన్నా, చూసినా భావం సుబోధకం, సులభగ్రాహ్యం కావాలి. అదే జానపద సాహితీ గతం. అందుకే జానపదులు తమ పాటల్లో అనుశ్రుత సాహిత్యానికి పెద్దపీట వేశారు. మకిలి లేని మనస్తత్వం, నకిలీది కాని నడవడి వారి సొత్తు. హృదయస్థిత బాధ, జీవనగాథ, ఆనందానుభూతి, ధారావాహిక గేయగానరీతి జానపదుల సాహితీ ఫణితి. జానపద సాహిత్యానికి సంగీతం సైతం చేదోడువాదోడుగా ఉంటుంది.

జానపద గేయాల్లోని ఆపాతమధురమైన సంగీతం ఆబాలగోపాలాన్ని ఆకట్టుకొంటుంది. ఆలోచనామృతమైన సాహిత్యం అనుభూతిని కలిగిస్తుంది. ఆనందం అందిస్తుంది. అలాంటి జానపద సాహిత్యం తెలుగునాటనే కాదు ప్రపంచ సాహితీ రంగంలోనూ పలురకాలుగా పరిశోధకుల మెదడుకు పదును కల్పించిందనడం అతిశయోక్తి కాదు. ఒకరి నుంచి ఇంకొకరికి ఒకచోటి నుంచి మరోచోటికి పరివ్యాప్తం కావడానికి వాటిలోని నిసర్గ రమణీయకతనే కారణం. పండుగ పబ్బాలనో, పనిపాటలు, కష్టసుఖాలనో, సాంఘిక సంఘటనలనో కలగాపులగం చేసి ఎదుటివారి హృదయాలను ద్రవింపచేసేలా జానపదుల నోటినుంచి వెలువడ్డ ఆ గేయాలను గురించి ఎంత చెప్పినా తక్కువే.

జానపద సాహిత్యంలో ప్రత్యేకమైంది స్త్రీ సాహిత్యం. కొట్నాలు, దంపుళ్లు, అప్పగింతలు, తలుపు దగ్గరి పాటలు, వియ్యాల వారిపై విరుపులు, సీమంతం పాటలు, ఉయ్యాలలు, తిరగలి పాటలు, కలుపు పాటలు, కోతల తర్వాత కళ్లంలో ఉడుపు పాటలు, ఆరతులు, తులసి మాతకు జోతలు పెట్టే పాటలు మొదలైన సందర్భానుసారంగా పాడే పాటలన్నీ ఆడపడుచుల ఆదరాభిమానాన్ని అందుకున్నాయి.

### తులసిమాతల్లికి కోటిదండాలు

పాలకడలిని చిలికేవేళ... కల్పవృక్షం, కామధేనువులతో పాటు తులసి కూడా ఆవిర్భవించిదన్నది సనాతన విశ్వాసం. అరుణోదయ వేళ తులసికోట దగ్గర స్త్రీలు దీపాలు వెలిగించి పసుపు, కుంకుమలతో తులసిమాతను పూజించి గేయాలను లయబద్ధంగా ఆలపిస్తారు. అనంతరం తులసి ఆకుల మీద, వెన్నుల మీద నీళ్లు ధారగా పోస్తూ ఆ నీటినే కళ్లకద్దుకుంటారు. తీర్థంగా స్వీకరిస్తారు. తులసినే సర్వోత్కృష్టదైవంగా భావించి



కొలుస్తారు.

**కుదుల్ల(ళ్ల) తులసికి గోవిందరామ**
**ఉదకమొడ్డించితే గోవిందరామ**
**కూర్మాము తానాలు గోవిందరామ**
**చేసి వచ్చిన ఫలము గోవిందరామ**
**మొక్కల్ల(ల) తులసికి**
**ఉదకమొడ్డించితే గోవిందరామ**
**మొక(ముఖ)లింగ తానాలు గోవిందరామ**
**చేసి వచ్చిన ఫలము గోవిందరామ**
**ఆకుల్ల తులసికి గోవిందరామ**
**ఉదకమొడ్డించితే గోవిందరామ**
**అరసవిల్లి తానాలు గోవిందరామ**
**చేసివచ్చిన ఫలము గోవిందరామ**
**జంటల్ల తులసికి గోవిందరామ**
**ఉదకమొడ్డించితే గోవిందరామ**
**జగన్నాత(థ) తానాలు గోవిందరామ**
**చేసివచ్చిన ఫలము గోవిందరామ**
**పువ్వుల్ల తులసికి గోవింద రామ**
**ఉదకమొడ్డించితే గోవింద రామ**
**పున్నెగిరి తానాలు గోవింద రామ**
**చేసి వచ్చిన ఫలము గోవిందారామ**
**కాయల్ల తులసికి గోవింద రామ**
**ఉదకమొడ్డించితే గోవింద రామ**
**కాశీలో తానాలు గోవింద రామ**
**చేసి వచ్చిన ఫలము గోవింద రామ**
**పండిన తులసికి గోవింద రామ**
**ఉదకమొడ్డించితే గోవింద రామ**
**ఏడేడు లోకాలు గోవింద రామ**
**తిరిగి వచ్చిన ఫలము గోవింద రామ!!**

పై గేయంలో బహుక్షేత్ర ప్రదర్శనం ప్రకటితమవుతోంది. శ్రీకూర్మం, శ్రీముఖలింగం, జగన్నాథం, కాశీ మొదలైన పుణ్యక్షేత్రాలు దర్శించుకున్నంత ఫలం కేవలం తులసి తీర్థం తీసుకుంటే లభిస్తుందని తెలుస్తోంది. సూక్ష్మంలో మోక్షం అంటే ఇదే. వ్యయ ప్రయాసలకు ఓర్చి భక్తి కోసం, ముక్తి కోసం, సద్బోధ కోసం గురువులను ఆశ్రయించి బాధపడనక్కరలేదు. 'కోటలో తులసమ్మ కొలువున్న తీరు, కోరి కొలిచేవారి కొంగు బంగారం' అన్నట్లు మనసు నిర్మలంగా ఉంచుకుంటే ముక్తికోసం ముప్పుతిప్పలు పడనక్కరలేదు. ఇది పురాణేతిహాసాలు ప్రవచించిన పరమసత్యం.

'కలౌ స్మరణాన్ముక్తిః!'- కలియుగంలో భగవన్నామ స్మరణే ముక్తిదాయకం. గోవింద, రామనామాలను పలుకుతూ తులసిని అర్చించడమంటే కైవల్య సౌధానికి గట్టి పునాది వేయడమే. గోవిందునికి తులసి అంటే ప్రీతి. అందుకే జానపదులు తులసి పాటలో గోవిందునికి చోటు కల్పించారు. 'ఏకః పరమాత్మా బహుదేహవర్తి' అని నీతిశాస్త్రం. ఎన్నో రూపాలతో, మరెన్నో పేర్లతో భాసించే భగవంతుని ధ్యానించిన, జపించిన, భజించిన, పూజించిన జన్మమే జన్మం.

## పది ప్రదక్షిణాలు- పది కోరికలు

కోరికలకు పుట్టినిల్లు పడతులు. తమ మనోగత భావాలను గుప్తం కాకుండా గుప్తం చేస్తారు. దైవ సన్నిధిలో తమ వాంఛలను మాటలు, పాటలద్వారా బహిర్గతం చేస్తూ సంచితమైన జన్మను ధన్యం చేయమని అర్థిస్తారనడానికి కింది జానపద గేయం ఉదాహరణ.

**గోప పరదచ్చినం (ప్రదక్షిణం) నీకిస్తనమ్మా!**
**గోవిందు సన్నిధి నాకియ్యవమ్మా**
**ఒంటి పరదచ్చినం నీకిస్తినమ్మా**
**వైకుంటు సన్నిది నాకియ్యవమ్మా**
**రెండు పరదచ్చినం నీకిస్తినమ్మా**
**నిండారు సంపదలు నాకియ్యవమ్మా**
**మూడో పరదచ్చినం నీకిస్తినమ్మా**
**ముత్తు నైదవతనం నాకియ్యవమ్మా**
**నాల్గవ పరదచ్చినం నీకిస్తినమ్మా**
**నవధాన్యరాసులను నాకియ్యవమ్మా**
**అయిదవ పరదచ్చినం నీకిస్తినమ్మా**
**ఆయువైదోతనం నాకియ్యవమ్మా**
**ఆరవ పరదచ్చినం నీకిస్తినమ్మా**
**అత్తగల పుత్రున్ని నాకియ్యవమ్మా**
**ఏడవ పరదచ్చినం నీకిస్తినమ్మా**
**వెన్నుని ఏకాంత సేవియ్యవమ్మా**
**ఎనిమిదో పరదచ్చినం నీకిస్తినమ్మా**
**యమునిచే బాధలు తప్పించవమ్మా**
**తొమ్మిదో పరదచ్చినం నీకిస్తినమ్మా**
**తోడుతా కన్యలకు తోడియ్యవమ్మా**
**పదో పరదచ్చినం నికిస్తినమ్మా**
**పద్మాక్షి నీసేవ నాకియ్యవమ్మా**
**విధవలు పాడితే ఏకాశిమరణం**
**పుణ్యస్త్రీలు పాడితే పుత్రసంతానం**
**రామతులసి - లక్ష్మి తులసి నిత్యం**
**మాయింట వెలుగై విలసిల్లవమ్మా!!!**

తులసిమాతకు పది ప్రదక్షిణాలు. ఒక్కో ప్రదక్షిణకు ఒక్కో కోరిక కోరుకుంటారు. నిండారు సంపదలు, ముత్తయిదతనం, నవధాన్య రాశులు, ఆయువు, అత్తగల పుత్రుడు, విష్ణువు ఏకాంత సేవ, తోడుగా సోదరీమణులను కోరడం అన్నీ ఎన్నదగినవే. ఎన్ని సంపదలున్నా వాటన్నింటికీ మూలకారణమైన తులసి సేవ కోరుకోవడం అహంకార రాహిత్యానికి అద్దంపట్టి చూపెట్టినట్లుంది. ముఖ్యంగా అత్తగల పుత్రుణ్ని భర్తగా కోరుకోవడం గమనించదగింది. ఇది అత్తలేని కోడలుత్తమురాలు అన్న భావనకు వ్యతిరేకం. తనకు కాబోయే భర్తకు తల్లి ఉండాలని కోరుకుంటోంది ఓ కన్య. తాను వెళ్తే ఇంట్లో భర్త ఉద్యోగానికో, మరో పనికో వెళ్తే, తన యోగక్షేమాలు చూసుకోవాల్సింది అత్తే కదా! అందుకే అత్తగల పుత్రుణ్ని నాకియ్యవమ్మ అనడం. తన సంతతిని చూడాలన్నా, సంపదలు అనుభవించాలన్నా దీర్ఘాయువు తప్పనిసరి. అది కూడా అయిదోతనంతో... ఒక్క ప్రదక్షిణకే వైకుంఠుని సన్నిధి తమ పెన్నిధి కావాలనుకోవడం కాంతాజన సహజకామ్యం.

సర్వసృష్టి చైతన్యం ఆశవల్లనే జీవనం సాగిస్తోంది. అందుకే మనిషి ఆశాజీవి. ఆశకు ఆలంబనం ఆడపడుచులు. అదే భావాన్ని పై గేయం ప్రబోధిస్తుంది. ఏదైనా సత్కథా కాలక్షేపం తర్వాతగానీ, వ్రతానంతరంగానీ, పూజానంతరంగానీ ఆయా ఘట్టాలను విన్నవారికి, చదివిన వారికి మేలు కలగాలనడం తెలుగువారి అభిమతం. అదే పై తులసి పాటలోనూ కనిపిస్తుంది.

జానపద సాహిత్యాన్ని వేర్వేరుగా పేరు పేరున విభజించుకుంటూపోతే సముద్రమథనంలో దొరికిన అమూల్య రత్నాలే. ఈ జానపద సంపదను భద్రంగా కాపాడుకోవడం మన ధర్మం. భావితరాలకు తెలియజేయడం మన కర్తవ్యం.



**యం.సి. శివశంకరశాస్త్రి**
హైదరాబాద్. 98497 83335

# గొప్పది... జీవితమంత గొప్పది

**శ్రీకృష్ణుడు సానిదానితో కూడా స్నేహం కడతాడా అండీ?**

**డామిట్! కథ అడ్డంగా తిరిగింది.**

* * *

అగ్నిహోత్రావధాన్లూ కుట్టివాడికి రవ్వంత చదువు చెప్పించడానికి ఇంత ముందూ వెనుకా చూస్తున్నావ్. బుచ్చమ్మనమ్మిన పదిహేను వందల రూపాయిలేంజేశావ్?

**సెల్లింగ్గర్స్! డామిట్!**

రామచంద్రాపురం అగ్రహారంలో లుబ్ధావధాన్లుగార్ని యెరుగుదువా? ఆయ్న లక్షాధికారి. పద్దెనిమిదివందలకి సుబ్బిని అడగొచ్చారు. ఉభయ ఖర్చులూ పెడతారష, పెళ్లి మానైభవంగా చేస్తారష....

**బావా యీ సమ్మంధం చేస్తే నీ కొంపకి అగ్గెట్టేస్తాను.**

వీశ్లమ్మా శిఖాతరగ, ప్రతీగాడిదకొడుకూ తిండిపోతుల్లాగా నాయింటజేరి నన్నసేవాళ్లే. తాంబోలం యిచ్చేశాను. యిహ తన్నుకు చావండి.

**వట్టి మూర్ఖప గాడిదకొడుకు. యెదురు చెప్పిన కొద్దీ మరింత కొట్టెక్కుతాడు.**

* * *

వూరు విజయనగరం. పేరు మధురవాణి. 'ఆ వేశ్య ద్రవ్యానికి సాధ్యురాలు కాదు'.

**వూరుకోస్సి - నీ కేటెరిక!**

* * *

లుబ్ధావధాన్లు పింతల్లికొడుక్కాడూ వీడూ! యీ గిరీశం గుంటవెధవ, వీడెవడో మా గొప్పవాడనుకుంటున్నా వేవిఁటి?

**నలుగురిలోనూ మర్యాద తియ్యడం ధర్మవేఁనా తమ్ముడా?**

* * *

కావడానికి రెండు కుటుంబాల కథే... కానీ అది సార్వజనీనం. అవడానికి ఆ కాలపు కొన్ని సమస్యల చిత్రీకరణే... కానీ అది సార్వకాలీనం. ఉత్తరాంధ్రలోని కొన్ని గ్రామాల నేపథ్యంలోంచి పురుడుపోసుకున్నదే... కానీ అది సార్వదేశీయం. అదే 'కన్యాశుల్కం'. ఆధునిక తెలుగు నాటకానికి తొలి చిరునామా. తెలుగువాళ్లందరికీ తన సాహితీ సంపదను పంచిపెడుతూ గురజాడ రాసిన వీలునామా.

ఎప్పుడో 1890ల్లో రాసిన ఆ పుస్తకాన్ని 2014లో చదివినా పాతవాసనెయ్యదు. సరికదా, 'పుస్తకం చాతపడితే వేళ్లకి అంటుకుపోతుంది. అలా చదివిస్తుంది'. 'హాస్యం, పాత్రల చిత్రీకరణ, జటిలమైన ఒక కొత్త కథాసంవిధానం కోసం ప్రయత్నించాను. ఇందులో ఎంతవరకూ కృతకృత్యుణ్ణయానో లోకం నిర్ణయించాలి' అని అడిగిన గురజాడ అప్పారావుకు ఈ లోకమిచ్చిన సమాధానం... అదీ ఒక్క గొంతుకతో... 'యీ నాటకాన్ని మించింది యింకోటి లేదు. నేడే కాదు రేపటిక్కూడా యిది ఆడదగినదే. చూడదగినదే! - నాటకము మొదటిసారి చదివినవాళ్ళు ఎవరైనా సరే ఆశ్చర్యపడి ఏదో కొంత మార్పు పొందకుండా ఉండలేరు'.

### నరమాంస విక్రయమే

డబ్బు తీసుకుంటే తప్ప మూడుముళ్లెయ్యని ఈనాటి మనుషులకు... డబ్బిచ్చి అమ్మాయిలను కొనుక్కోవడమనే నాటి పద్ధతి కాస్త వింతగా ఉంటుంది. వరకట్నాన్ని అసహ్యించుకునే వారికైతే ఆనాటి స్థితిగతులింకా రోతగా కనిపిస్తాయి. కానీ, ఆనాడు కొన్ని కుటుంబాల్లో ఈ కన్యాశుల్కం అపచారం కాదు. ఆచారం. అదేమని అడిగితే... 'ఆహా. మా మేనత్తల్ని అందరినీ కూడా అమ్మారండి. వాళ్లంతా పునిస్త్రీ చావే చచ్చారు. మా తండ్రి మేనత్తల్ని కూడా అమ్మడవేఁ జరిగిందష' అని సమాధానం చెప్పే పెద్దల పిదప బుద్ధులు రాజ్యం చేసిన కాలమది. ఏడాది, రెండేళ్లు, మూడేళ్ల ఆడపిల్లలనే కాదు, ఆడో మగో తెలియని కడుపులోని పిండాన్ని సైతం 'ముందస్తుగా' బేరం పెడుతున్న వారిపై అందరికన్నా ముందు కందుకూరి వీరేశలింగం కన్నెర్రజేశారు. 'కసాయి వాడు యెక్కడో పుట్టిన పశుమాంసము విక్రయిస్తాడు. నీవు కడుపున పుట్టిన శిశు మాంసమును విక్రయిస్తున్నావు. నీ వ్యాపారము కంటే వాడిదే మంచిద'ని హూంకరించారు.

కందుకూరి ప్రభావంతో పాటు విజయనగరం సంస్థానం పరిధిలో జరిగిన కన్యాశుల్క వివాహాలపై సంస్థానాధిపతి




ఆనందగజపతి రాజు జరిపించిన సర్వే కూడా 'కన్యాశుల్కం' రచనకు గురజాడను ఉద్యుక్తుణ్ని చేసింది. మూడేళ్లలో వెయ్యికి పైగా ఇలాంటి పెళ్లిళ్లు జరిగాయని తెలుసుకున్న ఆయన... 'మన స్త్రీ జాతిలోని నిస్సహాయమైన విభాగాన్ని సమాజ అవినీతిక్రిములతో నిండివున్న బాధాకరమైన దాస్యంలోకి తోసే ఈ చెడును ఒక జనరంజకమైన నాటకంలో వెల్లడిచేసి ఈ విషయంపై

ప్రజాభిప్రాయాన్ని వుద్దీప్తం చేసేందుకు' నడుంకట్టారు. దూషణభీషణల కన్నా వ్యంగ్యానికి తీవ్రతెక్కువని గుర్తించి... పెద్దవాళ్ల చిల్లరబుద్ధులను సునిశిత హాస్యంతో ఎండగట్టారు. 1897లో 'కన్యాశుల్కం' తొలిసారి ప్రచురితమైంది. దాదాపుగా దాన్ని మొత్తం తిరగరాసి, నాటకం పరిధిని పెంచి 1909లో రెండోసారి ప్రచురించారు గురజాడ. అయితే... మొదటిసారి ప్రదర్శితమైంది మాత్రం 1908లో. జగన్నాథ విలాసినీ నాటక సమాజం దీన్ని రంగస్థలమెక్కించింది. అప్పటి నుంచి ఇప్పటి వరకూ ఎన్ని వందల మంది కళాకారులు... ఎన్ని వేలసార్లు ప్రదర్శించారో!

**అడ్డంగా తిరిగిన కథేంటి?**

అగ్నిహోత్రావధాన్లు అనే పెద్దాయన తన రెండో కూతురు సుబ్బిని... వృద్ధుడైన లుబ్ధావధాన్లకు కట్టబెట్టడానికి రూ.1800లకు బేరం కుదుర్చుకుంటాడు. సుబ్బిని ఈ గండం నుంచి గట్టెక్కించడానికి ఆ పిల్ల మేనమామ కరటకశాస్త్రి రంగంలోకి దిగుతాడు. ఈలోగా అగ్నిహోత్రుడి కొడుకు వెంకటేశానికి గురువుగా గిరీశం ఊడిపడతాడు. మరోపక్క మధురవాణి... పుట్టింది వేశ్య కుటుంబంలోనైనా కొన్ని నీతినియమాలకు కట్టుబడి బతుకుతుంటుంది. సుబ్బిని రక్షించడానికి ఆమె కూడా సాయం చేస్తుంది. ఇంతలో సుబ్బి అక్క బుచ్చమ్మ ('కన్యాశుల్కం' బాధితురాలు, వితంతువు)ను వల్లో వేసుకుని తనతో తీసుకెళ్లిపోతాడు గిరీశం. చివరికి అతనికి సౌజన్యారావు (మంచి మనసున్న మనిషి. కన్యాశుల్క వివాహాలకు వ్యతిరేకి) బుద్ధి చెబుతాడు. దానికి ముందే కరటకశాస్త్రి... సుబ్బిని ఒడ్డునపడేస్తాడు.

టూకీగా ఇదీ కథ. మొదట్లో అడిగిన 'శ్రీకృష్ణుడి' ప్రశ్న... మధురవాణిది. వృత్తి సంకెళ్లను ఛేదించుకుని మంచిగా జీవించాలన్న ఆమె ఆశలోంచి పుట్టిన సందేహమది. దాని కింద 'అడ్డం తిరిగిన కథ' గిరీశానిది! మాటలే పెట్టుబడిగా... మృష్టాన్నభోజనాలను లాగించాలనుకునే అతగాడి అత్యాశ మీద అంతిమ దెబ్బ పడిన క్షణంలో... అతని నోట్లోంచి వచ్చే ఆఖరి మాట ఇది. నాటకానికి అంతిమ వాక్యమూ అదే.

ఈ నాటకాన్ని భుజానమోసిన పాత్రలు... మధురవాణి, గిరీశం. వాటి చిత్రణ అపూర్వం. మనిషిలోని సకల అవలక్షణాలతో కూడిన మనుషులతో పాటు ఉదాత్తమైన లక్షణాలను పుణికి పుచ్చుకున్న వ్యక్తులెందరో 'కన్యాశుల్కం'లో కనిపిస్తారు. ఒక్కమాటలో చెప్పాలంటే... సమాజానికి సంక్షిప్త రూపం ఈ నాటకం.

**అచ్చ తెలుగు సంపద**

'నాకు నా మాతృభాషే, సజీవమైన తెలుగు భాషే కావాల'ని ప్రకటించిన గురజాడ... ఆనాటి గ్రాంథిక భాషా పిడివాదాలను తిరస్కరిస్తూ వ్యావహారిక భాషలో ఈ నాటకాన్ని రాశారు. అలా వ్యావహారికంలో వచ్చిన తొలి నాటకమిదే అయింది. అలాగే, వ్యావహారిక తెలుగులో తొలికథ, కథా కావ్యం రూపింది కూడా గురజాడే.

మరోవైపు, 'కన్యాశుల్కం' సంభాషణలు సామెతలయ్యాయి. 'తాంబూలాలిచ్చాం తన్నుకు చావండి, ఎంకి పెళ్లి సుబ్బి చావుకొచ్చింది, తాను చేస్తే లౌక్యం - ఎదుటివాడు చేస్తే మోసం, నాతో మాట్లాడడవేc ఒక ఎడ్యుకేషన్, మనవాళ్లు ఒఠ్ఠి వెధవాయలోయ్, ఒపీనియన్సు అప్పుడప్పుడు చేంజ్ చేస్తుంటే గాని పొలిటీషియన్ కానేరడు'... లాంటివి ఇందులో కోకొల్లలు. శ్రీశ్రీ మాటల్లో చెప్పాలంటే... 'జీవితంలోని ఏ సందర్భానికైనా సరిపోయే మాటలు ఇందులో ఎక్కడో ఒకచోట దొరుకుతాయి'.

పంచ్ డైలాగుల పేరిట ఇప్పుడు ప్రాచుర్యంలో ఉన్న హాస్యానికి అమ్మమ్మ 'కన్యాశుల్కం'. 'ఆమెకు మొగుళ్లేక పోయినా ఆమెను వెధవనడానికి వీల్లేద'ంటాడు గిరీశం ఒకచోట మధురవాణితో. వెంటనే ఆమె అంటుంది ఇలా... 'మీరుండగా వెధవెలా అవుతుంది?'

కారం రాసిన కత్తుల్లాంటి మాటల్లోంచి పుట్టే వ్యంగ్యం... నాటకానికి ఇతివృత్తంగా తీసుకున్న సమస్య మూలాన్నో, దాన్ని దుష్ఫలితాన్నో బలంగా వ్యక్తీకరిస్తూనే పాఠకుడి మోములో చిరునవ్వులు పూయిస్తుంది. అదే క్షణంలో ఆలోచింపజేస్తుంది కూడా.

'బ్యాంకు', 'డామిట్' లాంటి ఆంగ్ల పదాల ఉచ్చారణకు తెలుగులో వాటి రాతకూ సంబంధం ఉండని సంగతి తెలిసిందే. నూట ఇరవై ఏళ్ల కిందటే ఈ సమస్యను గుర్తించి ఓ పరిష్కారాన్ని సూచించారు గురజాడ. ఆయా ఆంగ్ల శబ్దాలకు దగ్గర్లో ఉండే తెలుగు అక్షరాలపై అడ్డు గీత పెట్టారు. 'కన్యాశుల్కం' పాత ప్రతుల్లో ఇది కనిపిస్తుంది. (ఉదా: డాన్సింగర్లులో 'డా' మీద అడ్డగీత) ఆ గీత ద్వారా దాని ఉచ్చారణలోని ప్రత్యేకతను చెప్పడమే గురజాడ లక్ష్యం.

కన్యాశుల్కం సమస్యను ఎత్తిచూపినందుకే ఈ నాటకం 'మంచి పుస్తకం' కాలేదు. వేశ్యాలోలత్వం, మూఢనమ్మకాలు, కీర్తికాంక్ష, ధనవ్యామోహం, నయవంచకత్వం, లంచం తదితర 'సార్వకాలీన' దౌర్భాగ్యాలను 'ఉన్నవి ఉన్నట్లుగా' ఆవిష్కరించింది కాబట్టే దానికి ఆ గౌరవం దక్కింది.

మళ్లీ ఓసారి శ్రీశ్రీ మాటలను గుర్తు చేసుకుంటే... 'కన్యాశుల్కం గొప్పది. జీవితమంత గొప్పది. సాహిత్యంలో వాస్తవికతను ఇంత సమగ్రంగా ప్రదర్శించిన నాటకం ఈనాటి మన దేశంలో లేనేలేదు'.



**గోవిందు నరసింహారావు,**
దూసి, శ్రీకాకుళం,
088260 12617

# శ్రీవారికి లేఖ

ప్రేమ లేఖల పోటీలో
రూ.1116 గెలుచుకున్న లేఖ

**ప్రియమైన** శ్రీవారికి, లక్ష్మి నమస్కరిస్తూ రాసే లేఖ. మీరు వెళ్లి మొన్నటికి సరిగ్గా సంవత్సరం. అక్కడ మీరెలా ఉన్నారు? అన్నీ సౌకర్యంగా ఉన్నాయా? ఏంటో! ఉత్తరాలు రాసి చాలా ఏళ్లయ్యింది కదూ.

ఇక్కడ నేనూ, పిల్లలు, కోడళ్లూ అంతా క్షేమం. మనిద్దరం సింగపూర్, మలేషియా వెళ్లడానికి మీరిక్కడ ఉన్నప్పుడే వీసా వచ్చింది కదా. మీరు లేకపోవడం వల్ల నన్నైనా తప్పకుండా రమ్మని పద్మ అత్తగారు సింగపూర్ నుంచి ఫోన్ చేశారు. పిల్లలూ సరే అనడంతో వెళ్లాను. మీరుంటే బాగుండేదని రోజూ అనుకునేవాళ్లం.

మనం భవిష్యత్తు గురించి ఎన్ని కలలు కన్నాం? మీ పదవీ విరమణ రోజున నాకు పాత జ్ఞాపకాలన్నీ ఓసారి గుర్తొచ్చాయి. రిటైరయ్యాక అమలు చెయ్యాల్సిన పనులన్నీ ఓ ప్రణాళిక వేసుకున్నారు కదూ. రోజూ ఉదయం తీరిగ్గా నిద్ర లేవాలనీ... కాఫీ తాగుతూ దినపత్రిక చదవాలనీ.. తోటలో కాసేపు పనిచేసి, స్నానం చేసి... సంధ్యావందనం చేసుకోవాలనీ... ఫోన్లు చేస్తూ, టీవీ చూస్తూ, కబుర్లు చెబుతూ పన్నెండవగానే అన్నం తిని నిద్రపోవాలని... లేచాక మొక్కలకు నీళ్లుపెట్టి సాయంత్రం నడకకి వెళ్లి అలా మిత్రులని కలిసి రావాలని... తర్వాత ఇంటికొచ్చి తిని, టీవీ చూస్తూ నిద్రపోవాలనీ ఎంతగా అనుకునేవారో.

పిల్లల దగ్గరికి అప్పుడప్పుడు వెళ్లొద్దాం... మనం మాత్రం జహీరాబాద్‌లోనే ఉందామనేవారు. నాకూ అదే నచ్చేది. ప్రతి సంక్రాంతికీ పిల్లల్ని ఇక్కడికే పిలుద్దాం. మిగతా పండుగలు ఎక్కడైనా జరుపుకుందామనేవారు గుర్తుందా? ఇద్దరం ఉద్యోగస్థులమే కాబట్టి సెలవులు కుదరక పెళ్లిళ్లకు, పేరంటాలకు వెళ్లలేకపోయేవాళ్లం. రిటైరయ్యాక పిలవని వాళ్లదే పాపం. అన్నింటికీ వెళ్దామనేవారు. మూడు నెలలకోసారి విహారయాత్రలకు వెళ్దామనేవారుకదా. మీరిప్పుడు అక్కడుంటే నన్నెవరు తీసుకెళ్తారు?

మనం అనుకున్నట్లుగానే అన్నీ అమలు చేస్తున్నాను. రిటైరయ్యాక వచ్చే డబ్బులతో ఇద్దరం చెరో ఆవూ, దూడా దానమిద్దామనుకున్నాం కదా. ధారపాలెంలోని అన్నయ్య ద్వారా ఆవు, దూడ కొనిపించాం. పదిరోజులు వాళ్లింట్లోనే ఉంచారు. కొన్నానని ఫోన్ చెయ్యగానే 'మేం పదిరోజుల్లో వస్తాం. ఇప్పుడు కార్తీకమాసం కూడాను. ఆ ఆవుపాలను ధర్మలింగేశ్వరుని అభిషేకానికి పంపించండి' అంటే ఆయన అలాగే చేశారు. తర్వాత మేం వెళ్లి గోదానం జరిపించాం.

మా నాన్న రిటైరయినప్పుడు వచ్చిన డబ్బులతో నాకు, చెల్లెలికి పదేసివేలు పెట్టి అప్పట్లో రెండేసి తులాల బంగారం కొన్నారు. అదిచూసి మనకిద్దరూ మగపిల్లలే. కోడళ్లైనా, కూతుళ్లైనా వాళ్లేకదా వాళ్లకి ఏమైనా చేద్దామనుకునేవాళ్లం కదా. అలాగే కొనిపెట్టాను. మీకు నచ్చిన రంగే మళ్లీ మన ఇంటికి వేయించాం. ఇల్లు సర్దేందుకు కిరణ్ వచ్చాడు. వాడంతా మీ పోలికే. 'అమ్మా నాన్నకి ఇల్లు ఎలా సర్దితే ఇష్టమో అలాగే చేద్దాం. ఏమీ మార్చవద్దు' అన్నాడు. అలాగే సర్దాం. కానీ హాల్లో ఓ చిన్న మార్పు చేశాం. అదేంటో ఆఖరున రాస్తాను.

అన్నట్లు మీకో శుభవార్త. మన చిన్నకోడలికి ఇప్పుడు ఐదోనెల. మనకి ఏడోనెల సీమంతం అలవాటుకదా. అలాగే జరిపిస్తాను.

కృష్ణమూర్తిగారు మీ చేయిచూసి 'మీ పిల్లలు మీరేదీ నోటితో అడక్కుండానే అన్నీ చేస్తారు' అని చెప్పారంటూ మురిసిపోయే వారు కదా! అలాగే వాళ్లు అన్నీ చేశారు.

నిన్న మనింట్లో సత్యనారాయణ వ్రతానికి బంధువులు, స్నేహితులు, మన వీధిలో ఉన్నవాళ్లంతా వచ్చారు. అందరూ మిమ్మల్నే గుర్తు చేసుకున్నారు. గణేష్‌గారంత మంచి మనిషినీ, పద్ధతిగల వ్యక్తినీ మేమెప్పుడూ చూడలేదని మిమ్మల్ని మెచ్చుకున్నారు. మీరు లేనందుకు అందరూ బాధపడ్డారు.

అన్నట్లు చెప్పడం మర్చిపోయా! మనింట్లో చేసిన మార్పేమిటంటే హాల్లో మీ ఫొటో తగిలించి దండవేశాం. ఈ లేఖ ఏ చిరునామాకు పంపాలో నాకు తెలియట్లేదు. మీరు నా మనుమడిగా మళ్లీ నా ఒడిలోకి వస్తారని ఎదురుచూస్తూ...

మీ
**లక్ష్మి**

పెండ్యాల సర్వశ్రీ, జహీరాబాదు,
మెదక్ 99639 68038.



## కిచ్వాకు ప్రాణం పోశారు

సొంత భాషీయులే మాట్లాడటానికి సిగ్గుపడుతున్న ఓ భాషకు కొత్త ఊపిరి పోయడానికి ప్రయత్నిస్తున్నారు కొందరు. అమెరికాలో నివసిస్తున్న ఈక్వెడార్ వాసులు తమ సొంత కిచ్వా భాషను కాపాడుకునేందుకు... ఆ భాషలోనే ఓ రేడియో కార్యక్రమాన్ని రూపొందించి ప్రసారం చేయడం మొదలుపెట్టారు. ఆ కార్యక్రమం ... 'రేడియో ఎల్‌టాంబో'లో వచ్చే 'కిచ్వా హటారి'. నిర్మాణ కార్మికుడు సెగుండో అంగమార్కా, న్యూయార్క్ వర్సిటీ విద్యార్థి చార్లీ ఉరుచిమా, న్యాయస్థానంలో దుబాసీ లూయిస్ ఆంటోనియోలు ఈ సాంస్కృతిక ప్రాజెక్టు బాధ్యతలు తలకెత్తుకున్నారు. కిచ్వా హటారీ అంటే.. 'కిచ్వా సముద్ధరణ'. కిచ్వా ఈక్వెడారియన్ల సొంత భాష. యునెస్కో దీనిని అంతరించిపోతున్న భాషల జాబితాలో చేర్చింది. అమెరికాలోని కిచ్వా భాషీయుల్లో చాలామంది తమ చిన్నారులకు కిచ్వాను నేర్పించడం లేదన్నది సెగుండో ఆందోళన. ఈ కార్యక్రమం కోసం తాను చాలా ఇంటర్వ్యూలు చేశాననీ, చాలామంది కిచ్వా భాషీయులు




ఈ భాషను మాట్లాడేందుకు తిరస్కరించారని ఆవేదన వ్యక్తం చేశారు. అమెరికాకు వలస వచ్చిన ఈక్వెడారియన్లలో భాషాభిమానాన్ని పెంచడమే తమ లక్ష్యమన్నారు.

---

## కరుగుతున్న హిమనీ భాషలు

హిమాలయాలు, ఉత్తర ఆస్ట్రేలియా, తూర్పుయూరేసియా, ఉత్తర రష్యా/స్కాండినేవియా, ఉత్తర అమెరికా తదితర ప్రాంతాల్లో స్థానిక భాషలు అంతరించిపోతున్నట్లు 'ప్రొసీడింగ్స్ ఆఫ్ రాయల్ సొసైటీ బి' జర్నల్ తెలిపింది. అభివృద్ధి చెందిన దేశాల్లో అల్పసంఖ్యాకుల భాషలు వేగంగా అంతరించడాన్ని దృష్టిలో ఉంచుకొని పరిక్షరణపై దృష్టిపెట్టాల్సి ఉందని నిపుణులు స్పష్టం చేశారు. తక్కువ మంది మాట్లాడటం, అతి తక్కువ భౌగోళిక ప్రాంతం, జనాభా మారడం. అంటే.. మాట్లాడటం తగ్గడం వంటివి భాషలకు ప్రమాదహేతువులని వారు పేర్కొన్నారు. జీడీపీ స్థాయులతో తలసరి సంబంధాన్ని,




భాష వైవిధ్యం నష్టాన్ని ఈ అధ్యయనంలో పోల్చిచూశారు. హిమాలయ ప్రాంత భాషలకు ముప్పు ఎక్కువ ఉన్నట్లు గుర్తించారు.

---

## భాష సంగతి చెబితేనే ఓటేస్తాం..

జమ్మూకాశ్మీర్‌లో త్వరలో జరగబోయే ఎన్నికల సందర్భంగా అన్ని పార్టీల మ్యానిఫెస్టోల్లోనూ కశ్మీరీ భాషా పరిరక్షణకు హామీ ఇవ్వాలని ఆ రాష్ట్ర సాహితీవేత్తలు డిమాండ్ చేశారు. ఇటీవల జరిగిన 35వ అద్బీ మర్కజ్ కమ్రాజ్ వార్షిక సదస్సులో ఈ డిమాండు లేవనెత్తారు. జాతీయ కశ్మీరీ భాషా సముద్ధరణ మండలి ఏర్పాటు, కశ్మీరీ భాషను బడుల్లో పాఠ్యాంశంగా చేర్చాలని కోరారు. 'భాష మాకు గుర్తింపులాంటిది. మా మాతృభాష సముద్ధరణ విషయంలో మేం జాగ్రత్తగా ఉండాల్సిన అవసరం ఉంద'ని సదస్సు అధ్యక్షులు ముహమ్మద్ షఫీ పండిట్ అన్నారు. కశ్మీరీ భాష, సాహిత్యం పరిరక్షణకు ప్రభుత్వం ఏమీ చేయట్లేదని అద్బీ మర్కజ్ కమ్రాజ్ అధ్యక్షులు డాక్టర్ అజీజ్ హజిని పేర్కొన్నారు. మాతృభాషను నిర్లక్ష్యం చేస్తే భవిష్యత్తు తరాలు అభివృద్ధి చెందవని ప్రముఖ కవి రఫీక్ రాజ్ అన్నారు.



---

## పిల్లలకు ఎన్ని మాటలొచ్చు!

బుడతల మాటల మర్మాన్ని విప్పేందుకు న్యూజిలాండ్ పరిశోధకులు నడుంకట్టారు. రెండున్నరేళ్ల వయసు వచ్చేసరికి చిన్నారులు ఎన్ని పదాలు నేర్చుకుంటున్నారనేది గుర్తించేందుకు 'కిడ్స్-వర్డ్ కాంటెర్‌బరీ విశ్వవిద్యాలయం జాతీయ ప్రాజెక్టు' పేరిట



అధ్యయనం చేపట్టారు. ఇందుకోసం 2 వేల మంది తల్లిదండ్రుల సాయం కోరారు. 16 నుంచి 24 నెలల మధ్య చిన్నారుల్లో భాష అభివృద్ధి ఎప్పుడు జరుగుతుందనేది ఇందులో పరిశీలనాంశం. ఈ ప్రాజెక్టుతో... భాషకు సంబంధించిన సమస్యలుంటే వీలైనంత చిన్న వయసులోనే గుర్తించే వీలుంది. ఆ సమస్యల పరిష్కారానికి తీసుకోవాల్సిన జాగ్రత్తలూ తెలుస్తాయి.





*తన నోటికందిన కూడు నేలపాలైందని ఊరి రైతాంగాన్నెదిరించాడు ఓ జాలరి.. ఆ రైతులు తనపై పగబట్టారని తెలిసినా వాళ్లకు ఉపకారమే చేశాడు.. ఎందుకూ అంటే...*

తెల్లవారింది. ఊరంతా గుప్పుమంది. గూలవీధి ఆగ్రహావేశాల్తో భగ్గుమంది. ఎక్కడ చూసినా గుసగుసలు, వాదోప వాదాలు. రచ్చబండ మీద.. శివాలయం అరుగు మీద... టీపాకల్లోన.. రామ్మందిరంలోన... నూరుపుకళ్లాల్లోన... కిరాణా కొట్టు దగ్గిర... అన్నిచోట్లా ఒకటే చర్చ.

గ్రామానికి తూర్పునున్న బుక్కూరు చెరువు వైపు జనం గుంపులు గుంపులుగా సాగుతూ... అట్నుంచి అనేక సందేహాలై తిరిగొస్తూ చెరువు దగ్గర అరుపులు... కేకలు... శోకాలు... శాపనార్థాలు..

ప్రత్యర్థుల్లా ఎదురెదురుగా రైతులు, మత్స్యకారులు. ఎవరూ తగ్గడం లేదు. ఎంతకీ తెగడం లేదు. అంతా ఉద్రిక్తత.

మధ్యాహ్నం దాటింది. వాతావరణం చల్లబడింది కానీ ఊరింకా చల్లబడలేదు. గ్రామంలోకి వేసిన తార్రోడ్డు వెంట ఒక కిలోమీటరు మేర ఆవరించుకొని ఉంటుంది బుక్కూరు చెరువు! దాన్ని దాటితే పచ్చని పొలాలు, మామిడి తోటలు, ఇంకా పైన కళ్లాలు, విశాలమైన వీధులు.

సగానికి పైగా తూటిబడ్డ చెట్లు, కనువిందు చేస్తూ నీట్లో తేలే తామరాకులు ఆ చెరువుకు సహజాభరణాలు. చుట్టుపక్కల అయిదారు పల్లెల వ్యవసాయానికి అదే ఆధారం. ఇదీ నిన్నటి పరిస్థితి... కానీ నేడలా లేదు. సగానికి తగ్గిన నీరు, దానిపైన తేలిన బూడిదరంగు నీటితెట్టు, గోగునార కట్టల దుర్గంధం, ముసిరిన దోమల మధ్య అసంఖ్యాకంగా, చిందరవందరగా తేలుతున్న చచ్చిన చేపలతో అంతా అస్తవ్యస్తంగా ఉంది.

జనంలో... ఒక్కసారిగా కలకలం... రహదారి మీద జీపొచ్చి ఆగింది. దాంట్లోంచి మత్స్యశాఖ ఇన్‌స్పెక్టర్, ఎంపీడీఓ, తహసీల్దారు, ఇంకొందరు మండల అధికారులు దిగి గట్టుపైకి వెళ్లేరు. ఆ వెనకే పత్రికా విలేకర్లు, ప్రజాప్రతినిధులు. అంతా పరిశీలించేరు. రకరకాల భంగిమల్లో ఫొటోలు తీసేరు. కుర్చీలెవరో తెచ్చి వేసేరు. కూర్చున్నారంతా! జనమంతా గుమిగూడేరు. దర్యాప్తు మొదలైంది.

"చేపలెప్పుడు చచ్చిపోయాయి?" తహసీల్దారు గొంతు ఖంగుమంది.

"కోడిగుజ్జామున. మా అప్పడు దద్ద దొడ్లోకని సెరువుగట్టికి వొచ్చినాడు బావ్. సూత్తే పున్నమి ఎలుగులో.. సచ్చిన సేపలన్నీ తేలి అవుపడ్డాయి. ఎలగ సచ్చిపోనాయో యేటోగాని మా బతుకులు బుగ్గైపోనాయి"... గుంపులోంచి ఎవరిదో సమాధానం.

"చేపలెలా చచ్చిపోయాయో... ఎవరైనా చెప్పగలరా?"

"నాను సెప్తాను బావ్" పట్టేసిన గొంతును సవరించుకుని అన్నాడొకతను కాసేపటికి.

నిశితంగా అతణ్ని చూసేడు తహసీల్దారు. ఎండిన జీడిపిక్కలాంటి దేహం, కన్నీటి చారికలు కట్టిన ముఖం, ఎర్రబారిన కళ్లతో... ఘనీభవించిన దుఃఖం లా ఉన్నాడతను. పేరు పరసయ్య.

"చెప్పు.."

"ఈ సెర్లోన ఊరి రైతులంతా జనువులు వోరేసినారు బావ్. అదే మా కొంప ముంచింది. అందికే సేపలన్నీ సచ్చిపోనాయి" స్థిరంగా అన్నాడు పరసయ్య. తహసీల్దారుకు నమ్మకం కలగలేదు. మళ్లీ ప్రశ్నించేడు.

"అవును బావ్. నాను సెప్పింది నిజం. జనువులు వోరబెడ్డం వల్ల నీరు సిక్కనైపోద్ది. పులిసిపోయి కంపు కొడతాది. నలుపులైతే పర్నేదు గానీ తెలుపుల కదిపడదు. తట్టుకోనేవు. సెరువు నిండా నీలున్నా బాగున్ను. ఎటొక్కాసి ఎలిపోతాయి. కానీ నీలే లేనప్పుడు

# రేపటి బతుకు కోసం...

ఏటవుతాయి? సచ్చిపోవా? తన పాతికేళ్ల చేపల పెంపకం అనుభవంలో చోటు చేసుకున్న విషాద సంఘటన ఇదేనని వివరించేడు నలభైయేళ్ల పరసయ్య.

"తెలుపులంటే... ఏయే చేపలోయ్?" ఎవరో విలేకరి గొంతులో ఉత్సాహం. "బంగారు పాప, బొచ్చు, రాగెండి, కట్ల, ఎరమేను, రోయి, సిలవరి కింగు, గడ్డిసేప, బీపులైటు, వొల్లంకిల్ని తెలుపులంతారు బావు. అన్నిటికన్నా బంగారు పాపలే మంచివి. బరువెక్కువ. డబ్బులొత్తాయి. ఇందలున్నవన్నీ అవే బావ్!"

"చెరువులో ఇంత తక్కువ నీళ్లున్నాయేంటీ?"

"మరదేగదా సెప్పుతన్నాను. కరమంటే కప్పకి కోపము, ఇడమంటే పాముకి కోపములాగైంది మా బతుకు. నీళ్లన్నీ రైతులు పొలాలకి కట్టేసేరు. మామేటవుతామో ఆలోసించనేదు"... పరసయ్య ఆవేదన వాతావరణాన్ని వేడెక్కించింది. కొంత మందిలో ఆవేశం కట్టలు తెచ్చుకుంటోంది.

"ఏట్రాయ్ పర్సిగా.. ఇందాకట్నుంచి సూత్తన్నాను. ఏటలాగ నీలుగుతన్నావేటి? సెరువుండి దేనికిరా? నీలు కట్టుకోవద్దా? అదునులోని వొరసాలు పడక, సెర్లోని నీటిని కట్టుకోక.. సేలేటవ్వాలి!? ఎనకా ముందు సూస్కోని మాట్లాడు!!" కోపంగా అన్నాడు నారన్నాయుడు. అతనో పార్టీ యువనేత.

"పర్సిగా... ఏటి సంగతి? తందనాలాడతన్నా వేటి.. తప్పంతా మాదే అయినట్టు ఎగిరెగిరి పడతన్నావేటి? సెరువు మీదొక్కలిదే కాదు. అందరిదీ. ఏ సిల్లంగో, సీటకమో పెట్టేసి సేపల్ని సంపీసేరేటో. ఎవులికి తెల్సు"... ఊగిపోయేడు సీతంనాయుడు. అతనే ఊరిపెద్ద. పైగా సర్పంచ్ గారి పెనిమిటి, కనుక అతని మాటకి ఎదురులేదు.

జనంలో ఒక్కసారి అలజడి. మళ్లీ పరస్పర నిందారోపణలు. పరిస్థితి అదుపు తప్పుతోందని తాసీల్దారు లేచేడు.

"దయచేసి అంతా సంయమనం పాటించండి. గొడవలు పడొద్దు. ఈ చేపల మృతికి కారణాలు తేల్చాల్సింది మీరో నేనో కాదు, ఫిషరీస్ డిపార్ట్‌మెంట్ వాళ్లు. కాబట్టి అంతవరకు ఓపికపట్టండి"... చెప్పాల్సింది చెప్పి కూర్చున్నాడు. గొడవ సద్దుమణిగింది. మళ్లీ ప్రశ్నల పరంపర మొదలైంది.

"చేపల రేటు ఎంత ఉండొచ్చు?"

"సుమారు లచ్చ రూపాయలు ఉంతాయ్ బావ్. అప్పులు సేసి వొదిలిన సేప్పిల్లల్ని ఈ అయిదు మాసాలూ కంటికి రెప్పల్లాగ కాసినాం. సరిగ్గా పంట సేతికందికొచ్చిన టయానికి, ఇదిగో ఇలాగైనాది. ఇక మాకేటి దిక్కు?. పిల్లా జెల్లాతో మావెలాగ బతకాల?.." అంటూ అందిన చేపల్ని ఒడ్డున పడేసి గొల్లుమన్నారు గంగపుత్రులు.

మత్స్యశాఖ ఇన్‌స్పెక్టరు చేపల్ని పరీక్షించి జనం ముందుకు వచ్చేడు. ఇద్దరు కానిస్టేబుల్స్ చెరోపక్క నిలబడ్డారు.

"దయచేసి అంతా ప్రశాంతంగా వినండి. ఆవేశకావేశాలకు లోనుకావొద్దు. గోగుల ఊరవేత వల్ల చెరువునీరు కలుషితమైంది. దాని మూలాన చేపలు ఇన్‌ఫెక్షన్‌తో చచ్చిపోయాయి. చెరువులో నీళ్లు లేకపోవడమూ మరో కారణమే. దాన్ని కాదనలేం. చేపల చెరువుల్లో గోగుల ఊరవేత నిషిద్ధమని ఎన్ని సార్లు హెచ్చరించినా మా మాట ఎవరూ ఖాతరు చేయడం లేదు"... కొంచెంసేపు ఆగేడు ఇన్‌స్పెక్టరు. వ్యతిరేక నినాదాలతో రైతులంతా అడ్డు చెప్పేరు. దాంతో అతను సర్దుకున్నాడు. "దయచేసి అర్థం చేసుకోండి. ఇది చాలా సున్నితాంశం. ఏ ఒక్కరి ప్రయోజనాలు ఇందులో దెబ్బతినకూడదు. రైతులకు ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయమని ప్రభుత్వానికి లేఖ రాస్తాను. ఇది తప్ప నేను చేయగలిగిందేమీ లేదు"... ఇన్‌స్పెక్టర్ వివరణకు శాంతించేరు రైతులు. విన్నదీ, చూసిందీ రాసుకునెళ్లారు విలేకర్లు.

"దర్యాప్తు నివేదికను కలెక్టరు గారికి నివేదిస్తాం. రెండు రోజులు పోయాక ఆఫీసుకు రండి. ఏ విషయమూ చెబుతాను"... జీపెక్కుతూ అన్నాడు తాసీల్దారు.

"మీదయ బావు!" చేతులు జోడించేరు జాలర్లు. అధికార్ల జీపు కనుమరుగైంది.

***

ఉండచుట్టి విసిరేసినట్టు గ్రామంలో ఒక మూలనుంటుంది గూలవీధి. వెదురు



తడపలతో గృహోపకరణాలు చేస్తూ కొందరూ, సిలపలతో వలల్ని అల్లుతూ మరికొందరూ.. ఎవరి పనుల్లో వాళ్లు తలమునకలై ఉన్నారు. ఆ వీధిలో ఓ గుడిసెలో భగభగా మండుతోంది కటిక్కఱ్రలపొయ్యి.

దాన్నుంచి నేరుగా దించిన కుండను నేలపైనున్న దాగర్లో మెల్లగా ఒంపింది అప్పమ్మ. బెల్లం పాకంతో కలగలసిన వేడి వేడి మురీలను కాలే చేతుల్తో గబగబా ఉండలుగా చేసి మానిలో వేసింది. 'పాతవి పాతిక, కొత్తవి పాతిక కలిపితే మొత్తం ఏభై. నాలుగు కుంచాలు దాన్నిం వొత్తాయి గావాల. పదిరోజులు సరిపోతాయి. అతగానొచ్చేలోగా ఈటిని అమ్మేసి గప్పున తిరిగొచ్చీయాల" నెత్తిమీద మానిని పెట్టుకుని అనుకుందామె.

నెమ్మదిగా కళ్లాలవైపు దారితీసింది. నూర్పులు జోరుగా సాగుతున్నాయి. ఎటుచూసినా దుమ్మూ ధూళీ, పశువుల అదిలింపులూ, ఎత్తైన గడ్డిదిబ్బలు, ధాన్యం బస్తాల వరసలు.

"అప్పమ్మా... ఇలాగరమ్మీ!" ఎవరిదో నాయిరాలు పిలుపు. దుమ్మూ ధూళీ నిండిన మనుషుల్తో కళ్లమంతా సందడి!

"ఎలాగ ఇస్తన్నావమ్మీ ఉండలు" అడిగిందామె.

"కుంచానికి పన్నెండమ్మా!" మాని కిందికి దించుతూ అంది అప్పమ్మ.

"ఏవీ, ఎంతేసి ఉన్నాయో సూపించిమీ!" మూత తీసింది అప్పమ్మ.

"సిన్నవే ఉండలు. పదిహేనిచ్చిద్దు"

"నేదమ్మా... కిట్టదు"

"సర్నే... ఇద్దరిదీ కాదు. పద్నాలుగిచ్చీ"

బేరం కుదిరింది. నెయ్యుండల్ని లెక్కపెట్టి ఆమె గిన్నెలో వేసింది. కుంచం ధాన్యాన్ని సంచిలో పట్టించుకుంది అప్పమ్మ.

"అప్పమ్మా... మొన్నామజినైన తగువేటయ్యింది" అడిగిందామె.

"ఏటిసెప్పవంతావమ్మీ... మా పాట్లు. గరుగుబిల్లనీ, పార్వుపురమనీ నిన్నటిదాకా తిప్పించినారు. ఈ పొద్దేమో ఇజియనగరం రమ్మన్నారు. మావోల్లంతా ఎల్లినారు. ఇంకా రానేదు... ఏటోనమ్మా ఆల్దయ..."

అప్పమ్మ నిర్వేదం చూసి ఆమెకు జాలేసింది.

"ఏమాటకామాటే సెప్పుకోవాల. మొన్న మీకు జరిగింది అన్నేయమే. పది రూపాయలు పోతేనే ఉసూరుమంతాది గదా... అలాంటివి ఏలుకుపలు నీటిపాలైపోతే గోరం కాదూ... ఆ భగమంతుడు మీయందు ఎలాగున్నాడో యేటో సూడాల.. ఎల్లిరా అప్పమ్మ సేనసేపట్నుంచి నిలబడిపోనావు" ఓదార్చిందామె.

అప్పమ్మ ఇంటికి చేరేసరికి గుమ్మంలోనే కూర్చుని ఉన్నాడు పరసయ్య.

"ఔనో ఎంత సేపయింది ఇంటికి వొచ్చి" గుడిసెలోకి దూరుతూ అంది అప్పమ్మ.



## శిలావిలాపం

ఒక్కగానొక్క మొక్కైనా లేని కొండ
పాపం.. పిల్లలన్నిటినీ
గగనపు గద్ద ఎత్తుకుపోతే...
కుప్పకూలిన తల్లికోడిలా
గుండె రాయి చేసుకుని
మా ముత్తాతల నాటినుంచీ
అలాగే పడి ఉంది!

**- యు.సూర్యచంద్రరావు (విరాగి),**
కొంతమూరు, తూ.గో.జిల్లా

"పావు గంటపైనే అయ్యిందిలే" కాలు చేతులు కడుక్కోవడానికని పెరట్లోకి తోవ దీస్తూ అన్నాడు పరసయ్య. మానిని అటక మీద పెట్టి చకచకా కంచంలో అన్నం, చారు, రెండు పిండొడేల్ని పెట్టి తెచ్చి ముందు పెట్టింది. క్షణాల్లో అతను ఖాళీ చేసి... నులకమంచం మీద చేరబడ్డాడు.

"ఎల్లిన పనేటయ్యింది?"

తనకెదురుగా కూర్చుని ప్రశ్నించిన భార్యవైపు నిస్తేజంగా చూసేడతను.

"ఏటంటే ఏటిసెప్పమంతావు. దరిద్దంగొట్టోడికి దండులో కెల్లినా కూడు కరువంటే ఇదే. తలరాత మారుద్దా సెప్పు?" అన్నాడు.

భర్త నిస్పృహ చూసి మళ్లీ అడిగిందామె... "అసలింతకీ... అక్కడేటి జరిగినాది?"

"కలెక్టరుగారు నేరు. కేంపు ఎల్లేరట. రిపోర్టు జాయింటి కలెక్టరుగారు సూసినారు. అన్నీ ఇన్న తర్వాత ఇనుసురెనుసు లాంటిదేదైనా సేసినారా అన్నారు. లేదన్నాము. కప్పను తన్నిన పామునాగ అతగాడు పల్లకుండిపోనాడు... సేస్సేపు... ఏటనకుంట"

"ఇనుసురెనుసు.. అంటేటి?"

"మనకి ఎల్లయిసీ పాలసీల్లాగా సేపలకి ఉంతాయట. మనకింతదాక తెలీదు. సెయ్యనేదు. ఏమో మునుముందు సెయ్యాలగావాల" అన్నాడు పరసయ్య.

ఏం జవాబివ్వాలో తెలీక మౌనంగా ఉండిపోయింది అప్పమ్మ.

"ఔనువోయ్ బావా. తెలిగేసి ఉన్నావా.. తొంగోనున్నావా?"...అంటూ పక్కింటి చిన్నోడు పరసయ్యతో హాస్యమాడాడు.

"గాబరెందుకు పడతావరా నాయన. ఈలజ్జుగుజ్జులేవో తేలిపోతే మనపనిక ఇంటిల తొంగోడమేనిలే"... వెటకారమాడేడు పరసయ్య మంచం మీద లేచి కూర్చుంటూ.

"బావా... తెలీకడుగుతున్నా. మన డబ్బులు మనకొత్తాయంటావా?"

"ఇంకా అర్థం కాలేదురా సన్నాసీ. ఇనుసురినుసుంటేనే డబ్బులని అన్నారంటే అర్థమేటి? లేపోతే రావనే కదేటి. పైకి రాత్తాము, డబ్బులొత్తే ఇత్తాము అంటే అయన్నీ వొట్టిమాటలు. పనయినప్పుడే అయ్యిందనుకోవాల" అన్నాడు పరసయ్య.

అలా అక్కడో చిన్నపాటి సమావేశమై క్షణాల్లో వాడిగా, వేడిగా మారింది. చివరికి న్యాయపోరాటం తప్ప మార్గం లేదని అభిప్రాయానికొచ్చారు.

"వారేయ్ గుంటల్లార... పేదోడి కోపం పెదవికి సేటంతారు. పెద్దోల్లతో తగువు. మనం నిలబడగలమేటి?! పోన్లెండి ఆలపాపాన ఆలే పోతారు. వాకేల ఏ దానికేదైనా అయితే మనకే కస్టము. వూర్లోన ముకముకాలు సూస్కో లేమురా!" భవిష్యత్తుపై అనుమానాల్ని ఊహించుకుంటూ అభిప్రాయపడింది వృద్ధతరం.



కథ

"అలగని నిండా మునిగి పోతుంటే.. మనకెందుకులే అని సూస్తూ ఊర్కోమంతావా? రేప్పొద్దున్న ఊరొగ్గేసి పారిపోండ్రా అంతారు. పారిపోతామా? ఏం మాట్లాడుతన్నారు..? ఇలాగ పెతిదానికీ బయపడిపోబట్టే మన బతుకులు ఇలగున్నాయ్. ఏటైతే అదయ్యింది. తర్వాత సూసుకుందుము. కేసెయ్యాల, ఆల సంగతేంటో సూడాల" ముక్తకంఠంతో పట్టుబట్టింది యువతరం.

తలొంచకతప్పలేదు పరసయ్యకు. మర్నాడు చందాలు పోగయ్యాయి. అప్పు చేసి కొంతమంది, ఇంట్లో వస్తువులు తనఖా పెట్టి మరికొందరు డబ్బులిచ్చేరు. మూకుమ్మడిగా పట్నంలో వకీలును కలిశారు. కోర్టులో కేసు నమోదైంది.

అనుమానితులందరికీ ప్రతివాదులుగా నోటీసులందేయి. తమ కనుసన్నల్లో, కుక్కిన పేనుల్లాగా బతికే జాలర్లంతా ఇలా న్యాయస్థానంలో తమ ఆధిపత్యాన్ని ప్రశ్నించడం జీర్ణించుకోలేక రగిలిపోయింది పెత్తందారీ వ్యవస్థ.

కోర్టుకి హాజరవ్వాల్సిన రోజు. ఉదయం ఎనిమిది గంటలకి... బస్సెక్కడానికి జాలర్లంతా స్టాపు దగ్గర నిల్చున్నారు. దాని వెనుక శివాలయం అరుగు మీద అందరిలాగే... సీతంనాయుడు, నారన్నాయుడు కూర్చున్నారు. మత్స్యకార్లను చూసి సైగ చేసుకున్నారు.

"అవున్రా... నారన్నాయుడూ... మన చుట్టూ కుక్కల్లా తిరిగినోలకి అంత ధవిర్యం ఎక్కడ్నుండొచ్చిందిరా. ఏటి సూసుకొని అంత పొగరు. ఆలసొమ్మేదో తినేసినట్టు... కోర్టులో కేసెయ్యడమేటి? రేప్పొద్దున్ని ఏ పించినో, ఇల్లతలమో అని నా గుమ్మం ఎక్కమను. అప్పుడు సూపిత్తా తడాఖా!" బాహాటంగానే దుర్భాషలాడేడు సీతంనాయుడు. విషయం జాలర్లకు అర్థమైంది.

"ఇల్లలకగానే పండగకాదు. కోర్టులో కేసేసీగానే సంబరం కాదురా. అది నిరూపనవ్వాల. అంతేకాదొరేయ్, ఊర్లో మరో సెరువునేదు. వొరసాల్లేక ఎవసాయాలు పోతాయని సెర్లోని నీళ్లు కట్టేమని కోర్టులో వాదిస్తాము. కేసు నిలబడతాదేటి? ఇదిగో... ఇప్పుడే సెబుతున్నా. తప్పయిపోయిందని కేసు ఎనక్కి తీసుకుని రాజీకొస్తే సరేసరి. లేప్పోతే ఈ ఊర్లో బతకలేరు. దెబ్బకి ఊరొగ్గేసి పారిపోవాల ఒక్కొక్కడు"... ఆవేశంతో ఊగిపోయాడు నారన్నాయుడు.

పరసయ్య సహించలేక చరచరా వాళ్ల ముందుకు వెళ్లేడు. "బావుల్లార, మీకు శతకోటి దండాలు. మీరు పెద్దోలు. చట్టం తెలిసినోలు. ఎందుకలాగ ఇందాకట్నుంచి రాలిపోతున్నారు? మీ నోటంట మరొక్కమాట వొచ్చిందంటే ఇక మామూ ఊర్కోము. తిన్నగా ఆర్డీవ కాడికెల్తాం. ఎల్లమంతరా సెప్పండి. నిండా మునిగినోడికి సలేటి. మామూ అన్నింటికి తెగించే ఉన్నాము. కానీ, బావూ, వొకమాట... మా బతుకులోని బాదేటో మీకు తెలీదు. మీరు బాగుండాలని ఎదుటోలు ఏటైపోయిన బాదనేదన్న మీ ఆలోసన సెడ్డదని మీకు తెలియాల. అవసరమైతే మావంతా ఒకేమాట మీద నిలబడి ఎదిరించగలమని మీకు బోదపడాల. వచ్చే యేడు నుంచైనా... మా కూట్లో బుగ్గిపొయ్యకుండా మా మానాన మమ్మల్ని బతకనివ్వగలగాల. దానికోసమే ఈ కోర్టులు, కేసులు. తెలిసినాదా?!" సౌమ్యంగా అన్నాడు పరసయ్య.

> శంకులో పెంకు, పెంకులో తీర్థం,
> తీర్థంలో మొగ్గ (టెంకాయ)
>
> ---
>
> సంతలన్నీ తిరుగుతాడు
> సమానంగా పంచుతాడు (త్రాసు)

వినకూడని మాటేదో విన్నట్టుగా వాళ్లిద్దరూ నిశ్శబ్దమైపోయారు. అక్కణ్నించి క్షణాల్లో జారుకున్నారు.

"ఔనర్రా... ఇక్కడున్నారా? మీ గురించి ఎక్కడని తిరగడం!?" అంటూ గాబరాగా వచ్చాడు చిన్నోడు.

"ఏట్రా... ఏటైంది.!?"

"రోడ్డు బాగోలేదని.. రాత్తిరినుంచి బస్సులాపీసేరట. రావుపల్లి వరకే బస్సులు. ఇప్పిడే తెల్సింది"

"సరిపే.. మజ్జిలోన ఇదొకటా. పదండ్రా. మరెందుకునేటు!?" ఉస్సురుమంటూ అందర్నీ సమాయత్తపరిచేడు సరసయ్య.

. రావుపల్లికి కనీసం అరగంట నడాలి. తర్వాత బస్సు ప్రయాణం గంట. వెరసి గంటన్నర. జాలర్లంతా నడకను ప్రారంభించి అప్పటికే పావుగంటైంది. రెండు గ్రామాల మధ్య ఆకుపచ్చని... నిర్మానుష్య ప్రాంతం. దారి పొడవునా ఇరువైపులా వరికోతలు అయిపోగా మిగిలిన మొజ్జులతో ఉన్న పొలాలు, మధ్యలో అంతరపంటగా ఇప్పుడే పువ్వు కడుతున్న పెసరచేలూ అల్లిబిల్లిగా విస్తరించి ఉన్నాయి.

ఈ మత్స్యకారుల గుంపు తప్ప మరెవరూ లేరక్కడ. అయితే చొరబడి ఎంత సేపయ్యిందోగానీ చేను మేస్తూ... పశువుల గుంపొకటి పొలాల్లో కలిదిరుగుతూ దూరంగా కనిపించింది. అవన్నీ సీతంనాయుడు, నారన్నాయుళ్ల పొలాలే.

"వొరేయ్, అటు సూడండ్రా. అలువుడ్ని బలువుడు కొడితే బలువుడ్ని బెమ్మదేవుడు కొట్టాడట. అలగుంది తీరవ. పోన్లే, కడుపునిండా తిననీ" అన్నాడొకడు గుంపులో.

"ఆలకి... అలాగే అవ్వాల... నేప్పోతే ఊర్లోంచి తన్ని తగిలేత్తామంటారా. మన ఉసురు తగల్దా. అక్కడేటీ జరగనేదు. మనం సూడనేదు. పదండి, పదండి. మనకెందుకు?" తొందరచేసేడు మరొకడు.

ఈ మాటలు పరసయ్య చెవినబడ్డాయి.

"బాగుందిరా మీ వరస. ఆల్తో మనకి తగువులుంటే మాత్తరం మజ్జిలో ఈ పెసరసేనేటి సేసింది?! ఆలకి నష్టమొస్తే మన కష్టం తీరిపోద్దా. అదేం తీరవరా? డబ్బెంత పోసినా పోయిన పంట తిరిగిరమ్మంటే వొస్తదా? సేతికందిన కూడు నోటికందక నానాయాతన పడుతున్నోలం. మనలాంటోల నోట రావాల్సిన మాటలు కావర్రా.." అన్నాడు పరసయ్య.

మిగిలినోళ్లు అదోలాచూసేరు. కానీ అప్పటికే పశువుల్ని తోలడానికి పొలాల్లోకి పరుగుపరుగున దారితీసేడు పరసయ్య..!



**పాలకొల్లు రామలింగస్వామి**
పార్వతీపురం, విజయనగరం.
94414 16049

# తినే బంగారం



మా వాడు 'బంగారం' అని ఓ అబ్బాయి గురించి కవిత్వం రాని తల్లిదండ్రులు చెప్పుకున్నా... ఓ యవ్వనవతిని ప్రాచీన కవి 'పసిడి శలాక' (బంగారు కడ్డీ) అని ప్రయోగించినా... బంగారం ఎప్పటికీ విలువైందే. కనకం, కాంచనం, సువర్ణం, హిరణ్యం, పసిడి... ఇలా మారుపేర్లు ఎన్ని ఉన్నా బంగారంపట్ల మగువలకు ఉండే ఆకర్షణ మాత్రం ఒక్కటే. ధరలో హెచ్చు తగ్గులతో నిమిత్తం లేకుండా, బంగారం కొనేందుకు అందరూ ఆసక్తి చూపుతారు. ఒకప్పుడు నగల వరకే పరిమితంగా ఉన్న బంగారం ఇప్పుడు పెట్టుబడిగానూ మారింది. అసలు తెలుగిళ్లలో బంగారం ప్రాముఖ్యతను గురించి ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. మరి ఇంతటి ముఖ్యమైన అంశాన్ని మన కవులు, రచయితలు వదులుతారా? శక్తికొద్దీ, సృజనకొద్దీ విభిన్న సందర్భాల్లో బంగారాన్ని ఉపమానంగా ప్రయోగించారు.

గుణవంతుల్ని 'బంగారం', 'బంగారు తల్లి', 'బంగారుబాబు', 'బంగారు కొండ' అంటారు. అందగత్తెని 'బంగారు శలక', 'బంగారు కొండ' అంటారు. "బళిరా తేరకు దేర దక్కె నిటు నీ 'బంగారు కుండ" అని, పాండురంగ మాహాత్మ్యంలో తెనాలి రామకృష్ణుడు అంటాడు. "శృంగార రస మొసంగన్, 'బంగారపు బొమ్మ' వంటి బాలిక" అని శుకసప్తతిలో చక్కని ప్రయోగం ఉంది. "బతుకనేర్చిన తనువాక్క పతికొసంగి, బంగరము వంటి మనసు గెంటంగ నేల?" అని మంచి మనసుని బంగారు మనసు అనటం కూడా ఈ శుకసప్తతిలో కనిపిస్తుంది. నవ యవ్వనాన్ని "యంగన భోగముల పంట యామని యగు నీ బంగారు వంటి పాయము బంగారుపాయం" (ప్రాయం) అనటం కనిపిస్తుంది. ప్రియమైన వాణ్ని "నా బంగరయ్యా నీవు చల్లగా నుండుమికన్" అనటం కూడా కనిపిస్తుంది. గొప్పదనం సమకూరటాన్ని "అమరుగాక హిరణ్య శృంగములు" అంటూ 'బంగారు కొమ్ములు అమరా'యనే కవి ప్రయోగమూ ఉంది.

విలువైనది ఏదైనా అది మనకు 'పసిడి మూట'. "భార్యకు బతిదయ పసిడిమూట" అంటాడు రుక్మాంగద చరిత్రలో కవి! అందుబాటులో ఉన్న మంచిని 'కొంగుబంగారం' అంటాం. పంటలు బాగా పండితే బంగారం పండిందంటారు. విలువ పెరిగిందని చెప్పటానికి 'బంగారానికి పరిమళం అబ్బిందం'టారు. దానంతట వచ్చే భాగ్యాన్ని "మూల ధనంబు నివేశనంబులో బంగరు వాన చేతికగపడ్డ తలంపుల మానికంబు" అంటూ 'బంగారు వాన'అనే ఒక కొత్త ప్రయోగం కనిపిస్తుంది.

అదృష్టవంతుణ్ని 'బంగారు కాళ్లయ్య' అంటారు. అలాంటి వాళ్లకు 'పట్టిందల్లా బంగారం' అవుతుందనీ, 'పట్టినది బంగారం, ముట్టినది ముత్యం' అనీ మెచ్చుకుంటారు. దానగుణశీలుణ్ని 'చెయ్యి బంగరు కడ్డీ', బంగారు చెయ్యి అంటారు. అత్యాశాపరుణ్ని 'బంగారు గుడ్లకోసం బాతుని చంపుకున్నవా'డు అని పోలుస్తారు. లేనిది ఉన్నట్టు భ్రమింపచేసే దాన్ని 'బంగారు లేడి'గా భావిస్తారు. ధనమదంతో మాట్లాడే మాటల్ని 'పసిడివాపు'అంటారు.

నిశ్చితార్థాన్ని 'పైడిముడుచు' కార్యక్రమం అని పిలుస్తారు. పైడి, పయిడి, భమిడి అనేవి బంగారాన్ని సూచించే తెలుగు పదాలు. 'భమిడి పళ్లెం' అంటే బంగారు పళ్లెం. దేశవాళీ పత్తి మొక్కని 'పైడిపత్తి' అంటారు. ఒకప్పుడు ఈ తెలుగింటి పైడిపత్తి మొక్క ప్రపంచానికి బట్టలందించింది. బంగారు తీగ అనే ఒక రకం చెరకు అతి తియ్యగా ఉంటుందట. "పసిడివ్రాత చెఱంగు మిసిమి గల్గిన దట్టి..." జరీ అంచు చీరని 'పసిడి వ్రాత చెఱగు' అనటం కనిపిస్తుంది.

అడుగు పెట్టిన చోటెల్లా అభివృద్ధిని కలిగించువాణ్ని 'బంగారు కాళ్లయ్య' అంటారు. ఎక్కడికెళ్లినా నాశనం కలిగించే వాణ్ని 'ఐరన్ లెగ్' అన్నట్టే "యే వేళన్



మణి యే ముహూర్తమున మాయిల్ సొచ్చినాడో మనో భావజ్ఞుండయి సర్వమున్ నడుపు నా బంగారుకాళ్లయ్య జే జే" అంటుంది ఓ కవిప్రయోగం.

**ఆరోగ్యదాయకం**

బంగారం అంటే ఉపమానమే కాదు ఆరోగ్యదాయకం కూడా! బంగారు చెంచా నోట్లో పెట్టుకుని పుట్టాడని అదృష్టవంతుల గురించి చెప్పుకుంటూ ఉంటాం. బంగారు చెంచా నోట్లో పెట్టుకుంటే ఏమౌతుంది...? 'స్పర్శామాత్రం'గానే వైద్య ప్రయోజనాల నిచ్చే శక్తి బంగారానికి ఉంది. మెడలో నగలు అలంకారం కోసం మాత్రమే కాదు. బంగారం స్పర్శతో కలిగే ఆరోగ్యం కోసం కూడా! బంగారు కంచంలో భోజనం చేయటం, బంగారు గిన్నెలో పాయసం తాగటం ఆ స్వర్ణ స్పర్శాభాగ్యం పొందటానికే! మధ్య తరగతి మందభాగ్యత వల్ల బంగారు పళ్లేలు కొనలేక, బంగారు పువ్వునో, చుక్కనో పెట్టించిన వెండి కంచాల్లో తింటారు. కుడిచేతి వేళ్లకు రాళ్లు లేని బంగారు ఉంగరం పెట్టుకొని భోజనం చేసినా స్వర్ణ స్పర్శా భాగ్యం దక్కుతుంది.

వంటికి తగిలితే చాలు ఇంత మేలు చేసే బంగారాన్ని తింటే ఇంకెంత గొప్ప మేలు చేస్తుందో కదా! 'తినేబంగారం' గురించి మనం చెప్పుకోవాల్సినవి చాలా ఉన్నాయి. 'తినేబంగారం' ఎలా తయారవుతుంది, దాన్ని ఎందుకు తినాలి, ఎంత తినాలి, ఎప్పుడు తినాలి, ఎన్నాళ్లు తినాలి... ఇవన్నీ బంగారం లాంటి ప్రశ్నలే!

తినే బంగారం స్పర్శామాత్రంగా, దీర్ఘకాలం శరీరంపైన పనిచేస్తుందని ఆయుర్వేద శాస్త్రం చెప్తోంది. బంగారపు రేకుని తీసుకున్న 24 గంటలలోపు జీర్ణకోశంలోంచి పూర్తిగా బయటకు విసర్జితమవుతుందని భారతీయ, పాశ్చాత్య వైద్యశాస్త్రాలూ రెండూ చెబుతున్నాయి. ఆధునిక వైద్యశాస్త్రం బంగారాన్ని శరీరానికి హాని చేయని లోహంగా (Biologically inert metal) పేర్కొంది. ఎంత తిన్నా చిన్నమెత్తు బంగారం కూడా వంట్లో ఇమడదు. కేవలం ఒక రోజుపాటు మన శరీరంలో ఉండి, స్పర్శ చేతనే జీవితానికి సరిపడా శక్తినిస్తుంది! 'తినే బంగారం' మహత్తు ఇది!.

**తినే బంగారు రేకులు**

తినేందుకు వీలైన బంగారం పలుచని రేకులా ఉంటుంది. ఈ రేకుల్ని 5,000 ఏళ్ల క్రితమే ఈజిప్షియన్లు తయారు చేయటం ప్రారంభించారని చరిత్ర చెప్తోంది. 2,000 ఏళ్ల క్రితం మనవాళ్లు బంగారు రేకుల్ని పుటంపెట్టి స్వర్ణభస్మం తయారు చేసి వైద్యంలో ఉపయోగించటం నేర్చారు. బంగారాన్ని తయారుచేసే (ఆల్కెమీ) క్రమంలో పాదరసం, వంగం, నాగం అభ్రకం లాంటి లోహాల వైద్యగుణాలు తెలుసుకున్నారు. అలా తెలుగునేల మీద 'రసశాస్త్రం' పుట్టింది. పాదరసం కలిగిన రసౌషధాలను తెలుగు మందులు అంటారందుకే! సిద్ధ నాగార్జునుడు ఈ శాస్త్రప్రవక్త. తెలుగువాళ్లు లోహాల మీద మొదటి నుంచీ విశేషమైన పరిశోధనలు చేశారు. వంటింట్లో ఆవిరిమీద కుడుములు వండినట్టు, నిప్పులమీద అప్పడాలు కాల్చినట్టు రకరకాలైన వంట పద్ధతుల్లో లోహాలను వండి ఔషధాలు తయారు చేశారు. అందుకని రసౌషధాలను వంటౌషధాలంటారు. ముఖ్యంగా తెలుగువారికి 'తినే బంగారం' మీద అనుభవం ఎక్కువ.

వేడి చేసిన బంగారపు బిళ్లని మందపాటి తోలు అట్టల మధ్య ఉంచి, గట్టి చెక్క సుత్తితో కొట్టి 'ఆకుపలుచని రేకు'లాగా సాగదీస్తారు. ప్రపంచం అంతా ఈ పద్ధతిలోనే స్వర్ణపత్రాలను తయారు చేస్తున్నారు. ఇటీవలి కాలంలో యంత్రాలు వచ్చినా బంగారపు రేకు తయారీ ఇంకా కుటీర పరిశ్రమగానే సాగుతోంది. చిన్న విషయాన్ని కొట్టీ కొట్టీ సాగదీస్తున్నాడనే మాట బంగారాన్ని సాగదీయడం నుంచే వచ్చింది.

**ఇలా తినాలి!**

బంగారం రేకు తయారు చేయడానికి స్వచ్ఛమైన బంగారం కావాలి. సాగదీత కోసం 23.5 కేరెట్ల బంగారాన్ని ఎంచుకుంటారు. మిగిలిన 0.5 కేరెట్టు వెండి లేదా రాగిని దృఢత్వం కోసం కలుపుతారు. ఎక్కువ కలిపితే బంగారం వన్నె తగ్గిపోతుంది. నిప్పుల మీద కాల్చటమే బంగారానికి శుద్ధి. కాల్చిన బంగారాన్ని మేలిమి లేదా మేలిమి బంగారం అంటారు. ఇది చక్కని తెలుగు మాట. మేలిమి బంగారాన్ని సాగకొట్టి అంగుళం పొడవు సన్నని ముక్కలుగానో, అటుకులంత చిన్న ముక్కలుగానో కత్తిరించి లిట్మస్ పేపర్ల మధ్య ఉంచి భద్రపరుస్తారు. ముట్టుకుంటే పొడి అయిపోయేంత పలుచగా ఉంటాయీ రేకులు. పెద్దవాళ్లకి అంగుళం పొడవున్న సన్న ముక్క, చంటిపిల్లలకు అటుకంత చిన్నముక్క తినటానికి సరిపోతాయి.

కంచంలో వేడి వేడి అన్నం కొద్దిగా వడ్డించి, దానిమీద ఈ బంగారం రేకుముక్కని ఉంచితే ఆ వేడికి బంగారపు రేకు కరిగిపోతుంది. దాన్ని ఆవునెయ్యితో తింటారు. 'బంగారు అన్నం' తినే పద్ధతి ఇది. చంటిబిడ్డలకు మాత్రం తేనె, కొద్దిగా నెయ్యి కలిపి రంగరించి వేలికొచ్చినంత భాగాన్ని నాలుక మీద రాసి నాకించాలి. ఇదే స్వర్ణప్రాశనం లేదా స్వర్ణలేహ్యానం ప్రక్రియ. కానీ, అదేపనిగా పెడితే, అన్నప్రాశన రోజునే ఆవకాయ పెట్టినట్టవుతుంది. **'ఆ మధ్వా మధు సర్పిభ్యం లేహ్యాతే కనకం శిశుః**

**సువర్ణప్రాశన హి ఏతత్ మేథాగ్ని బలవర్ధనం ఆయుష్యం మంగళం పుణ్యం వృష్యం గ్రహాపకం'** అని బంగారం రేకుని తింటే కలిగే ప్రయోజనాలు వివరిస్తుంది కాశ్యపసంహిత. దీనివల్ల పిల్లల్లో మేధోలబ్ధి (IQ), జ్ఞాపకశక్తి, ఏకసంథాగ్రాహ్యత పెరుగుతాయి. పోలియోలాంటి జబ్బులు రావు. శరీరం బలసంపన్నం అవుతుంది. ఆయుష్షు వృద్ధి, మంగళకరం, పుణ్యప్రదం. గ్రహదోషాల పీడ ఉండదు. పుష్యమీ నక్షత్రం రోజున బంగారంలో వైద్యగుణాలు వృద్ధిలో ఉంటాయి. కాబట్టి, విరేచనాలు, జ్వరం లేకుండా చూసి అ రోజు పొద్దున స్వర్ణప్రాశన చేయాలని ఈ ప్రాచీన ఆయుర్వేద గ్రంథం సూచించింది.

బిడ్డకు చేసే జాతకర్మల్లో స్వర్ణప్రాశన కూడా ఒకటి. వాగ్భటుడు బిడ్డ పుట్టిన నాలుగో రోజే బంగారం రేకు తినిపించాలన్నాడు. మూడో నెలలోనో ఆరోనెలలోనో చేస్తే మంచిదని మరికొందరి అభిప్రాయం. పదహారో ఏడు వచ్చేవరకూ పిల్లలకు అప్పుడప్పుడు బంగారపు రేకు తినిపిస్తూ ఉండాలని కూడా చెప్తారు. బంగారపు రేకు బదులుగా స్వర్ణభస్మాన్ని తేనె నెయ్యిలతో తినిపించటాన్ని స్వర్ణబిందు ప్రాశన అంటారు. స్వర్ణభస్మాన్ని కూడా బంగారపు రేకుతోనే చేస్తారు. కాబట్టి, రేకుని తినిపించటానికి ప్రాధాన్యతనివ్వాలని మరికొందరు చెప్తారు.




### తెలుగు సంస్థ

మన ఊళ్లో మనవాళ్ల కోసం ఉద్దేశించిన దుకాణానికి పరాయి పేరు ఎందుకు? మన భాషలో నామకరణం చేస్తే... అందం గానూ ఉంటుంది, వినియోగదారులనూ ఆకట్టుకుంటుంది. శ్రీకాకుళం పట్టణంలోని వస్త్ర దుకాణం 'యువతి'కి పేరు పెట్టే ముందు ఇలాగే ఆలోచించానంటున్నారు దాని యజమాని బోయిన ఉమేశ్.

**చిత్రం:** వాంగ్రంగి కొండలరావు, పొందూరు

**ధనిక సంస్కృతి**

బంగారు రేకుల్ని తినే అలవాటు ఈ రోజుల్లో ఒక ధనిక సంస్కృతిగా మారిపోయింది. స్వర్ణపత్రాల భక్షణలో ప్రపంచంలో అబూదాబీ అగ్రగామిట! 'ఎమిరేట్స్ ప్యాలెస్ హోటల్'కి వచ్చిన అతిథులకు 2008 ఏడాది కాలంలో 5,00,000 బంగారు రేకులు వడ్డించినట్టు ఒక సర్వే చెప్తోంది. తినే బంగారం కథ ఇది.

విదేశాల్లో ప్రస్తుతం బంగారు రేకు అంటించిన స్వీట్లు, చాక్‌లెట్లు, క్యాండీలూ దొరుకుతున్నాయి. మనదేశంలో స్వీట్లు, కిళ్లీలూ పలుచని తెల్లరేకులు చుట్టి అమ్ముతున్నారు. ఇది వెండి రేకు (Silver foil) అన్న భ్రమలో మనం వాటిని తింటున్నాం. కానీ, అది నికెల్- సీసంలాంటి లోహాల రేకు కావచ్చు. దానివల్ల శరీరంలో సీసం అవశేషాలు పేరుకొని (లెడ్ పాయిజనింగ్) చెడు ప్రభావం చూపుతుంది. కిడ్నీలు, కాలేయం, కళ్లు దెబ్బతింటాయి. అందువల్ల అతి సర్వత్ర వర్జయేత్! మితంగా వాడితే మీ ఆరోగ్యం బంగారమే!



**డా. జి.వి.పూర్ణచందు**
విజయవాడ, 94401 72642

## నేను

దేహం నేను, దాహం నేను
మేఘావృత సందేహం నేను
ఖడ్గం నేను, యుద్ధం నేను
ఖడ్గ చాలన కౌశలం నేను
నేను విసిరిన ప్రశ్నల పరంపరకు
కుత్తుక తెగిన సమాధానం కూడా నేను
స్నేహం నేను, ద్రోహం నేను
మానవ సంబంధ సందోహం నేను
వేదం నేను, భేదం నేను
యజ్ఞవాటికన హవిస్సు నేను
నేను ఎగిసిన నభస్సు సభన
ప్రభవించిన ప్రచండ తేజం నేను
తెగిపడిన ఏకలవ్యుడి బొటన వేలిలో
తలవంచని వీరత్వం నేను
సీల ఊడిన కర్ణుడి రథచక్రాన
పోరుకు వెరవని శూరత్వం నేను
నేనొక సేద్యం, నాదొక వైద్యం
నా హృది నెత్తుటి పూజా పుష్పం
నేనొక అశ్వం, నాదొక స్వప్నం
నా గుడి వాకిట గంటా శబ్దం
నేను నడిచిన నట్టడవుల తోవల
మిన్నాగులూ, మణిమాణిక్యాలూ
నేను చూసిన మస్తిష్క కుహరాన
చీకటి నీడలు, చీడలు, పీడలు
ఒకరినొకరు హత్తుకుపోతూ



ఒకరి కుత్తుకలొకరు కోస్తూ
ఒకరికొకరు అత్తరు పూస్తూ
ఒకరి నెత్తురు ఒకరు చూస్తూ
మానవ దానవ సంగర రంగాన
మానవత్వపు తుదికేళి హననాన
భగవద్గీతలు, భక్తి రాతలు
నుదుటి గీతలు మార్చని క్షణాన
నేనిలా మిగిలా జీవన చదరంగాన
రాజులు, శకటులు, రాణి, బంటులూ
మంత్రతంత్రాలు, శక్తులు, కుయుక్తులు
రాక్షస క్రీడలు సలిపే రణాన
ఏది ధర్మం? ఏది అధర్మం?
ఏది న్యాయం? ఏది అన్యాయం?
ప్రశ్నకు పుట్టే ప్రశ్నను నేను
కర్మకు పుట్టే జన్మను నేను
జన్మను దిద్దే కర్మను నేను
సత్కర్మను నేను!

**- దండమూడి శ్రీచరణ్**
భువనగిరి, నల్లగొండ. 98661 88266

# పుస్తకాల అలమరా





పుస్తకాల అలమరా
మస్తకానికి కెమెరా!
అంతరంగ మథనంలో
ఆవిర్భవించిన భావమయూరాలు
పేజీల పురులు విప్పి
నాట్యమాడతాయి.

పుస్తకాల అలమరా
జ్ఞాపకాల దొంతర!
తీగ మీటితే
వీణ మోగినట్లు
తిప్పుతున్న ప్రతి పుటకూ
గుండె తంత్రులు ఝల్లుమంటాయి.

పుస్తకాల అలమరా
అద్భుతాల ఖజానా!
మంత్రగాళ్లు, మహారాజులూ,
భూతాలూ, బ్రహ్మరాక్షసులూ,
మాయాద్వీపం, ఎగిరేమంచం
పట్టుకోగానే ప్రత్యక్షమవుతాయి.

పుస్తకాల అలమరా
అనుభూతుల నజరానా!
అప్పుడెప్పుడో చదివిన
చిట్టి పొట్టి నేస్తం
ఇప్పుడు మనపిల్లలకూ
దోస్తీకావటం, భలే విచిత్రం.

పుస్తకాల అలమరా
అనుభవాల జమానా!
అక్షరాలలో ప్రతిష్ఠించిన
అనేకానేక పాత్రలు
జీవితం వివిధ దశల్లో
అందివచ్చిన అపురూప మిత్రులు

పుస్తకాల అలమరా
మనిషికొక ఆసరా!
అది తల్లడిల్లే హృదయాలకి
చల్లని సందేశమిస్తుంది.
ఎల్లలులేని మానవలోకానికి
విలువల వెలుగు నందిస్తుంది.

**- తమ్ము పావెల్,**
విజయవాడ. 93925 95155

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 కి | రీ | 2 టి | ■ | 3 రో | ■ | 4 నా | 5 గ | స్వ | 6 రం |
| శ్లీ | ■ | 7 పో | 8 రం | బో | 9 కు | ■ | ద్యం | ■ | గ |
| ■ | 10 సం | ■ | భ | ■ | 11 క్షి | 12 తి | ■ | 13 యు | వ |
| 14 కం | దు | 15 కం | ■ | 16 తి | ■ | 17 రు | 18 మ | ■ | ల్లి |
| కి | ■ | రీ | ■ | 19 మ్మ | కొ | ■ | 20 న | క్ర | ■ |
| ■ | 21 దొ | ర | వా | రు | ■ | 22 క | వి | ■ | 23 కం |
| 24 భా | ■ | వం | ■ | 25 సు | 26 ధ | ర్మ | ■ | 27 బొం | కు |
| 28 ద్ర | వ్యం | ■ | 29 ఓం | ■ | న్వం | ■ | 30 చ | ■ | భ |
| ప | ■ | 31 చే | ■ | 32 పీ | త | ■ | 33 లో | 34 గు | ట్టు |
| 35 దం | తా | వ | ళం | ■ | 36 రి | క్క | ■ | హ | ■ |

## పేర్లు పెట్టేయండి!



**ముద్దులొలికే చిన్నారులకు ముచ్చటైన పేర్లను సూచించండి. మీరు సేకరించిన/ రూపొందించిన కొత్త తరహా పేర్లను మాకు పంపండి. వాటికి అర్థవివరణ కూడా రాయండి. తేట తెలుగులో, కొత్తగా, సృజనాత్మకంగా ఉండాలి. అలా ఉన్న వాటిని ఎంపిక చేసి, మీ పేరుతో 'తెలుగు వెలుగు'లో ప్రచురిస్తాం. మీరు పెట్టే పేర్లు వేలాది తెలుగిళ్లలో మార్మోగే అవకాశం ఇది...**

శ్లాఘ - ప్రశంస; తుహిన - మంచు; వనధి - సముద్రం; ప్రణిధి - ప్రార్థన; చంద్రిమ - వెన్నెల; సంప్రీతి - ప్రేమ;

**- జి.వి.సుబ్బలక్ష్మి,** తార్నాక, హైదరాబాదు

సుగంధి - తావి; సుషిర - నది; శ్రీపర్ణి - తామర; తపని - గోదావరి;

**- ఎం.అహల్యాదేవి,** హైదరాబాదు

# సాంకేతిక సేతువు

మీ వెబ్‌సైట్‌తో తెలుగు భాషకు చాలా ఉపయోగమండీ. 'తెలుగు తగ్గిపోతోందో' అని ఏడ్చేవాళ్ల కన్నా... ఇలాంటి వెబ్‌సైట్లు పెట్టి కృషి చేస్తున్న మీలాంటి వారి వల్ల తెలుగుకు చాలా మేలు కలుగుతుంది. ఈ సాంకేతిక యుగంలో సాంకేతిక, విజ్ఞానశాస్త్రాలను తెలుగులో చెప్పడం వల్ల తెలుగూ అభివృద్ధి అవుతుంది. ఆంగ్లంపై పట్టు లేకుండా, గ్రామాల నుంచి వచ్చే నా బోటి కుర్రాళ్లకూ ఉపయోగపడుతుంది.

**– 'టెక్‌సేతు'ను అభినందిస్తూ ఓ యువకుడు రాసిన వ్యాఖ్య**

ఇంతగా నవతరాన్ని ఆకట్టుకున్న ఆ 'టెక్‌సేతు' ఏంటి? దాన్ని నిర్మించిన వాళ్లెవరు? తెలుగు కోసం, తెలుగువాళ్ల కోసం వాళ్లు పడుతున్న తపనేంటి?

ఇది కంప్యూటర్ యుగం. ప్రభుత్వ సేవల నుంచి పోటీపరీక్షల వరకూ అన్నింటికీ ఆన్‌లైనే ఆధారం. ఇక ఉద్యోగార్థులకైతే, వారు పనిచేయబోయే పరిశ్రమ/ రంగంతో సంబంధం లేకుండా - ప్రాథమిక కంప్యూటర్ పరిజ్ఞానం తప్పనిసరి. మరి ఆ విజ్ఞానమేమో చాలావరకూ ఆంగ్లంలోనే ఉంది. ఆ భాషపై పట్టులేని వారికి, దాన్ని అందిపుచ్చుకోవడం సాధ్యమేనా? ఇదంతా నాణానికి ఒకవైపు. మరోవైపు... వ్యాపారం, ప్రాజెక్టు వర్కులు, ఉద్యోగావసరాలు... ఇలా చాలామంది సొంత అవసరాల కోసం కంప్యూటర్/ లాప్‌టాప్ కొనుక్కొంటున్నారు. దాంతో కుస్తీపడుతున్నప్పుడు హఠాత్తుగా అది ఆగిపోతే...? ఏం చేయాలో తెలిసి ఉండాలి కదా. ఆ సాంకేతిక పరిజ్ఞానం తెలియకపోతే... చేతిచమురు వదలడమే కాదు, విలువైన కాలమూ వృథా అవుతుంది. బయటివారితో పనిలేకుండా సొంతంగా మరమ్మతు చేసుకోవాలంటే, మనకంటూ కొంత పరిజ్ఞానం అవసరం. దాన్ని సంపాదించడం ఎలా?

ఇదిగో ఈ సమస్యలకు పరిష్కారాన్ని చూపేదే 'టెక్‌సేతు' (techsetu.com). సంక్లిష్టమైన కంప్యూటర్ విజ్ఞానాన్ని సులువైన తెలుగు(యూనికోడ్)లో అందించే వెబ్‌సైట్ ఇది. 'దేశంలో ఇప్పుడు పదిహేడు శాతంగా ఉన్న మధ్యతరగతి జనాభా, రానున్న పదిహేనేళ్లలో యాభైనాలుగు శాతానికి పెరుగుతుంది. ఎంతోమందికి ల్యాప్‌టాపులు, కంప్యూటర్లను కొనే స్తోమత వస్తుంది. బ్రాడ్‌బ్యాండ్, 3జి వంటి సాంకేతికతలు వాళ్లకు మరింత చేరువవుతాయి. అలాంటప్పుడు వాళ్లు ఇవన్నీ నేర్చుకుని వాడుకోవడానికి తగిన సాయం కావాలి కదా! దీని కోసం మన తెలుగు వాళ్లు కొందరు... టెక్నాలజీ గురించి వాళ్లకి తెలిసిన విషయాల్ని బ్లాగుల్లో రాశారు. రాస్తున్నారు. అయితే అవన్నీ ఆంగ్లంలో ఉంటున్నాయి. కానీ, తెలుగు మాత్రమే తెలిసినవాళ్లు, ఆంగ్లం తెలిసినా అంతగా పట్టులేనివాళ్లు... టెక్నాలజీని ఉపయోగించుకోవాలంటే ఈ ఆంగ్లమే అడ్డుగోడ అవుతోంది. అందుకే ఆ రాసేదేదో తెలుగులో రాస్తే వాళ్లకు చాలా ఉపయోగం కదా' అన్నది 'టెక్‌సేతు' అభిప్రాయం.






**వాటిని చూసి...**

మాది రైతు కుటుంబం. ఇంజనీరింగ్ చేస్తున్నప్పుడు... కంప్యూటర్లో సాంకేతిక సమస్యలు తలెత్తినప్పుడు స్నేహితులు, బంధువులు పడే అవస్థలను చూసేవాణ్ని. నిజానికవి చాలా చిన్న సమస్యలే. అయితే, వాటిని ఎలా పరిష్కరించుకోవాలన్న సమాచారం ఆంగ్లంలో ఉండటంతో... అది అర్థం కాక ఇబ్బంది పడేవాళ్లు. తెలివితేటలుండీ మనవాళ్లు ఆంగ్లం వల్ల అవస్థ పడటం నచ్చలేదు. అప్పుడే ఓ ఉపాయం తోచింది. సాంకేతిక అంశాలను తెలుగులో వివరిస్తూ అంతర్జాలంలో తగిన సమాచారాన్ని అందుబాటులో ఉంచితే... ఇలాంటి సమస్యలు తీరతాయనిపించింది. నా స్నేహితుడూ తోడయ్యాడు. అలా 'టెక్‌సేతు' స్థాపించాం. మాకు తోచిన అంశాలు, ముఖ్యమనుకున్నవి గుర్తించి... వీలు చిక్కినప్పుడల్లా రాస్తుండేవాళ్లం. ఇది చూసిన ఔత్సాహికులు కొందరు వ్యాసాలు రాసి పంపేవారు. అవి 'టెక్‌సేతు'ను మరింత మెరుగుపరచాయి.

**– గోపాలకృష్ణ**

ఆ దిశగానే దాని ప్రయత్నం.

**ఎన్నో విషయాలు...**

వైరస్‌ల నుంచి కంప్యూటర్‌ను ఎలా రక్షించుకోవాలి, ఫైల్ పోతే (డిలీట్ అయితే) ఎలా తిరిగి తెచ్చుకోవాలి, విండోస్‌లో అందుబాటులో ఉన్న ఉచిత సాఫ్ట్‌వేర్లు అప్లికేషన్లు ఏంటి, విండోస్‌లో తెలుగు చదవడం-టైపుచేయడం ఎలా, మైక్రోసాఫ్ట్‌లో యాంటీ వైరస్ సాఫ్ట్‌వేర్‌లను ఉచితంగా పొందడమెలా... ఇలాంటి వివరాలెన్నో 'టెక్‌సేతు'లో తెలుగులో కనిపిస్తాయి. ఇవే కాదు.... ఇంజనీరింగ్, ఎంసీఏ విద్యార్థులకు అవసరమయ్యే విషయాలు - ప్రోగ్రాములను రాయడమెలా, క్లౌడ్ కంప్యూటింగ్ పుట్టుపూర్వోత్తరాలు, వెబ్ సర్వీస్ అంటే ఏంటి, ఎలా పనిచేస్తుంది, సొంతంగా వెబ్‌సైట్ ఎలా రూపొందించాలి... లాంటి వాటికి ఇక్కడ సమాధానాలు దొరుకుతున్నాయి. అంతేనా... లినక్స్‌లో ప్రోగ్రామ్ ఎలా రాయాలి, 'ఉబంటు'లోని ఉపయోగపడే విషయాలేంటి తదితర అంశాలపై కూడా అమ్మభాషలోనే విలువైన సమాచారం ఉంది. సాంకేతిక విషయాలను 'టెక్‌సేతు'... ఎంత సులువైన తెలుగులో అందిస్తుందంటే... ఓ ఉదాహరణ... 'కంప్యూటర్‌లో శాశ్వతంగా నిక్షిప్తపరచాల్సిన సమాచారాన్ని దాచడానికి ఉపయోగపడే సాధనం హార్డ్‌డిస్క్. దాన్ని ఉపయోగించే విధానంలో, జాగ్రత్తగా గమనిస్తే - దానికి, ఇంటికి చాలా దగ్గరి పోలికలు కనిపిస్తాయి. మనం ఒక గది నిర్మాణానికి అవసరమైన జాగాను మీటర్లలోనో, అడుగుల్లోనో కొలుస్తాం. అలాగే, హార్డ్‌డిస్క్‌లో జాగాను బైట్లలో కొలుస్తారు...'

**ఇద్దరు మిత్రులు**

ఆంగ్ల మాధ్యమంలో చదువుకున్న ఇద్దరు స్నేహితులు... సాంకేతిక పరిజ్ఞానాన్ని తెలుగులో అందించడం కోసం నడుంకట్టారు. పశ్చిమగోదావరి జిల్లా గోపవరానికి చెందిన గోపాలకృష్ణ, కడప వాసి గవేష్... హైదరాబాద్‌లో ఇంటర్ చదివేటప్పుడు స్నేహితులయ్యారు. ఇంజనీరింగ్‌లో గోపాలకృష్ణకు 'టెక్‌సేతు' ఆలోచన వచ్చింది. అది తన మిత్రుడికీ నచ్చడంతో మార్చి 2009లో 'టెక్‌సేతు' ప్రారంభమైంది. మొదట్లో చాలా ఇబ్బందులు పడ్డారు. ఎందుకంటే, వీళ్లు చదువుకుంది ఆంగ్లంలో. వెబ్‌సైట్లో రాసేదేమో తెలుగులో. కొన్ని సాంకేతిక పదాలకు తెలుగు మాటలు తెలిసేవికావు. కానీ, నిరుత్సాహపడలేదు. మన అమ్మభాషలో వాటికేమైనా సమానార్థకాలు ఉన్నాయేమో అని అంతర్జాలంలో వెతికే వాళ్లు. అప్పుడే వాళ్లకి 'తెలుగుపదం' అనే గూగుల్ సమూహం (గ్రూప్) గురించి తెలిసింది. అందులో కొందరు ఔత్సాహికులు - కొత్త పదసృష్టికి ప్రయత్నించేవాళ్లు. తయారు చేసిన మాటలను విరివిగా వాడుకలోకి తెచ్చేవాళ్లు. అలా వాళ్లు రూపొందించిన మాటలను 'టెక్‌సేతు' మిత్రులూ వాడటం మొదలుపెట్టారు. అలాగే, 'ఆంధ్రభారతి' వెబ్‌సైట్లోని నిఘంటువుల ఆధారంగా సొంతంగా వీళ్లూ కొన్ని పదాలను సృష్టించారు. 'ప్రోగ్రామింగ్ లాంగ్వేజ్'కు 'యంత్రభాష', 'నెట్‌వర్క్'కు 'మాధ్యమం'... ఇలా వీలైనంత వరకూ ప్రతి విషయాన్నీ తెలుగులో చెబుతూ ఇప్పటి వరకూ వివిధ అంశాలపై 300





**అంతా అదే అయినప్పుడు...**

ఎటుచూసినా టెక్నాలజీమయం. టెక్నాలజీ ఆధారిత ఉద్యోగాలున్నాయి, నేర్చుకోవడానికి కావల్సిన వనరులున్నాయి. కానీ ఈ రెండూ ఆంగ్ల భాషకే పరిమితమయ్యాయి. సాంకేతిక నైపుణ్యాలున్నా... ఆంగ్లం రాకపోవడం వల్ల మనవాళ్లు వెనకపడిపోతున్నారు. మరోవైపు... ఆంగ్ల మాధ్యమంలో చదివే విద్యార్థి కూడా సాంకేతిక విషయాలను ఆంగ్లంలో అర్థం చేసుకోలేకపోతున్నాడు. జర్మనీ, జపాన్, చైనా లాంటి దేశాల్లో ప్రభుత్వంతో పాటు కొన్ని స్వచ్ఛంద సంస్థలు కూడా శాస్త్ర, సాంకేతిక రంగాల సమాచారాన్ని మాతృభాష ద్వారా అందరికీ అందుబాటులోకి తెచ్చే ప్రయత్నం చేస్తున్నాయి. మనం ఆ పని చేయలేమా? అలా చేస్తే, తెలుగు, దాని ద్వారా సాంకేతిక పరిజ్ఞానం ఈ తరానికి చేరువవుతాయి. ఈ ఆలోచనలోంచి వచ్చిందే 'టెక్‌సేతు'.

– గవేష్

వ్యాసాలు రాశారు. నెమ్మదిగా వెబ్‌సైట్‌కు ఆదరణ పెరిగింది. ముఖ్యంగా విద్యార్థులు దీన్ని ఎక్కువగా సందర్శిస్తుంటారు. ఇప్పటి వరకూ 1.70 లక్షల హిట్లు వచ్చాయి.

ప్రస్తుతం గోపాలకృష్ణ స్పెయిన్‌లో ఉంటూ పీహెచ్‌డీ చేస్తున్నారు. గవేష్ ఇక్కడే సాఫ్ట్‌వేర్ ఇంజినీరు. అయినా... సమయం మిగుల్చుకుంటూ వెబ్‌సైట్‌ను నిర్వహిస్తున్నారు. ఎవరికి వీలైతే వాళ్లు... వ్యాసాలు రాస్తారు. వీటితో పాటు... ఆసక్తి ఉన్నవాళ్లు ఎవరైనా, కంప్యూటర్ సమాచారాన్ని తెలుగులో రాసి పంపితే దాన్నీ ప్రచురిస్తారు.

**చిన్నారుల కోసం...**

'టెక్‌సేతు'తో పాటు చిన్నారుల కోసం ఈ మిత్రులిద్దరూ మరో తెలుగు వెబ్‌సైట్‌నూ నిర్వహిస్తున్నారు. అదే... 'ఎందుకు?' (enduku.com). ఆరోగ్యం-ఆహారం తదితరాలతో పాటు మూఢనమ్మకాల్లోని అశాస్త్రీయత, వైజ్ఞానిక అంశాల స్థూల పరిచయం తదితరాలకూ ప్రాధాన్యమిస్తారు.

తెలుగువాళ్లు ఏ రంగంలో ఉన్నా... ఆయా రంగాల్లో తెలుగు వ్యాప్తి కోసం కృషి చేస్తే మన భాష నవతరానికి చేరువ అవుతుంది. అలాగే, ఆయా రంగాల సమాచారాన్ని తెలుగులోకి తెస్తే భాష పరిపుష్టమవుతుంది. గోపాలకృష్ణ, గవేష్... ఇలాంటి ప్రయత్నమే చేస్తున్నారు. వారి స్ఫూర్తితో మరికొందరు సమాచార, సాంకేతిక నిపుణులూ ఈ బాటలో నడిస్తే... సాంకేతిక యుగంలో తెలుగు తళుకులీనుతుంది. ❖




రవి గాంచని రవి కిరణాలం
ఉషస్సు కానలేని ఉషోదయపు కిరణాలం
నడి సంద్రపు అంచులలో కానరాని కెరటాలం
కదలిపోయే కాలంలో తీరం చేరని కెరటాలం
అలుపెరుగక అలసిపోయిన చీకటి పయనం
కనికరం లేక కన్నతల్లి ఒడి చేరక
ప్రేమానురాగాలకు దూరమైన నిశీధి వలయం
నాన్నలో ఉప్పొంగే తపన కొంతైనా మిగలని నిరాశ నిలయం
ఆకలితో అలమటించి దిక్కులే పిక్కటిల్లె
ఆర్తితో ఎదురుచూస్తే అప్పుడే కానరాడాయె
బాధతో కుమిలిపోయి జాడతెలియని ఎడారి అగుపించె
దప్పికతో సొలసిపోయి కన్నీటి కడలిపొంగె
చిన్నారి చిరునవ్వు చీకటై మిగిలిపోయె
చిరిగిపోయిన చితికిన చిన్నారి బతుకులు
కరిగిపోయి కాంతులిడలేని మనుగడ లేని వెతలు
పరుగెత్తే ప్రతిపయనం పారేసిన విస్తరేనా
విలపించే ప్రతి కన్నీరూ కానరాని సంద్రమేనా
ఏతీరూ లేని ఈ పసిహృదయం చూసి
ఏతెంచే ప్రతిజనసంద్రపు హృదయం ద్రవించలేదా
ఈ హృదయపు వీణమోగలేక కరడు కట్టిందా
మానవతకు మనుగడ లేక మాసిపోయిందా
కునుకు లేక రాతిరే తెల్లబోయిందా
జాడలేక రవి కిరణం నిదురబోయిందా
నిలువలేక జాబిలమ్మ మోము చిన్నబోయిందా
ఈ కన్నీటి కడలి దాహం తీరేనా
ఈ సంద్రపు ఆకలి ప్రళయం ఆగేనా
ఈ కన్నీటి కడలి దాహం తీరేనా
ఈ సంద్రపు ఆకలి ప్రళయం ఆగేనా
జాలిగా జాబిలమ్మ దరి చేరేనా,
మోముతో పుడమికొమ్మ తలవంచేనా
తడి ఆరని కన్నీరే నీ తల్లిగ మారేనా,
లాలితో పిల్లగాలి నీ ఊసే వినెనమ్మ
అమ్మా... ఆకలి... అని భోరు భోరున విలపిస్తుంటే
కఠిన నేలకున్న కనికరం ప్రాణమున్న మనిషికి లేదా?
ఈ ఘోషకు బదులేది, ఈ ఆర్తిని కనలేరా,
ఈ చిన్నారుల చరితం కన్నీటి కడలేనా
ఉదయించే ఉషోదయం, నడిపించే నవోదయం
పరిమళాల సుమకుసుమాలు విరబూయాలి
మమతానురాగాల సుమ కాంతులు విరజిల్లాలి
ఈ చీకటి చీల్చుకొని తెల్లవారేనా
జనసంద్రపు మనోనేత్రం తెరిచేనా, మానవత్వం పెల్లుబికేనా
చితికిన చిదిమేసిన సమిధలైన చిన్ని బతుకులు కావవి
నిశీధి రాత్రిలో ఘోరకలిలో కాలిపోయే చిన్ని బతుకులు కావవి
బతుకు జాడచూపి చేయూతనిద్దాం మానవత్వం మాసిపోలేదని నిరూపిద్దాం
చేయిచేయి కలుపుదాం మనసున్న మనుషులుగా అడుగు ముందుకేద్దాం

**- జ్యోతి నండూరి,** హైదరాబాదు, 8978639692

# పొడి ఏడుపు



నేనొక గ్యాసు స్టవ్వు కడ నిల్చి హుషారుగ కాఫి చేయగా బూనెడు నంతలోన పొడి మొత్తము జాలిగ నోరు విప్పి నా ప్రాణము దీసెదే యనుచు బావురు మన్నది; ముగ్ధిపోతి; నా మానసమందెదో కలుకు మన్నది కాఫి పొడేడ్పు కావ్యమై.

"కాఫి పొడి డబ్బులో నేను గమ్మునుండి
ఒదిగి యుంటిని నిష్కామ యోగివోలె
నీట ముంతువె కాఫికై మోటు మనిషి!?
హృదయమేలేని యీ పానమెందుకోయి?

నల్లమసి నేను, చక్కని నరుడ వీవు
బుద్ధి యున్నది జీవానుభూతి గలదు
బండయగుటేలనోయి నీ గుండెకాయ?
నీవు త్రావను లేవటే నీళ్ళు, నదులు?

ఆయువుగల్గు నాల్గు గడియల్ భరియించిన గింజతల్లి యా త్మీయపు రూపధారణఁ దదీయ శరీరపు రంగుటూహ తో నూయల హాయిమై మురియుచుండెదమీవిటు కాచినంతనే 'హా' యని కన్నుమూసెదము హంతక! ధ్వంసక! నీదు 'పున్నె'మై.

గాలికి హ్లాదమిత్తుము సుగంధము పూసి; సమాశ్రయించు మీ పాలకు తోడుగుండెదము భ్రాత విధమ్మున; మిమ్ము బోంట్ల గా త్రాలకు హాయి గూర్తుము స్వతంత్రతఁ గోల్పడి త్యాగ బుద్ధితో; తాళవ? ఒక్కరోజయినఁ ద్రావక యుండగలేవ మానవా!?

ఆత్మ సుఖమ్ము కోసమయి యన్యుల మంటలపాలు సేయు పు ణ్యాత్ముడ! నీకు మోక్షమెటులబ్బును? పాపపు చేతి పూజ వి శ్వాత్ముడు స్వీకరించునె? చరాచరవర్తి హరుండు మా పవి త్రాత్మల నందుకోడె? యిసుమంతయు తోచద? బుద్ధియేటికిన్?

కాలు నీరాలలో మమ్ము కలిపి, ముంచి,
గుండెలో నుండి చెంచాను గ్రుచ్చి, త్రిప్పి
పిండుకొందురు ముచ్చట గుండియలను
అకట! దయలేనిదేర మీ వికట జాతి.

గుండె తడిలేక వేడిమిన్ గుముల జేసి
కాఫిగా చేసి మాసార గమిని మీరు
స్వాహ చేసెదరుగద యుత్సాహమమర
పులుముకొందుర నలుపు మీ పుట్టెలందు?

అక్కట! హాయి మేయుదు 'రహా' యనుచెందరొ నీదు నేస్తముల్ ప్రక్కల, ముందు చేరుకొని పానము చేయుచు కాఫి కప్పుతో నొక్కరు గూడ మాస్థితిని నూహకు కొంచెము తెచ్చుకొందురే? చిక్కగ పిప్పిగా మిగులు శేష కషాయము జేర్తు మోరిలో.

మా వెలలేని యద్భుత ఘుమంఘుమ, నీలిమలున్ గలట్టిదౌ జీవితమెల్ల మీకయి త్యజించి, వ్యయించి, ముగించుకోమె? మా జీవన మెల్ల కొల్లగొని శేషము నెంగిలి మంగలంబుగా నావల పారబోతురు గదా! నర రీతికి నీతి యున్నదా?

బుద్ధ, గాంధీల భూమిలో పుట్టినావు
సహజమగు జాతి నీలోన చచ్చెనేమొ!
అస్మదాదుల నీరీతి హత్యజేయ
అంటువడిపోయె నీజన్మ హంతకుండ!

మానవత చీడ పట్టిన మానె యయ్యో
మానవా! మానవా కాఫి పానమింక? -
ఇట్లు కాఫి చూర్ణమ్ము చీవాట్లు పెట్ట
వాడిపోయెను నా వాంఛ; మాడె మోము.

కరుణశ్రీ పుష్పవిలాపానికి పేరడీ

- **శ్రీపతి పండితారాధ్యుల పార్వతీశం,** హైదరాబాదు, 98497 79290

## పేరడీ ఆహ్వానం




మీరూ ఇలా రాసి మాకు పంపించవచ్చు. అవి తేట తెలుగులో ఉండాలి. ఎవర్నీ కించపరచకూడదు. మీ సొంత రచనేనని, అది గతంలో ఏ మాధ్యమంలోనూ ప్రచురితం కాలేదని, మరెక్కడా పరిశీలనలో లేదనీ హామీపత్రం తప్పక జతచేయాలి. పేరడీకి స్ఫూర్తి కలిగించిన మూల రచననూ జోడించాలి. దాని రచయిత ఎవరు, అదెక్కడ ప్రచురితం / ప్రసారం అయ్యింది, లేదా ఏ చిత్రంలోది అన్న వివరాలూ ఉండాలి. ప్రసిద్ధ రచన అయితే మంచిది. ఎంపికైన వాటిని తెలుగు వెలుగు పత్రికలో ప్రచురిస్తాం, సముచిత పారితోషికమూ ఉంటుంది.



# అసంపూర్ణం

**తల్లిదండ్రుల్నీ, భార్యాపిల్లల్నీ, జననమరణాల్నీ, కాసేపే ఆలోచించమంటాడు. కాస్త స్థితప్రజ్ఞత పొందమంటాడు. చివరికి ఉరుకుల పరుగుల అతని జీవితం సంపూర్ణమో, అసంపూర్ణమో తేల్చుకోలేకపోతాడు..**

"దుఃఖములు కలిగినపుడు దిగులు చెందని వాడు... సుఖములు కలిగినపుడు స్పృహలేని వాడు... భయము, రాగము, క్రోధము పోయినవాడు.. స్థితప్రజ్ఞుడని చెప్పబడును.." ఘంటసాల గాన ప్రవాహం సాగిపోతోంది.

స్థితప్రజ్ఞత సుఖదుఃఖాలకు అతీతం. సహజంగానే జీవన ప్రవాహంలో అంతో ఇంతో ఇది తప్పనిసరేనేమో..! రాన్రానూ గాఢత తగ్గిపోతోందా? స్పందనారాహిత్యం ప్రబలిపోతోందా? స్పర్శ నానాటికీ మొద్దుబారిపోతోందా!

ఇది అనివార్యతా? కేవలం ఇది బహిర్గతమా? అంతర్గతమూ ఇంతేనా? అంతా ఇంతే అనడం కూడా అసాధారణమేనేమో..!

సహజంగా సాగిపోవడం వేరు. కాస్త ఆగి, లోలోపలికి చూసుకుంటూ సాగడం వేరు. ఒకే గాట కట్టలేం. ఒక్కసారి వెనుతిరిగి చూస్తే, కాసింత ఆలోచిస్తే, ఒక కుదుపు..!

15...25...35...45...55

ప్రభవ...విభవ...విజయ...జయ...

ఇక సంపూర్ణం దిశగా అడుగులు. అది ఎప్పుడో అర్థం కాదు. ఇక్కడే పెద్ద ప్రశ్న.. సందేహం...

అంతా అయిపోయిందా? అంతా అయిపోతుందా...!? మన వెంట ఏమీ రాదు.. నిజమే.. ఆ తర్వాత సరే, మరి ఇప్పుడో.. ఇన్నాళ్ల తర్వాత, ఇన్నేళ్ల తర్వాత కూడానా!

ఎప్పుడో అప్పుడెప్పుడో మధ్యలోనే ఆగిపోయినవీ మనవి అనుకున్నవీ, అవి ఏమైపోతాయి...?

ఈ సగంలో ఇప్పుడు ఆలోచిస్తే... ఇదో అన్యమనస్కం. ఆ తపనలూ ఆ భావాలూ నిజంగా రాలిపోయాయా? లేదే.. ఆ గాఢతలు సడలిపోయాయా? నిజంగా మనల్ని వీడిపోయాయా? లేదే.. మరెందుకు? ఇదిలా అసంపూర్ణమేనా? ఆ అసంపూర్ణంలో సంపూర్ణం ఎలా సాధ్యం?

చిటికెన వేలు వదిలి ఎటో వెళ్లిపోయిన బంధం. మోహమో, బంధమో, రెండు హృదయాలను కలిపింది. కాలంచెల్లి, కాటేసి వెళ్లింది...!

ప్రారంభమనేది నిజమైతే, ముగింపు సాధ్యమేనా? పెనవేసుకోవడంలో గాఢతే ఉంటే, విడిపోవడం? వీడిపోవడానికి ఏ గీతలో సారాంశం వెతుక్కోవాలి...?

ఆలోచనలోచనా ప్రవంతి.. ఎక్కడ వెదకాలి? ఎవరిని ఆశ్రయించాలి? జిడ్డు కృష్ణమూర్తినా? ఫ్రాయిడ్‌నా...!?

* * *

నాన్నా ఏం ఆలోచిస్తున్నావు?

ఏం లేదురా... చెప్పు....

నాకేమీ అర్థం కావడం లేదు నాన్నా..

పాఠాలా..? ట్యూషన్ ఉంది కదా...

అది కాదు నాన్నా...

మరేంట్రా?

పెళ్లి ఎందుకు చేసుకోవాలి నాన్నా..?

ముందు చదువుకోమ్మా.. ఇప్పుడే ఆ ఆలోచనలు ఎందుకు... ఇంకా అంత వయసు రాలేదు కదా...!

అది కాదు నాన్నా.. మిమ్మల్ని వదిలి వెళ్లిపోవాలా?

నీకు ఇష్టం లేని పని ఏదీ చెయ్యొద్దమ్మా. క్రమేణా నీకే అంతా అర్థమవుతుంది. ఏం కంగారు పడకు...

* * *

తనకి ఏం అర్థమవుతుంది? అర్థం కాదు. అయినా అలా చెప్పాలి. తప్పదు..

ఏం అర్థమైందని సాగిపోతున్నాం? అర్థమయ్యేలోపే అంతా అయిపోతోంది.

కొండలు దాటి, గుట్టలు దాటి, తిన్నెలు దాటి, ఆ అలజడులను అధిగమించి, గలగలలను తనలో నిక్షిప్తం చేసుకుని, మైదానాన నిశ్చల ప్రవాహమవుతుందట నది. అప్పుడే నిండుదనం వస్తుందట. వయసూ అంతేనట...

మరి ఇదేంటి? నిశ్చలత్వం తిరగబడుతోంది. గాంభీర్యం గాడి తప్పుతోంది? వయసు పెరిగినా సూత్రం తప్పుతోందేమిటి? మనసు తప్పిదమా? అనుభవ రాహిత్యమా? అందరిలా ఉండలేకపోవడమా..?

> భూమిలో పుట్టింది. భూమిలో పెరిగింది
> రంగేసుకొచ్చింది రామచిలుక
> (పొడుపుకథ)

ఇంకా ఆ ప్రజ్ఞ అలవడలేదా? కొనసాగించాలా? ఆలోచించాలా? ఆగాలా? ఇలా ఎక్కడి వరకు...!? తార్కికమా? అన్వేషణా...!?

సహజాతాన్ని ఎలా కాదంటాం. సర్దుకుపోతూ పోతే అసలు సంగతేమిటి..? ఏది ఎందుకు కాదనాలి? ఎవరో ఏదో అంటే ఎందుకు అవుననాలి...?

ఒక పువ్వు పరిమళిస్తుంది. మేఘం వర్షిస్తుంది. కొమ్మ చిగురుతొడుగుతుంది. మనసు మనసుపడుతుంది. మనసు పడుతూనే ఉంటుంది...

సహజత్వానికి విఘాతమేల...? ఎప్పటి ఘాతాలైనా, ఎప్పటికైనా మానిపోవాలంటే కాలమే పరిష్కారమా? ఆ చేయి స్పర్శలో ఆ ప్రేమ తడిలో ఆగిపోయినవి హత్తుకోవా? వీడిపోయినవి ఎన్నటికీ అల్లుకోవా? ఒక అసంపూర్ణం సంపూర్ణమయ్యేదెలా మరి? ఎక్కడిదక్కడేనా... ఎప్పటిదప్పుడేనా...

జీవితం ఏంటి ఘాట్‌రోడ్డులా ఇన్ని మలుపులు తిరుగుతోంది. మలుపు మలుపులో ఒక మరుపు. వచ్చిన దోవలోనే మళ్లీ వెళ్లేలా, గాయాలన్నింటికీ అమృత స్పర్శ పూసేలా, సాగిపోతే...?

మమేకం...తాదాత్మ్యం...

* * *

ఇంతలో ఆవిడ వచ్చింది. ఒకసారి




చూసి వెళ్లిపోయింది. మళ్లీ వచ్చింది. ఎంత సేపు అలా...

ఆ ఆధార్ కార్డు సంగతి చూడండి... లేకపోతే సబ్సిడీ రాదట.. పిల్లాడి కాలేజీ సీటు సంగతి తేల్చాలి. ఎప్పుడూ అలా ఆలోచిస్తూ కూర్చుంటే ఏం సాధిస్తారు?

అవును.. ఏం సాధించాలి? ఇది సాధించడం అంత సులభం కాదు...

ఆధార్ కార్డు, గ్యాస్ ఏజెన్సీకి అది అందివ్వడం, కుర్రాడి కాలేజీ సీటు.. ఇవన్నీ పూర్తి చేయాలి. ఇక్కడ ఇదో సంపూర్ణం.

ఎల్ఈడీ టీవీ, సిప్, జీవిత బీమా, పెన్షన్, నిశ్చింత!

ఇది నిశ్చింతేనా? ఇదో నిశ్చింత..!

తప్పదు. కొన్నింటిలో ఒక భాగం కావాలి. కొన్ని పనులు చేసినందుకు, ఈ పనులూ చేయాలి.

జీవితం ఇంత అప్రయత్నమేమిటో, ఏం చేసినా సాగిపోతుంది. ఏం చేయకపోయినా సాగిపోతుంది. ప్రయత్నానికి పరమార్థం ఏమైనా ఉందా? ఇన్నాళ్లుగా చూస్తున్నా.. ఊ అన్నా ఒకటే.. ఊహూ అన్నా ఒకటే...

* * *

అమ్మ వచ్చింది.

విషయం చెప్పింది.

మానవ సహజం కదా, అయ్యో అని అన్నా.. కాసేపాగి కాలు బయటకు కదిపా ఆ నలుగురిలో ఒకడినవుదామని.

అక్కడ అంతా హడావుడి.. కట్టెలు సిద్ధమవుతున్నాయి.. ఇతనిది సంపూర్ణత్వమా..? అసంపూర్ణత్వమా...!?

ఆ వెనుక నుంచి మంద్రంగా గీత వినిపిస్తోంది. దుఃఖింప తగని వాటి గురించి దుఃఖించుట అనుచితం...

మనసులో మెరుపు మెరిసింది.

ఒక సమాధానం..

ఎంత వరకు..

క్షణమా... గంటా... రోజా....!?



బొమ్మరాజు దుర్గాప్రసాద్
హైదరాబాదు. 80080 01748



## పునర్నిర్మాణం

తూర్పు ముఖానికి ఎర్రబొట్టు పెట్టిన
"పడుచుపల్లె"
ప్రపంచీకరణ విషపు కౌగిలిలో
కరిగి ఉడిగిపోయింది

రోజూ సూర్యుణ్ని ప్రసవించే
చెరువు ఎండిపోయింది
ఏట్లో కాలుష్యం
మనసులలోకి పాకింది
నాగలి నాట్యానికి నవ్వే నేలని
రియలెస్టేట్ ఆబోతులు
"మేసేసాయి"
ఉత్తరాన చింతతోపుకి
సెజ్ పురుగు కుట్టింది

ఇక్కడ
మనిషి వాసన వచ్చే మట్టి గోడలు
స్వార్థపు వరదలో కొట్టుకుపోయాయి
ఇప్పుడన్నీ గట్టిగోడలు
పరాయి మనుషులే కాదు
మనసులూ రాలేవు

ఒకడి గొండెకోతకు
ఊరంతా పొగిలి ఏడ్చిన పల్లె
ఇప్పుడు రాజకీయ జెండాల కింద
చీల్చబడింది

పాలిచ్చి పెంచిన పట్నం
ఇప్పుడు పల్లెని పాలిస్తోంది
ఉన్నవన్నీ ఊడ్చిపెట్టాక
పల్లె మనుషులను
ఎగుమతి చేస్తోంది
ఇక్కడ పట్నానికి కలిపే
దారులన్నీ "వన్ వే"లు
ఇప్పుడది పల్లె కాదు
"విలేజ్"
ఇప్పుడొక నిర్మాణం కావాలి
మనిషి నిలబడాలి
పల్లె నిర్మించబడాలి

- దోర్నాదుల సిద్దార్థ, పలమనేరు, చిత్తూరు జిల్లా 94923 74787

# చెడనిది పద్యమొక్కటే...

**తెలుగు సాహిత్యాన్ని** సుసంపన్నం చేసిన ప్రక్రియ శతకం. వేమన, సుమతి, దాశరథి లాంటి శతకాలు మనకు సుపరిచితమైనవి. ఈ కోవలోదే 'గువ్వలచెన్న' శతకం. ఇందులోని పద్యాలు అంతగా తెలియకున్నా, 'పలువిద్యలెన్ని నేర్చిన కులవిద్యకు సాటిరావు గువ్వలచెన్నా' అన్న పాదం తెలుగువాళ్లంతా ఎప్పుడో ఒకప్పుడు తలచుకునేదే. 18వ శతాబ్ది నాటిదిగా భావిస్తున్న ఈ శతకంలో అప్పటి సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక పరిస్థితుల విశేషాలు ఎన్నో తెలుస్తాయి. నీతి, వ్యంగ్య, అధిక్షేప పద్యాలతో సాగిన శతకం ఇది. పైగా ఇందులో అప్పుడు సామాజిక ధోరణులు ఎలా ఉన్నాయో, ఎలా పరివర్తన చెందుతున్నాయో తెలుస్తాయి.

'శ్రీ పార్థసారథీ! నే బాపాత్ముడ...' అంటూ అన్ని తెలుగు కావ్యాల్లానే గువ్వలచెన్న శతకం కూడా శ్రీకారంతోనే ప్రారంభమవుతుంది. 17వ శతాబ్దంలో మన దేశానికి వ్యాపారం నిమిత్తం ఇంగ్లిష్‌వాళ్లు వచ్చారు. భారతీయుల అనైక్యతను ఆసరాగా తీసుకొని దేశాన్ని క్రమక్రమంగా ఆక్రమించి, తమ పాలనను సుస్థిరం చేసుకున్నారు. ఆంగ్లేయుల పాలన ప్రారంభమైన తొలినాళ్లలో మన సమాజంలో వచ్చిన మార్పుల్ని పద్యాల్లో బంధించాడు ఈ శతక రచయిత. తరాల నుంచి వస్తున్న సంప్రదాయ వేషధారణను విడిచి, చదువుకొన్నవాళ్లు పాశ్చాత్యుల్ని అనుకరించేవాళ్లన్న విషయాన్ని కొన్ని పద్యాలు వెల్లడిస్తాయి. ఆంగ్లేయుల పాలనలో దేశంలో పంచాయతీల స్థానంలో కోర్టులు వచ్చాయి. ఈ క్రమంలో ఆవిర్భవించిందే న్యాయవాద వృత్తి. పద్యాల్లో ప్లీడర్లు, వకీళ్లు అన్న పద ప్రయోగాలు ఇది ఆంగ్లేయుల కాలం నాటిదిగా పట్టి చూపుతాయి. ఈ శతకంలోని పద్యాల్లో న్యాయవాద వృత్తిని చేపట్టినవాళ్ల ప్రవర్తన ఎలా ఉండేదో వివరించాడు కవి.

### చెన్నపట్టణంతో అనుబంధం

గువ్వలచెన్న శతకానికి చెన్నపట్టణానికి సంబంధం ఉన్నట్లు రెండు పద్యాల ద్వారా తెలుస్తుంది.

**చెన్నయను పదము మునుగల**
**చెన్నగు పురమొకటి నీదు చెంతను వెలయున్**
**సన్నుతులు వేల్పునుతులును**
**గొన్నాతని కరుణ చేత గువ్వలచెన్నా!**

ఓ గువ్వలచెన్నా! చెన్న అన్న పదం ముందు చేరి చెన్నపురం నీ సమీపంలో వెలుస్తుందంటాడు శతకకర్త. 'ధరనీపేర పురంబును...' పద్యం కూడా ఇలాంటిదే. వకీళ్లను, దొరలను (ఆంగ్లేయులు) గురించి పద్యాల్లో పేర్కొనడం గువ్వలచెన్న శతకకారుడికి మద్రాసుతో పరిచయం ఉండి ఉంటుందనడానికి ఆలంబనగా నిలుస్తుంది.

ఆంగ్లేయులు తూర్పుతీరంలో తమ అవసరాలకు సరితూగే వర్తక స్థావరం కోసం వెతుకుతున్నారు. ఆ ప్రయత్నంలో చంద్రగిరి రాజును కలిశారు. రాజు వీరికి మదరాసపట్నం సమీపంలో స్థలాన్ని ఇచ్చాడు. ఆ సమయంలో ఈ ప్రాంతానికి పాలకుడు దామెర్ల వెంకటాద్రి. ఈయన తండ్రి పేరు చెన్నప్ప. ఈయన పేరుతోనే 1639లో ఆంగ్లేయులు కోట కట్టుకున్న ప్రాంతానికి చెన్నపట్నం అని పేరు పెట్టారు. మదరాసపట్నం అంతకు ముందునుంచీ ఉన్నదే. తర్వాత రెండూ కలిసిపోయి ఏది ఏదో చెప్పటం కష్టమైంది. అందుకే రెండు పేర్లూ వాడుకలో ఉన్నాయి. అయితే ఇంగ్లిష్‌వాళ్లు మాత్రం మద్రాసు అనే పిలిచారు. ఆ పేరుతోనే మద్రాసు ప్రెసిడెన్సీ ఏర్పాటైంది. 1995లో మద్రాసు పేరును చెన్నైగా తమిళనాడు ప్రభుత్వం మార్చింది. ఈ సంవత్సరంతో (2014) చెన్నపట్నానికి 375 ఏళ్లు నిండాయి. ఒకప్పుడు ఇక్కడ చెన్నకేశవ స్వామి దేవాలయం ఉండేది. ఈ దేవుని పేరుమీదే ఈ శతకం వెలువడి ఉంటుంది.

### కూటికొరకే కోటివిద్యలు

శతకాల్లో ప్రధాన లక్షణం తాత్విక దృక్పథం, ఆత్మాశ్రయ రీతి. ఈ శతకంలో కూడా...

**ఎన్నగల జీవరాసుల**
**యన్నిటి గర్భమునఁ బుట్టి యట మనుజుండై**
**తన్నెఱిఁగి బ్రతుకు వలెరా**
**కొన్నాళ్లకు నెచట నున్న గువ్వలచెన్నా!**

అంటాడు. ఎన్నో జంతు జన్మలు ఎత్తిన, తర్వాతే ఈ మానవ జన్మ ప్రాప్తమైంది. అందుకే, మనిషి సత్తువ ఉన్న రోజుల్లో ఎలా మెలిగినా, ఎప్పటికైనా, ఎక్కడ ఉన్నా తనను తాను తెలుసుకొని బతకాల్సిందే.

**ఎంతటి విద్యలఁనేర్చిన**
**సంతసముగ వస్తుతతులు సంపాదింపన్**
**చింతించి చూడ నన్నియు**
**గొంతుకఁ దడుపుకొనుకొఱకె గువ్వలచెన్నా!**

కోటి విద్యలు కూటికొరకే. అలానే ఎన్ని విద్యలు నేర్చినా, ఉత్సాహంతో ఆస్తిపాస్తులు సంపాదించినా, ఆలోచించి చూస్తే అవన్నీ గొంతు తడుపుకునేందుకే. చిన్నపద్యంలో జీవిత లక్ష్యాన్ని ఎంత చక్కగా తెలిపాడో!

**తనవారికెంత గల్గిన**
**దనభాగ్యమె తనకునగును దగువాజులకున్**
**దనతోక చేత వీచునే?**
**గుణియైన ఘోటకంబు గువ్వలచెన్నా!**

పద్యంలో బంధు మిత్రులకు ఎంత ఉంటే ఏంటి, తన దగ్గరుండేదే తనకు భాగ్యం. గుర్రం ఎంత గొప్పదైనా తన తోకతో పక్క గుర్రానికి విసరదు కదా! అంటాడు. మానవ



మనస్తత్వాన్ని గుర్రం బుద్ధితో పోల్చడం విశేషం. పిల్లలను డబ్బుకు, విలాసాలకు దూరంగా ఉంచాలి. అప్పుడే వాళ్లకు జీవితంలో కలిమి లేముల ప్రాధాన్యత తెలిసివస్తుంది. దీని ప్రాధాన్యతను...

**బుడుతలు భోగంబులుసిరి**
**యడరు కొలంది ఘనకార్య మందహితులై**
**తొడరికడు జెడుదురిలపై**
**గుడియెడమలు లేకముందు గువ్వలచెన్నా!**

పిల్లలు విలాసాలకు మరిగితే, కుడి ఎడమల తేడా లేకుండా చెడిపోతారని హెచ్చరిస్తాడు. ఇది మూడు వందల ఏళ్ల కింద రాసిన పద్యమైనా సమకాలీనతను కలిగిందే.

***గోంగూరకు వెల్లుల్లి తాలింపు***
**అంగీలు పచ్చడంబులు**
**సంగతిఁగొను శాలుజోడు సరిగంచుల మేల్**
**రంగగు దుప్పటులన్నియు**
**గొంగళి సరిపోలవన్న గువ్వలచెన్నా!**

ఈ పద్యంలో నాటి వస్త్రధారణ తెలుస్తుంది. అంగీలు, పచ్చడాలు, శాలువాలు, మంచి అంచుగల రంగురంగుల దుప్పట్లు ఎన్ని ఉన్నా, అవి గొంగడిని సరిపోలవు. ఇక 'వెల్లుల్లి బెట్టి పొగచిన...' పద్యంలో గోంగూర పచ్చడి ఎలా తినాలో చెబుతాడు. వెల్లుల్లి వేసి పోపుపెట్టిన పుల్లని గోంగూర రుచిని ఏమని పొగడుతాం. దాన్ని కొంచెం ఎక్కువగా నూనె వేసుకుని తృప్తిగా ఆరగించాల్సిందే. అంతేనా...

**కంగా బుంగా కొట్టిన**
**పొంగిడ మిరియాల నేతి మొదటి పిడుచతో**
**మ్రింగిన నాకలి నడచుట**
**కుంగల నజ్జును హరించు గువ్వలచెన్నా!**

పొంగిన మిరియాలను కొట్టి కంగావింగా నేతిలో కలిపి ఒక్క ముద్ద అన్నం తింటే, ఆకలిమాంద్యంతో వచ్చే నంజు మాయమవుతుందంటూ ఓ చిట్కానూ చెప్పాడు. ఇవే కాక డబ్బును గురించి, బంధువులను గురించి, వివిధ వృత్తులవారి మనస్తత్వాన్ని గురించీ ఇందులో పద్యాలు ఉన్నాయి.

ఈ శతక కర్తృత్వాన్ని గురించి పలువురు పలురకాలుగా పేర్కొన్నారు. దీనిని గువ్వలచెన్నుడే రాశాడని కొందరు అంటే, సురవరం ప్రతాపరెడ్డి దీని కాలాన్ని 1700 నాటిదిగా పేర్కొన్నారు. అయితే రచయిత ఎవరనేది తెలపలేదు. 'తెలుగు చాటువులు- పుట్టుపూర్వోత్తరాలు' గ్రంథకర్త బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు గువ్వలచెన్న శతకం రాసింది పట్టాభి రామకవి అనీ, ఆయన నరసరావుపేట మల్రాజు సంస్థాన ఆస్థాన కవి అనీ పేర్కొన్నారు. ఈ పట్టాభిరామకవి కర్తృత్వంపైనా అనుమానాలు ఉన్నాయి. ఏదేమైనా...

**గుడికూలును నుయిపూడును**
**వడి నీళ్లంజెఱువు తెగును వనమును ఖిలమౌ**
**చెడనిది పద్యంబొక్కటి**
**కుడిఎడమల చూడకన్న గువ్వలచెన్నా!**

గుడి కూలుతుంది, బావి పూడిపోతుంది, నీటివేగానికి చెరువు తెగొచ్చు, కాల గమనంలో అడవి నాశనం కావచ్చు, కానీ పద్యం శాశ్వతంగా నిలిచి ఉంటుంది. చెడనిది పద్యం మాత్రమే, కుడి ఎడమల చూడకు అన్నట్లే పద్యాలు మాత్రం నేటికీ నిలిచి ఉన్నాయి.




**కట్టా నరసింహులు,**
కడప. 94413 37542




## మరో విత్తు

కాంక్రీట్ జంగిల్ అవతల
అప్పుడెప్పుడో నేనే బ్రహ్మనై
నీకు జీవం పోశాను
నువ్విప్పుడు నాకే అందనంత
ఉన్నతంగా ఎదిగావు
ప్రేమపక్షులకు ప్రేమావాసమై
వలస పక్షులకు స్థిరనివాసమైనావు!
నాడు నీ ఆకలి తీర్చమని నా వంక
బేలగా చూసిన నువ్వు నేడు
పూటగడవని వాడి ఆకలి
తీరుస్తున్నావు!
భాస్కరుడి తీక్షణ వీక్షణాలు
మనిషిని నిలువునా దహించివేస్తుంటే
ఆ తాపాన్ని
చల్లార్చే లేపనమవుతున్నావు!
విషవాయువులను నువ్వు పీల్చి
మా ప్రాణాలు నిలబెడుతూ
ఆ గరళకంఠుని తలపిస్తున్నావు
గ్యాస్ గుదిబండ మోయలేని
పేదవాడికి ఇంధనం అవుతున్నావు
నగరీకరణం పేరుతో నీ ఊపిరి
తీయాలని ప్రయత్నిస్తున్నా
మౌనంగా భరిస్తున్నావు!
పదునైన గొడ్డలి దెబ్బకు నీ దేహం
ఛిద్రమై నువ్వు కార్చే కన్నీళ్లే
సంద్రంగా మారి మా పాపాల
ఒత్తిడికి
అది సునామీ కెరటంలా ఈ లోకాన్ని
ముంచెత్తక ముందే నేను ఏదో ఒకటి
చేయాలి? ఏం చేయగలను?
మరో విత్తు నాటడం తప్ప!


**వేంకటరమణ వెలపర్తి,**
హైదరాబాదు, 96429 09370



# ఇలా తయారవ్వండి

**5, 5, 9, 12, 36, 55**... ఇవి గత కొన్నేళ్లలో అఖిల భారత సర్వీసుల తుది ఎంపికలో తెలుగు సాహిత్యం ఐచ్ఛికంగా కలిగినవాళ్ల ర్యాంకులు. వీటిలో తెలుగు సాహిత్యమే కాదు, పరీక్షలన్నీ తెలుగు మాధ్యమంలో రాసినవాళ్లూ ఉన్నారు. ఈ ఏడాది సివిల్స్ ప్రధాన పరీక్షలు డిసెంబరు 14 నుంచి ప్రారంభమవుతున్నాయి. తెలుగు సాహిత్యం ఐచ్ఛికంగా రాసేవాళ్లు పరీక్ష దృష్ట్యా ఎలా అధ్యయనం చేయాలో, ఈ 45 రోజుల కాలాన్ని అధ్యయనానికి ఎలా వాడుకోవచ్చో చూద్దాం.

తెలుగు మాధ్యమంలో చదువుకున్నవాళ్లు సివిల్ సర్వీసుల్లో ప్రవేశించి, పౌరసేవ చేసే అవకాశాన్ని చేజిక్కించుకోవడానికి... ప్రధాన పరీక్షకు ఐచ్ఛికంగా ఎంచుకునేది తెలుగు సాహిత్యాన్నే. అమ్మభాషపై పట్టుంటే కొన్ని రోజుల అధ్యయనంతోనే గరిష్ఠ మార్కులను తెచ్చిపెట్టే సాధనం ఇది. గతేడాది మెయిన్స్ పరీక్షా విధానం మార్పుకముందు కొంచెం కష్టపడి, తెలివిగా చదివినవాళ్లకు 600లకు 350- 400 మార్కుల దాకా వచ్చేవి.

జనరల్ స్టడీస్‌లో మార్కులు ఇతర అభ్యర్థులతో సమానంగా వచ్చే అవకాశం ఎక్కువ. అలాంటప్పుడు మౌఖిక పరీక్షకు వెళ్లడానికి మార్గం సుగమం చేయడంలోనూ... అన్ని గీటురాళ్లకు ఎదురునిలిచి అంతిమ విజేతగా అవతరించడంలోనూ... ఐచ్ఛికాంశాల్లో వచ్చే మార్కులదే కీలకపాత్ర.



ఇప్పుడు పరీక్ష 500 మార్కులకు నిర్వహిస్తున్నారు. మెయిన్సులో గరిష్ఠంగా మార్కులు పొందడానికి సిలబస్‌ను రోజూ రెండు పేపర్లకు కాలాన్ని విభజించుకుని అధ్యయనం చేయాలి. అందుబాటులో ఉన్న సమయంలోనే చదవడంతో పాటు ముఖ్యాంశాలు రాసుకోవాలి.

**మార్కుల యంత్రం**

**మొదటి పేపర్**

ఇందులో భాషా సాహిత్య చరిత్రలు ఉంటాయి. వీటి అధ్యయనానికి రోజుకు మూడు నుంచి నాలుగు గంటలు కేటాయించాలి. మారిన విధానంలో ప్రశ్నల సంఖ్య తగ్గలేదు. కానీ, ఒక ప్రశ్నను రెండు ఉపప్రశ్నలుగా అడుగుతున్నారు. అంటే రాయాల్సిన జవాబుల సంఖ్య పెరిగింది. గతంలో ఒకటి రెండు అంశాలు వదిలేసి చదువుకున్నా ఇబ్బంది లేకపోయేది. ఇప్పుడలా కాదు. అన్నీ చదవాల్సిందే. **ఆంధ్రము, తెనుగు, తెలుగు** అంశాన్నే తీసుకుంటే చదివేందుకు రెండు గంటలు పడుతుంది. చదువుతున్నప్పుడే జాతివాచకంగా, దేశవాచకంగా, భాషావాచకంగా ఆంధ్ర పదప్రయోగం, దక్షిణ దిగ్వాచిగా ప్రయోగించిన తెనుగు న- ల (మునగ/ ములగ, లేదు/ నేదు)ల వినిమయంతో తెలుగు, తెనుగు అనే రెండు రూపాలుగా వాడుకలో ఉన్న విషయాన్ని క్లుప్తంగా రాసుకోవాలి. మిగిలిన అంశాలన్నీ ఒకటి రెండు గంటల్లో చదువుకొని, స్పష్టత తెచ్చుకోదగ్గవే. కొన్నిసార్లు ప్రశ్నలు సిలబస్‌లో లేనివేమో అనిపించినా, అవి మన గమనింపులోనివే అయి ఉంటాయి. 2009లో భారతదేశ భాషల గురించి ప్రశ్న అడిగారు. సిలబస్‌లో ద్రావిడ భాషల్లో తెలుగు స్థానం అని ఉంటుంది. మనం చదివేప్పుడు అసలు భాష అంటే ఏంటి? ప్రపంచంలో భాషలెన్ని? ఎలా ఏర్పడ్డాయి? భాషా కుటుంబాలెన్ని? ప్రత్యేకించి మనదేశంలో వ్యవహారంలో ఉన్న- హిందార్య, ద్రావిడ, టిబెటోబర్మన్, ఆస్ట్రో ఏషియాటిక్ కుటుంబాల గురించి తెలుసుకోవాలి. సిలబస్‌కు సంబంధించినవి కొంత ఎక్కువ తెలుసుకుంటే జవాబులు ప్రభావవంతంగా రాయొచ్చు. మాండలికాలు, అనువాదం, వాక్యం, అర్థవిపరిణామం, ధ్వని విపరిణామం, తెలుగు మీద ఇతర భాషల ప్రభావం... ఇలా ప్రతీ పాఠాన్ని రెండు మూడు గంటల్లో చదివేలా ప్రణాళిక రాసుకోవాలి. గరిష్ఠంగా అయిదు గంటలు కేటాయించుకోవాలి. ఇలా చేస్తే ఓ పదిహేను రోజుల్లోనే ఒకభాగం అయిపోతుంది.

**ఒకటో పేపర్ రెండోభాగం+ పాఠ్యపుస్తకాలు**

మొదటి పేపర్ రెండో విభాగంలో ప్రశ్నలు ప్రాఙ్నన్నయ యుగం మొదలుకొని, నన్నయ, తిక్కన మొదలు వివిధ కవుల రచనా రీతుల మీద అడుగుతారు. అందుకని ప్రతీ కవి గురించి చదువుకోవాలి. దీనిని చదువుతూనే రెండో పేపర్లో ఉన్న ఆయా కవుల పాఠ్యాంశాలనూ అధ్యయనం చేయాలి. నన్నయతోపాటే 'దుష్యంత చరిత్ర'ను చదవాలి. వీటిని చదివేప్పుడు మొదలు పాఠ్యాంశంలోని పద్యాలు, తాత్పర్యాలు, విశేషాంశాలు క్షుణ్ణంగా

## నమూనా మైండ్‌మ్యాప్




చదవాలి. వేటినీ వదలకూడదు. ఆ తర్వాత పాత ప్రశ్నపత్రాలను తీసుకొని ఏ పద్యాలు వ్యాఖ్యానాలకు ఇస్తున్నారో, ఏ కోణంలో అడుగుతున్నారో గమనించాలి. మొత్తానికి ప్రతీ పాఠంలోనూ ఓ పదిహేను- ఇరవై పద్యాల్ని కళాసౌందర్య, సామాజిక చారిత్రక, పాత్రల మనస్తత్వం, కవి మనస్తత్వం, ఆలంకారిక దృక్పథాల్లో ఎలా వ్యాఖ్యానించవచ్చో తెలుసుకోవాలి. పాఠం మొత్తం చదివి ఉంటాం కనుక ప్రశ్నల్లోనూ ఉపయోగకరంగా ఉంటుంది.

శ్రీనాథుడి గురించి చదివేప్పుడు- ఆయన కాలం, రెడ్డి రాజుల కాలపు విశేషాలు- శృంగార నైషధం, హరవిలాసం, భీమఖండం, కాశీఖండం కృతుల సమీక్ష- నైషధం ఆంధ్రీకరణ విధానం- శ్రీనాథుడి రచనాశైలి లాంటి అంశాలపై దృష్టిపెట్టాలి. దీనితోపాటే 'గుణనిధి కథ'ను చదువుకుంటే శ్రీనాథుడిమీద స్పష్టమైన అవగాహన వస్తుంది. గుణనిధి కథ చదివి అర్థం చేసుకునేందుకు రెండు గంటలకు మించి పట్టదు. మొదట అన్ని పద్యాలూ చదవాలి. తర్వాత సీసపద్యాలు, ముఖ్యమైన ఇతర పద్యాలు- ఓ నాలుగైదు ఉంటాయి- చదివితే సరి. ప్రబంధయుగం గురించి చదివేప్పుడు 'కళాపూర్ణోదయం', శతకాల గురించి చదువుతూ 'ఆంధ్రనాయక శతకం' ఇలా సాగాలి అధ్యయనం.

గత ఏడాది **చేమకూర వేంకటకవి ప్రతిపద్య రచనా చమత్కారం** పశ్న ఇచ్చారు. దీనికి జవాబును **'ప్రతిపద్యమునందు చమత్కృతి గలుగం జెప్పనేర్తువు... ఇలలో నీ మార్గమెవరికిన్ రాదు సుమీ'** అని రఘునాథుడు చేమకూరను ప్రశంసించిన పద్యాన్ని ఎత్తుగడగా తీసుకొని ప్రారంభించాలి. తర్వాత చేమకూర పరిచయాన్ని రాసి, కొన్ని ముఖ్యమైన పద్యాల్లో ఆయన యమకాలంకారాన్ని (**అమ్మకచెల్ల** నా హృదయ**మమ్మక చెల్లదు; నెన్నుదురు నెన్నుదురు; బల్కుదురు బల్కుదురు** లాంటివి), శ్లేషల్ని ప్రయోగించిన తీరును వివరించి ముగించాలి. వీటితోపాటు పదకవులు, కవయిత్రులు, శైవ, భక్తి, జాతీయోద్యమ కవిత్వం, భావ, అభ్యుదయ, విప్లవ, స్త్రీవాద, దళితవాద కవిత్వాలు, జానపద సాహిత్యం- తోలుబొమ్మలు, తప్పెటగుళ్లు, బుర్రకథ, కోలాటం, ఒగ్గుకథ లాంటి జానపద కళలను గురించి అధ్యయనం చేయాలి.

ఇలాగే గురజాడ, శ్రీశ్రీ, కృష్ణశాస్త్రి, జాషువా మొదలైనవారిని గురించి చదువుతూ రెండోభాగంలో ఉన్న పాఠ్యపుస్తకాలను క్షుణ్నంగా చదవాలి. అలా చదివినప్పుడే మొదటి పేపర్లో అడిగే ప్రశ్నలకూ, రెండో పేపర్లో అడిగే వ్యాఖ్యానాలు, ప్రశ్నలకు సమాధానాలు రాయగలుగుతాం. సమాధానాలు రాసేప్పుడు ఒక్కో ప్రశ్నకు- ఉపప్రశ్నల్ని కలుపుకొని అయిదు, ఆరు పేజీలకు మించకుండా చూసుకోవాలి. రాత చదివేందుకు అనువుగా ఉండాలి. అప్పుడే అనుకున్నన్ని మార్కులు తెచ్చుకోగలం. అధ్యయనంలో తెలుగు విశ్వవిద్యాలయం 'తెలుగు భాషాచరిత్ర', వెలమల సిమ్మన్న 'తెలుగు భాషాచరిత్ర', జి.నాగయ్య 'తెలుగు సాహిత్య సమీక్ష', ద్వానా శాస్త్రి 'తెలుగు సాహిత్య చరిత్ర', ముదిగంటి సుజాతారెడ్డి 'ఆంధ్రుల సంస్కృతి సాహిత్య చరిత్ర', తెలుగులో కవిత్వోద్యమాలు (ఇవి రెండూ తెలుగు అకాడమీ ప్రచురణలు) లాంటి పుస్తకాలు బాగా ఉపకరిస్తాయి. పరీక్షకు సమయం 45- 50 రోజులే కనుక ఇప్పటికే బాగా చదివిన పుస్తకాన్నే క్షుణ్నంగా చదువుకోవాలి. దానిలో లేని అంశాల్ని చదివేందుకు మాత్రమే ఇతర పుస్తకాలను సంప్రదించాలి. మరో ముఖ్యమైన విషయం... ప్రతీ అంశాన్ని సమగ్రంగా వీలైనంత వేగంగా చదవాలి. వీటిని ముఖ్యాంశాలు/ ఫ్లోఛార్టులు/ మైండ్‌మ్యాప్‌ల రూపంలో నోట్సు రాసుకుంటే మరిచిపోకుండా ఉంటాం. పైగా పునశ్చరణ సులభం.

**- హర్ష**, హైదరాబాదు

# ప్రత్యామ్నాయంగా ప్రవహించిన బతుకు కలం

**బింబం రెటీనా మీద తలకిందులైతేనే గదా
వాస్తవం వాస్తవంగా గుండెల్లో అచ్చయ్యేది
ధర్మం చరిత్ర మీద విలోమమైనప్పుడే గదా
నేల నాలుగు విషాద గాథల్ని పాడగలిగేది!**

విషాదంలోంచి ఉత్పన్నమయ్యే సృజనకి కొనసాగింపు ఉంటుంది. తెరేష్ ఈ సమాజపు మూలాల్లో ఉన్న తల్లి వేరుని సవరించాలని చూశాడు. ఆ పని సంపూర్ణం కాలేదు. అందుకే ఎక్కడ ఉన్నా తిరిగి ప్రత్యక్షమవుతాడు.

**తెరేష్** ప్రయోగవాది. సాహసి. జీవించి మరణించాడు. మరణించి జీవితం వెలుగులను చూపిస్తున్నాడు. కలలు కనీ కనీ వాటిని సఫలం చేయలేక, ఆ బరువుని మోయలేక అభిమానాన్ని, అవమానాలని కఫన్‌లా కప్పుకుని తీరందాటాడు. బహుజన విముక్తి అతని కల. అందుకోసం సృజన స్వేచ్ఛలో తడిసి నేలని ముద్దాడాలని నిరంతర తపన. ఆ నేలనే చివరి స్థావరంగా చేసుకున్నాడు. తననితాను ఒక బీజంగా మలుచుకున్నాడు.

అతడి సంతకాలు, అక్షరాలు, పాడిన కవాతు గీతాలు అన్నీ పాఠకుల అమ్ముల పొదిలో దాచిపోయాడు. భార్య తాహిరా, కొడుకు ప్రణయ్‌చంద్ర, కూతురు సాయిరీతికలను వదిలి 'నిశానీ'లను, హిందూ మహాసముద్రాలని మనకోసం కానుకగా వదిలిపోయాడు. నిత్యం గగుర్పాటుతో, వ్యథతో, సంఘర్షణతో, ఆర్థిక సమస్యలతో పోరాడుతూ ఆత్మగతాలలో కన్నీళ్ల మధ్య అతని దివారాత్ర చర్యని భరించలేక అతడిని ఆవహించిన 'కళ' విముక్తి కోరింది. విధిలేక జాలి గుండెతో సరేనన్నాడు.

జిల్లా ప్రకాశం. ఊరు ఒంగోలు. దాని పరిసర ప్రాంతమైన గద్దలకుంటలో నవంబరు 3, 1963లో జననం. తండ్రి వరదయ్య, తల్లి సుబ్బులమ్మల గారాబాల ముద్దుబిడ్డడు. మొదటిసారి ఖమ్మం జిల్లా కొత్తగూడెంలోని ఆలిండియా రేడియోలో వ్యాఖ్యాతగా చేరాడు. ఇరవై ఏళ్ల నుంచి హైదరాబాదు ఆకాశవాణిలో ఉద్యోగం. అలా తెలంగాణకి తనని తాను అక్షరాలా దత్తు ఇచ్చుకున్నాడు.

లక్షలాది మంది మనుషులలో ఒక్కడు మాత్రమే ఒక సంకేతం కాగలడు. తెరేష్ ఇప్పుడు కావడి బద్దకి సంకేతం అయ్యాడు. సాహిత్యం-కళ; వచనం, గజల్; రాత, దృశ్యం; సవర్ణం, అవర్ణం; బతుకు, మరణం వీటి మధ్య ఒక సూత్రం ఉండాలి. రెండు విరుద్ధ సమభారాలని మోయడానికి తెగువ కావాలి. స్పష్టమైన తాత్విక చింతన కావాలి. మొదట మనిషితనం పునాది కావాలి. విముక్త రాజకీయ సమగ్రతత్వం తెలియాలి. దానిని మరింత పరిపుష్టం చేయగలిగిన చేవ కలిగినవాడు తెరేష్.

**కవిత్వ శరాలు**

నిశానీ (ఇతరులతో కలిసి) (1996), అల్పపీడనం (1990), హిందూ మహాసముద్రం మొదటి ఆడియో కేసెట్ (1996), ఆ తరువాత పుస్తక రూపం (2010), నేనూ నా వింతలమారి ప్రపంచమూ... (2009), నాలుగో ప్రపంచం (2010), కావడికుండలు, (సంపాదకుడు, 2009), వంటి కవితా సంపుటాలు తెరేష్‌బాబు ప్రతిభకి అద్దం పడతాయి. అవి కలాన్ని చీల్చుకుని వెలువడిన కవిత్వ శరాలు. సీరియస్ వచన కవిత్వానికి వ్యంగ్య, అధిక్షేపాలను జోడించి... తను చెప్పే విషయాన్ని పాఠకుల గుండెలకూ, మెదళ్లకూ ఏకకాలంలో తగిలేలా చేసిన వర్తమాన సామాజిక కవి.

కవిత్వాక్షరాలతో సాధించలేని దాన్ని దృశ్యాలతో సాధించడానికి ప్రయత్నం చేశాడు. 'నేను నా వింతలమారి ప్రపంచమూ...' అనే పుస్తకంలో 'దృశ్యమాధ్యమాల పట్ల కాస్తంత దృష్టి సారించండి. మెజారిటీ జాతి జనులు అక్కడ పోగుబడి ఉన్నారు. వాళ్లలో డెబ్భైశాతం మందికి చదవటం, రాయడం రాదు. చెప్తే వింటారు. చూపిస్తే చూస్తారు. ఆలోచిస్తారు. కదులుతారు. కదిలిస్తారు' అని నిస్సంకోచంగా ప్రకటించాడు. అందుకే విధి, సంఘర్షణ వంటి టీవీ సీరియళ్లు తీశాడు.

తొలిదశ దళిత కవిత్వంలో తమనితాము కవులు వెదుక్కున్నారు. తమ అస్తిత్వ వేదనని బలంగా వ్యక్తం చేశారు. కానీ మలిదశలో కవులు జాతీయ అంతర్జాతీయ పరిస్థితులను అవగాహన చేసుకుని తమ దృక్కోణంలోంచి వాటిని చూశారు. ప్రపంచీకరణ వల్ల దళితులకు ఏదో ఒరుగుతుందనే భ్రమ నుంచి తెరేష్ బయటపడి ఇలా అంటున్నాడు-

**కులస్వామ్యపు నేరాలకు**
**ఛార్జిషీట్లుండవు**
**విసురుగా గాల్లోకి ఎగిసే**
**నల్లగొంతులకు అర్థం కాదు**
**దుష్ట సంహారం సాగించాలో**
**నష్టపరిహారాలకు దేబిరించాలో**
**కులం వేళ్లను బేఖాతర్ చేసి పేదరికాన్ని**
**నరకనన్నాళ్లూ**
**పంపిణీ పథకాలు బిచ్చగాళ్లనే ఉత్పత్తి చేస్తాయి**
**దొంగాటకం రంజుగా సాగిపోతూ ఉంది**
**కావచ్చు**
**అభివృద్ధి పథకాల ముసుగులోని అణిచివేతల్ని**
**కనిపెడుతూ ఉంది. ఇది నాలుగో ప్రపంచం**

ఆర్థిక సాయం, పథకాలు, కోటాలు అన్నీ దళితులను యథాస్థానంలోనే ఉంచుతాయి. ఈ విషయం దళిత సోదరులు అర్థం చేసుకోవాలి. ప్రభుత్వాల 'కులం' గుర్తింపు వల్ల జరిగే అన్యాయం, దోపిడీలను గుర్తించాలి. ప్రజలు కూడా అర్థం చేసుకోవాలని అంటాడు. అభివృద్ధి చెందే దేశాలను మూడో ప్రపంచ దేశాలు అని అంటారు. కానీ దళితులు, ఆదివాసులు, మూలవాసుల ప్రపంచాన్ని నాలుగో ప్రపంచంగా తను భావిస్తాడు.

'హిందూ మహాసముద్రా'న్ని హైందవ అణచివేతకు సంకేతం చేసి ఒక కావ్యం రాశాడు. పెద్ద పెద్ద కవులు ఏం రాయాలా అని ఆలోచిస్తున్న సమయంలో స్వీయ అనుభవాలను సామాజీకరించి శక్తిమంతమైన కవిత్వాన్ని రాశాడు. ఈ కావ్యాన్ని మొదట సీడీగా తీశాడు. వచన కవితా కావ్యం శబ్దంగా శ్రోతల మన్ననలను పొందింది. ఆ తరువాత పాఠకులకు పుస్తక రూపంలో అందింది. ఈ కావ్యానికి ముగింపుగా...

**ఇన్నాళ్లూ పోగొట్టుకున్న ప్రవాహాలు చాలు**
**ఇన్నాళ్లూ కోల్పోయిన ఆత్మగౌరవాలు చాలు**
**ఇన్నాళ్లూ ధారపోసిన జవసత్వాలు చాలు**
**ఇక ఏ నదీ సముద్రం వేపు కన్నెత్తి**
**చూడనక్కరలేదు**

**తెగిపడ్డ కెరటాల్ని కుట్టుకుంటూపోదాం**
**అదే ఏరౌతుంది**
**ఎవరు ముట్టుకుంటే**
**నేల చేనై కంచంలోకి ప్రవహిస్తుందో**
**వేరే చెప్పాలా?**
**ఏ నాగేటితోనో ఏకీకరణ కుదిరినప్పుడే**
**నేల చేనౌతుందనీ మళ్లీ చెప్పాలా?**
**చెమటచుక్కకూ చెమటచుక్కకూ**
**అలయెన్స్ కుదరాలి**
**లేకుంటే చెమటచుక్క నది ఎట్లా అవుతుంది**
**పదండి ప్రవహిద్దాం**
**ఎక్కడికి ప్రయాణం అంటే ఏమని చెప్పను**
**చావు నుంచి బతుకుదాక - అబద్ధం నుంచి**
**నిజందాక**
**చెలియలికట్ట నుంచి చేను మలుపు దాక**
**మాయలఫకీర్ వెంట కుక్కలా నడిచే చరిత్ర**
**మనకక్కరలేదు**
**నలుగురూ ఏమనుకుంటున్నా ఇహ**
**అయిదోమాటే అసల్దీ ఆఖరిదీ**
**పదండి పదండి**
**ప్రత్యామ్నాయంగా ప్రవహిద్దాం**

అంటూ ఒక మార్గాన్ని చూపి ముగించాడు. తెరేష్ కవిత్వానికి 'ఆధునికత'ని ఆధునిక బాషని అందించడంలో సఫలమయ్యాడు.

'నేనూ నా వింతలమారి ప్రపంచమూ...' తెరేష్ సామాజిక ప్రతిస్పందనా కావ్యం. ఇందులో వ్యవసాయరంగం, పేదరికం, బానిస విద్యావ్యవస్థ, వస్తు నిలవశాల, నయా సామ్రాజ్యవాదం, పరాయీకరణ, ఏడోవింత అని ఏడు కవితలు రాశాడు. ఈ కవితల్లో జాతీయ, సామ్రాజ్యవాద పోకడల్ని ఎండగట్టాడు.

**మీరు మీ ప్రపంచాన్ని తూర్పారబట్టి**
**ఏడు వింతల్ని గుర్తిస్తారు**
**నేను మీ వింతల్ని జల్లెడపట్టి**
**నా ప్రపంచాన్ని గుర్తిస్తాను**

అని ఏడు వింతల బండారాన్ని బట్టబయలు చేశాడు.

**నువ్వు దేవుడు పంపిన దూతవు**
**నిన్నామాత్రం గుర్తించలేనా!**
**నన్ను శకలాలుగా**
**విడగొట్టి శతాబ్దాలౌతోంది**
**నేను ఏ ముక్కలో బతికున్నానో**
**నాకే తెలీదు స్థాణుత్వం నుంచి స్థాణుత్వందాక**
**జరిపే నిశ్చలయాత్రలో**
**పచ్చని మజిలీవి నువ్వు**
**'భవతీ భిక్షాందేహీ'**
**ఈ సప్తాక్షరీ మంత్రంలోనేకదా**
**నా ప్రపంచాన్ని బిగించి ఉంచావు**
**దేబిరింపును మాత్రమేకదా**
**నా హక్కుగా అభివర్ణిస్తుంటావు**

అని శతాబ్దాలుగా అంటరాని వారిని, అట్టడుగు ప్రజలని ఎలా మోసం చేసి అణగదొక్కారో అక్షరీకరించాడు. బాధితులు ఎవరైనా వారికి మద్దతు పలకడమే అక్షరం బాధ్యత. ఈ బాధ్యతలో తెరేష్ ఎప్పుడూ ముందే ఉన్నాడు. సకల జన సమ్మతంగా జరిగిన ప్రత్యేక రాష్ట్ర ఉద్యమకాలంలో చాలా కవితలు రాశాడు. అందులో 'కుండల్లా విడిపోదాం/ కావడి బద్దలా కలిసి ఉందాం' అంటూ చెప్పిన 'కావడికుండలు' కవిత రెండు ప్రాంతాల్లోనూ చాలా ప్రచారం పొందింది. డా. అంబేద్కర్ చిన్న రాష్ట్రాల అవగాహనని తెరేష్ కవిత్వీకరించాడు.

తెరేష్ బహుముఖీన ప్రతిభాశాలి. ఆధునికుల్లో అత్యంత ఆధునికుడు. తెలుగులో తెరేష్ అతినవీన కవి. పద్య పఠనం, గజళ్లు పాడటంలో దిట్ట. సంగీత వాద్యాల వాదనలో కూడా చేయి తిరిగిన కళాకారుడు.

మనిషిని బలహీనపరిచే అన్ని విలువలనూ ప్రశ్నించడం నేర్పిన తెరేష్ తాను బలహీనపడటం విషాదం. దానివల్ల తెలుగు కళాసాహిత్య రంగాలు కూడా బలహీనపడినట్లే. ఇప్పుడు తెరేష్ అనంతర తెలుగు కవిత్వం మరింత బలపడాలి. అందుకు అతని రచనల బాటని అందుకోవాలి. అదే అతనికిచ్చే నివాళి.



**ఆచార్య జయధీర్ తిరుమలరావు,**
కవి, పరిశోధకుడు, హైదరాబాదు.
99519 42242

# అక్షరనాదం

మాతృభాష రుణం తీర్చుకోవాలనుకున్న తపన తొంభై ఏళ్ల వయోవృద్ధురాలిని కార్యకారిగా మార్చింది. విద్యాధికురాలు కాకపోయినా, చదివింది ఐదో తరగతైనా అమ్మభాషపై ప్రేమతో ఆమె అక్షరనాదం చేసింది. ఆ నాదం నేడు 'శ్రీకృష్ణుని చద్దులు' రూపంలో తెలుగు అభిమానులను అలరిస్తోంది. తెలుగుభాష అంతరించిపోతుందన్న మాటతో కలత చెందిన ఆమె అమ్మభాష కమ్మదనాన్ని అందరికీ తెలపాలని సంకల్పించింది. అమ్మభాషపై ప్రేమతో అక్షరభేరి మోగించింది. నాటి పద్యాల పదనిసలను నేటి తరానికి అందించాలని తపించిన వృద్ధురాలి పేరు టంగుటూరి అనసూయమ్మ. ఈమె ప్రస్తుతం ఒంగోలులో నివసిస్తున్నారు. బామ్మ స్వగ్రామం ప్రకాశం జిల్లా కందుకూరు. ఎప్పుడో 1930నాటి కాలంలో తన తల్లి చెప్పిన 'చద్దులు' ఆమె మదిలో పదిలంగా నిక్షిప్తమయ్యాయి. వాటిని రచించింది ఎవరోకూడా ఆమెకు తెలియదు. అవి తనతోనే అంతరించపోకూడదన్న ఉద్దేశంతో అక్షరాకృతికి శ్రీకారం చుట్టింది. అమ్మ పలుకులనే అక్షరాలుగా మార్చి 'శ్రీకృష్ణుని చద్దులు' పద్యాల పుస్తకాన్ని ప్రచురించింది.



వంశీధరుని బాల్యానికి సంబంధించినవే 'శ్రీకృష్ణుని చద్దులు'. రేపల్లెలో గొల్లబాలలతో కలసి చిన్నికృష్ణుడు ప్రతిరోజూ తెల్లవారుతుండగానే గోవులను కాసేందుకు వెళ్లేవాడు. వీళ్లంతా మళ్లీ గోధూళివేళకు ఇంటికి తరలి వచ్చేవాళ్లు. అడవిలో ఆకలేస్తే తినడానికి చద్దన్నం మూట కట్టి యశోదమ్మ గోపాలకృష్ణునికి ఇచ్చి పంపేది. శ్రీకృష్ణ బలరాములు, గోపబాలురందరూ ఇదే రీతిలో చద్దులతో గోవుల వెంట అడవులకు వెళ్లేవారు. అక్కడ వారి భావనలే శ్రీకృష్ణుని చద్దులు. అడవిలో గోపబాలురతో చద్ది స్వీకరించిన తర్వాత కృష్ణుని ఆలాపన, బాలల ఆనందోత్సాహాలు ఇందులో స్పష్టీకరించారు. దీనిలో పద్యాలు అంతర్లీనంగా కృష్ణుని గొప్పతనాన్ని తెలిపేలా, పాడుకునేందుకు వీలుగా ఉండటం మరో విశేషం.

**త్రైలోక్య వల్లభుడూ। తనతల్లితో అనెనె ఇట్లూ**
**గోవూల గాయాపోవలె। చాలా పొద్దాయెనమ్మా**

త్రిలోకాల సమాహారాన్ని త్రైలోక్యం అంటారు. త్రైలోక్య వల్లభుడు అంటే ముల్లోకాలకు అధిపతి అని అర్థం. సమస్త విశ్వాన్ని తన నోటిలో చూపిన చిన్నికృష్ణుడు తన తల్లి యశోదతో ఇలా అన్నాడట 'అమ్మా ఆవులను మేపేందుకు అడవికి వెళ్లాలి. చాలా పొద్దుపోయింది. ఇప్పటికే చాలా ఆలస్యమైంది' అన్నాడట.

**ఒప్పేటి। అందంబులనూ। ఒంటూంటిరక్షలు తొడగి।**
**నందూడి సుతుడూవెడలీ మందల్లా నడుమానిలచే**

ఆ రోజుల్లో చిన్నారులకు ఒళ్లంతా సువాసన వెదజల్లేందుకు కస్తూరి పట్టించేవారు. కృష్ణుని శిరోజాలను యశోదమ్మ ముడిగా చుట్టేది దీన్ని వళం అంటారు. అనంతరం నెత్తిన నెమలిపింఛం పెట్టేది.

పిల్లల రక్షణకు వారు బయటకు వెళ్లేప్పుడు మంత్రించిన విభూతి పెట్టేవాళ్లు. లేదా తాయెత్తు కట్టేవారు. అలా నందుని కుమారుడైన గోపీకృష్ణుడు పట్టువస్త్రాలు ధరించి ఆవుల మందల నడుమ గోపబాలలతో తరలి వెళ్లేవాడు.

**చిక్కమ్మున చద్దీదించి। చొక్కమ్ము వెండీ**

**వలెను । అగ్రజాలలు అయినా ముద్దలు అందందివేసువారలకు ।**

గోపబాలురు ఒక కర్రకు చద్దిమూట తగిలించి భుజాన వేసుకునేవారు దీన్నే చిక్కం అంటారు. చొక్కమ్ము వెండీ అంటే స్వచ్ఛమైన వెండి అని అర్థం. పెద్దవారిని అగ్రజాలలు అనేవారు. గోవులను మేపేందుకు అడవులకు తీసుకువెళ్లేవారిలో పెద్దవారు కూడా ఉండేవారు. వీరు చిక్కానికి తగిలించి స్వచ్ఛమైన వెండిలా ఉన్న చద్దిని దించి అక్కడక్కడ తినేవారట.

**పచ్చాయపోకలతోనూ,**
**పండూతెలనాకులతోనూ।**
**పచ్చాకర్పూరపు వీడెము,**
**పరమాత్ముడారాగించె।**

పచ్చి లేక ఎండిన వక్కలని పోకలని పిలిచేవారు. పసుపు పచ్చని రంగులో ఉండే లేలేత తమలపాకులను తెలనాకులు అని పిలిచేవారు. తెల్లని ఆకులే తెలనాకులు. లేలేత తమలపాకుల్లో వక్కలు తదితరాలను వేసుకుని ఆ సర్వాంతర్యామి తాంబూలాన్ని ఆరగించేవాడట.

**కల్పావృక్షమ్ముల । ఘనచందువ ।**
**మళ్లీచూచెను ।**
**కమలనాభుడు, వేణువు పట్టెను, కాంతల్ల**
**చిత్తామలర ।**

కోరిన కోరికలు తీర్చే వృక్షాన్ని కల్పతరువు లేదా కల్పవృక్షం అంటారు. నాభియందు కమలం ఉన్న విష్ణుమూర్తిని కమలనాభుడు అంటారు. కల్పతరువులాంటి వృక్షసమూహంలో కమలనాభుడైన మురళీకృష్ణుడు వేణుగానం చేసేవాడట. ఆ వంశీకృష్ణుని వేణుగానానికి గోపికలు మైమరిచేవారట.

**గోపికాలూకూసెటిమోతా,**
**గోవుల్లకుచ్చులమోతా**
**గోపికాలు తరిచెటిమోతా, గొంతుల్లుపాడెటి**
**మోతా ।**
**చిలకల్లు పలికెటిమోతా । సత్తూసుడికొమ్ముల**
**మోతా ।**
**నెమళ్ళు కూసెటి వినుత । లేగట్ల**
**అరిచెటిమోతా ।**

కృష్ణుడు పాడుతుంటే గోపబాలురు వంత పాడేవారు. దీన్నే కూసేటి మోతా అంటారు. కృష్ణుని వేణుగానానికి పులకించిన గోవులు, గోపాలురు, గోపికలేకాక నెమళ్లు, చిలుకలు, లేగదూడలు సైతం వంత పాడేవట.

**అనుచుండిన దేవగణంబులు,**
**గగనామార్గంబుల నుండి ।**
**పుష్పంబులు వృష్టే గురిసేను**
**పుండరీకాక్షునిపైనా ।**

అచ్యుతుని లీలను చూసిన సమస్త దేవతలు ఆకాశం నుంచి పుండరీకాక్షుని ప్రతిరూపమైన కృష్ణభగవానుడిపై పుష్పవర్షం కురిపించారట.

ఈ పుస్తకంలో సాహిత్య విలువలతో పాటు, ఆరోగ్య విశేషాలు కూడా




ప్రస్తావించారు. యశోద తన బిడ్డకు చద్ది పెట్టి పంపే విధానం అమ్మ అనురాగాన్ని ప్రతిబింబించేలా ఉంటే, చద్దిలోని పదార్థాలు ఆరోగ్య పరిరక్షణకు చేసే మేలు విశదీకరించారు. ఎండలో తిరిగేవారికి చల్ల(మజ్జిగ), దధి(పెరుగు), శొంఠి, ఉసిరికాయ, ఊరిన నిమ్మపండు, ఉచ్చింతకాయ (ఉప్పు చింతకాయ), మిరియపు పలుకులు, ఊరిన అల్లం మొదలైనవి ఆరోగ్య రక్షణకు దోహదం చేస్తాయని వివరించారు. ఈ పుస్తకం వెలుగు చూసేందుకు ఈమెకు ఇతోధికంగా సహాయపడింది ఈమె మనుమడు ఈదుమూడి లక్ష్మీనారాయణ. ఈయన కడప ఇ.పి.ఎఫ్ కార్యాలయంలో కంప్యూటర్ ఆపరేటర్‌గా పనిచేస్తున్నారు. అమ్మమ్మ కోరిక తీర్చేందుకు, అమ్మభాష సేవ చేసేందుకు ముందుకు వచ్చారు.

పదేళ్లప్పుడు 1933లో కావలి రైల్వేస్టేషన్‌లో గాంధీజీని చూడటం తనకు మధురానుభూతి మిగిల్చిందంటారు ఆవిడ. గాంధీజీ 1938లో తన హరిజన పత్రికలో బాల బాలికలకు నిజమైన భావప్రేరణ, ప్రగతి మాతృభాష వల్లనే వస్తుందని వ్యాఖ్యానించారు. ఆ వ్యాఖ్యలు అక్షరసత్యమని అనసూయమ్మ నిరూపించారు. 'శ్రీకృష్ణుని చద్దులు' పుస్తకాన్ని వెయ్యి ప్రతులు ముద్రించి తోటి మహిళలకు, కొంతమంది భజన బృందాలవారికి ఆమె ఉచితంగా అందించారు. కొంతమంది ఔత్సాహికులు వీటిని కంఠస్థం చేసి ఆలపిస్తూ మరింతమందికి తెలియజేస్తున్నారు. నాటి తరానికి నేటి తరానికి మధ్య వారధిలా నిలిచి అనసూయమ్మ తన సంకల్పాన్ని దిగ్విజయంగా నెరవేర్చుకున్నారు. అమ్మభాష సేవకు వయసు ఏమాత్రం అడ్డంకి కాదని నిరూపించారు.



**నెమ్మాని సీతారామమూర్తి**
ఒంగోలు. 80085 74071

---

పుస్తకానికి
దూరం కావడమంటే
అజ్ఞానానికి
చేరువ కావడమే.



దీపం
ఇంటికి వెలుగిస్తుంది
పుస్తకం
మనిషిని వెలిగిస్తుంది



పుస్తకం
చదువుతున్న నీవు
తిమిరంతో
సమరం చేస్తున్న
యోధుడివి.



\- **సయ్యద్ రసూల్**, చింతలపూడి, ప.గో.

**తెలిసో తెలియకో తప్పు చెయ్యడం మానవ నైజం. ఆ పొరపాటు ఎంత తీవ్రమైందైనా కావొచ్చు సరిదిద్దుకోలేని తప్పును చేసిన ఓ యువకుడు చివరికి ఏం చేశాడు?**

**నగరానికి** దూరంగా ఇంజినీరింగ్ కళాశాల. దాని పక్కనే హైవేపై దాబా. ఎప్పట్లాగే విద్యార్థులతో కోలాహలంగా ఉంది. సుజిత్, తన నలుగురు స్నేహితులూ ఓ మూలగా కూర్చున్నారు.

సీసాలు ఖాళీ అవుతున్నాయి. వేళ్ల మధ్య సిగరెట్లు పొగలు కక్కుతూ బూడిదవుతున్నాయి. వాళ్ల భవిష్యత్తులాగే...

“ఈ ట్రీట్స్‌లో మజా పోయిందిరా. కాలేజ్ అవ్వగానే దాబాలో కూర్చుని మందు కొట్టేసి ఇంటికి వెళ్లిపోవడం... రోజూ ఉంటున్నదేగా... ఏదో కోల్పోతున్నట్లు మనసు పీకుతోంది” అన్నాడు రోషన్ .

“మరేం చేద్దాం...” అడిగాడు సుజిత్ సీసా కింద పెడుతూ.

“నా దగ్గరో కిక్కిచ్చే ఐడియా ఉంది. వింటానంటే చెప్తా...” అన్నాడు రోషన్ ఆసక్తి కలిగించేలా ముందుకు వంగుతూ.

“ముందు చెప్పు. కిక్కు సంగతి... మేం చెప్తాం” అన్నాడు సుజిత్.

“ఇక్కణ్నుంచి మనం అయిదుగురం బళ్లపై ఒకేసారి బయల్దేరదాం. సిటీ మొదట్లో రింగ్‌రోడ్ దగ్గరుండే కేఫ్‌కి చేరాలి. ఎవడు చివరగా వస్తాడో... వాడే లూజర్. రేపు ట్రీట్ వాడి జేబుదే” ముగించి అందరి మొహాలకేసి చూశాడు రోషన్.

“మనం మందు కొట్టేసి ఉన్నాం, ఇలాంటి పరిస్థితుల్లో బైక్ రేసంటే ప్రమాదం మామా” అన్నాడు ఖాదర్.

“ఆరే... ఖాదర్ మామా! నువ్వు నోర్మూయ్. నాకు నచ్చిందంతే. అందరూ బళ్లు తీయండ్రా...” అంటూ ఉత్సాహంగా లేచాడు సుజిత్.

* * *

సుజిత్ బైక్ రివ్వున దూసుకెళ్తోంది. చేతికున్న స్టాప్‌వాచ్‌లో డిజిటల్ అంకెలు గుండెలయ కన్నా వేగంగా పరుగెడుతున్నాయి. చినుకుల చిటపట పెరిగింది. బైక్ మరింత జోరందుకుంది. తాగిన మైకం మస్తిష్కాన్ని కమ్మేస్తోంది. హైవే మీద భారంగా వెళ్తున్న ఒక్కొక్క వాహనాన్ని ఓవర్‌టేక్ చేస్తూ చినుకుల మధ్య ఖడ్గ ప్రహారం చేస్తున్న వాడిలా ముందుకు సాగుతున్నాడు సుజిత్.

దూరంగా రోడ్డు దాటుతోందొక మహిళ.

అంతలోనే... కళ్లలో వాన చినుకు టప్పున పడింది. కనురెప్ప టపటపా కొట్టుకుంది. ఒక్క క్షణం కళ్లు మూసి తెరిచాడు. అప్పటికే ఆలస్యమైంది.

వేగంగా ఆ మహిళను ఢీకొట్టింది సుజిత్ బైక్. విసురుగా పక్కకు పడిందామె. రోడ్డు పక్కన రాయికి తల బలంగా కొట్టుకుంది.

ఏం జరిగిందో అర్థం కాలేదు. బైక్ నియంత్రించే ప్రయత్నంలో దాదాపు వంద గజాల అవతల రోడ్డు దిగువన తుప్పల్లో పడిపోయాడు. ఆ వర్షంలో ఎవరూ చూడలేదతన్ని. మోకాళ్లూ భుజాలూ కోసుకుపోయాయి. నొప్పి తెలుస్తోంది.. తాగిన మైకం వదిలినట్లుంది..

దూరంగా రక్తం మడుగులో ఆ మహిళ కొన ఊపిరితో కదులుతోంది.. ఓ నలుగురైదుగురు గుమిగూడారు..

స్థాణువై దూరంగా నిలబడిపోయాడు సుజిత్.

అంతలోనే మరో పదిమంది చేరారక్కడ.. మెల్లగా అడుగులేస్తూ వెళ్లి







తనూ వాళ్ల మధ్య నిలుచున్నాడు..

అంబులెన్స్ వచ్చింది..

విరిగిన శిలలా బైక్ దగ్గరికి నడిచాడు.

* * *

ఆస్పత్రి వరండాలో కూర్చున్నాడు సుజిత్. మెదడుకూ, శరీరానికీ సంబంధం తెగిపోయినట్లుగా ఉందతని పరిస్థితి. వర్షంలో తడిసి ముద్దయినా, పొడిబారిన కళ్లతో నిస్తేజంగా చూస్తున్నాడు.

రెండు పెదవుల మధ్య నుంచీ 'అమ్మ... అమ్మ...' అంటూ బయటికి వినిపించని భావమేదో మంద్రంగా బయటికి రావడానికి ప్రయత్నిస్తోంది.

"ఎ-నెగెటివ్ బ్లడ్ కావాలి. పేషెంట్ బంధువులెవరైనా ఉన్నారా..?" అడిగాడు డాక్టర్.

"బంధువులెవరూ లేరు. మేమిస్తాం. సరిపోతే తీసుకోండ"ని ఓ ఇద్దరు ముందుకెళ్లారు.

సుజిత్ భావరహిత స్థితిలో అలాగే చూస్తుండిపోయాడు.

"కేసేంటీ..?" ఎవరో అడిగారు.

"లారీ గుద్దేసినట్టుంది సార్.. స్పాట్‌కి కొంత దూరంలో ఓ యాక్సిడెంటైంది. డ్రైవర్ స్పాట్ డెడ్.." ఎవరో జవాబిచ్చారు.

* * *

'సుజిత్... సుజిత్...' వంటింట్లోంచే గట్టిగా కేకేస్తోంది వసుధ.

ఏంటి వీడు... రాత్రెప్పుడో వచ్చాడు, పొద్దున పదవుతున్నా లేవటం లేదు. అనుకుంటూ సుజిత్ గదిలోకి వచ్చింది వసుధ.

'నాన్నా సుజీ' అంటూ తట్టిలేపింది.

బద్ధకంగా కళ్లు తెరిచాడు. సుజిత్ కళ్లు అగ్నిగోళాల్లా ఉన్నాయి.

"ఏంట్రా ఏమైంది. రాత్రి అంత ఆలస్యమైందేంటి?" అందామె.

మౌనంగా చూశాడోసారి తల్లికేసి.

"మాట్లాడుతుంటే పలకవేరా" ప్రేమగా జుట్టు సర్దింది వసుధ.

ఏమీ లేదన్నట్లుగా... తల్లి భుజమ్మీద తలవాల్చాడు సుజిత్.

"సరే, టిఫిన్ చేద్దువుగానీ లే" అంది వసుధ.

* * *

"ఏరా నాన్నా... కాలేజీలో ఏదైనా సమస్యా, స్నేహితులతో గొడవ పడ్డావా?" అడిగింది వసుధ. మౌనంగా తలొంచుకుని టిఫిన్ చేస్తున్న సుజిత్ పక్కగా కుర్చీ లాక్కుంటూ.

"ఏమీ లేదు మమ్మీ" పొడిగా సమాధానమిచ్చాడు.

"నాన్నేమైనా కోప్పడ్డారా?" అని మళ్లీ అడిగింది. మౌనమే సమాధానం.

"సెమిస్టర్‌లో మార్కులేమైనా తగ్గాయా?" రెట్టించిందామె.

"కాసేపు నన్నిలా వదిలేయ్ మమ్మీ... ప్లీజ్!" అన్నాడు సుజిత్ అర్థిస్తున్నట్లుగా...

* * *

శూన్యంగా బయటికి చూస్తూ బాల్కనీలో కూర్చున్నాడు సుజిత్.

ఎదురుగా పాఠశాల కనిపిస్తోంది. గేటు బయట పిల్లల కోసం తల్లులు ఎదురు చూస్తున్నారు. గేట్లోంచి అడుగు బయటకు పెడుతూనే... అంత మందిలోనూ తమ తల్లిని వెతుక్కుంటున్నారు. తల్లి కనిపించగానే ఏదో తెలియని మెరుపు వారి కళ్లలో. పరుగెత్తుకొచ్చి తల్లిని హత్తుకుపోతున్నారు.

లంచ్ బాక్స్ తెరిచి అన్నం తిన్నారా లేదా... అనే ఆత్రుత తల్లిలో కనిపిస్తోంది.

రోజూ ఇచ్చే చాక్లెట్ కోసం వెదుకుతున్నాయి పిల్లల మనసులు. తమ కోసం ఎవరూ రాని పిల్లలు... మౌనంగా... ఏదో వెలితితో ఆటోలవైపు నడుస్తున్నారు. సుజిత్ అటే చూస్తుండిపోయాడు. తల్లి చంకనెక్కిపోతున్న పిల్లల ముఖాల్లో ఆనందం. ఒంటరిగా వెళ్తున్న పిల్లల్లో విచారం. చీకటీ వెలుగూ పక్కపక్కనే.

అమ్మ... అమ్మ లేకపోతే... అంతర్మథనం సుజిత్ మనసులో...

అంతలో వెనక నుంచి అమ్మ వచ్చింది.

"కొత్త ఆవకాయ పెట్టాను... రుచి చూసి చెప్పు ఎలా ఉందో..." అంటూ ఆవకాయ పచ్చడితో కలిపిన అన్నం ముద్దను సుజిత్ నోట్లో పెట్టిందామె.

సుజిత్ కళ్లల్లో తడి.

"ఏమైంది నాన్నా... కారం ఎక్కువైందా..." మంచినీళ్లు అందిస్తూ అందామె ఆందోళన నిండిన స్వరంతో.



కాదన్నట్లుగా తలూపాడు.

"పొద్దున్నుంచీ ఏమీ మాట్లాడటం లేదు. సరిగా తినడం లేదు. ఏమైంది నీకు" అని అడిగింది వసుధ.

ఏమీ వినిపించనట్లుగా అభావం.

అన్నీ పట్టించుకుని, అవసరాలన్నీ తీర్చే అమ్మ తనకుంది. అమ్మ ప్రేమ ఎంత కమ్మనో తనకు తెలుసు. తనకు జ్వరమొస్తే అమ్మ ఒంట్లో పెరిగే టెంపరేచర్. ఇంటికి రావడం ఆలస్యమైతే అమ్మ పెట్టే హడావుడి. ర్యాంకులొస్తే అమ్మ చేసే పండగ. ఇంజినీరింగ్‌కు వచ్చినా... ఇప్పటికీ ఇంటికి వచ్చే వరకూ ఎదురుచూసే అమ్మ... అవన్నీ తనకే సొంతమైన అనుభూతులు.

తను బైక్‌తో ఢీకొట్టినావిడే గుర్తుకొస్తోంది. మరి ఆమె కుటుంబం.. పిల్లలు... వాళ్ల పరిస్థితేంటో? మదిలో ఎన్నో ప్రశ్నలు అలజడి రేపుతున్నాయి.

* * *

బైక్ వాళ్లింటిముందు ఆపాడు సుజిత్. లోపలి నుంచి ఏడ్పులు గుండెలు పిండేసేలా వినిపిస్తున్నాయి.

మెల్లగా లోపలికి వెళ్లాడు. హాలు మధ్యలో ఉంచారామె మృతదేహాన్ని.

భర్త కాబోలు ఓ పక్క కూర్చున్నాడు. కడదాకా తోడుంటానని బాస చేసి... నిలబెట్టుకోలేకపోయిన జీవితకాలపు స్నేహితురాలి నిస్సహాయతను అసహాయంగా చూస్తున్నట్లుగా ఉన్నాయి ఆ భర్త జీవం లేని చూపులు.

తండ్రి భుజమ్మీద తలవాల్చి తల్లికేసే చూస్తోంది వాళ్ల కూతురు. తన ఇష్టాల్నీ కష్టాల్నీ సమంగా భరిస్తూ నిత్యం చిరునవ్వుల్ని పంచే అమ్మ అలా నిస్తేజంగా పడుకుని ఉండటాన్ని జీర్ణించుకోలేక పోతోందా అమ్మాయి. మనసులో చోటు సరిపోనంత విషాదం కళ్లలోంచి పొంగుకొస్తోంది.

* * *

ఓ మూలగా నిల్చున్నాడు సుజిత్. శాశ్వత నిద్రలో ఉన్న ఆమె కళ్ల వెనక ఎన్నెన్ని ఆశలున్నాయో! ఎన్ని దుఃఖాలు, ఎన్ని బాధలు, ఎన్ని కలలు, ఎన్ని జ్ఞాపకాలు, ఎన్ని ఊహలు నింపుకుందో... అన్నింటినీ వదిలేసి వెళ్తోంది.

లేదు లేదు.. తనే సజీవ సమాధి చేశాడు. ఈ లోకానికి ఒక అమ్మను దూరం చేశాడు. వయసూ, డబ్బూ తెచ్చిన ఆకతాయితనంతో ఒక అమ్మను బలి తీసుకున్నాడు.

మనసు దహిస్తోంది. తనమీద తనకే తెలియని ఉక్రోషం. అదుపులేని తన మనసు మీద అసహ్యం. అమ్మా... అని పిలవాలనిపించింది. గొంతు పెగలడం లేదు. ఆ శబ్దం తన గుండెకే వినిపిస్తోంది.

వర్షిస్తున్న మనసు.. కన్నీరు కట్టలు తెంచుకొంటోంది. స్వచ్ఛమైన అమ్మ మనసు కోసం వచ్చిన తేటనీరులా.

ఏదో చేయాలి. అవును, ఇలాంటి అమ్మలు ఈ లోకంనుంచి దూరమవ్వకుండా ఉండేందుకు ఏదో ఒకటి చేయాలి. ఆ నిర్ణయం తర్వాత సుజిత్ మనసులో ఏదో ప్రశాంతత.

* * *

అది శిల్పకళా వేదిక....

సన్మానసభ జరుగుతోంది. డీజీపీ మాట్లాడుతున్నాడు.

"రోడ్డు మీద ప్రమాదం జరిగింది. బాధితులు రక్తం మడుగులో పడి ఉన్నారు. ఎవరూ పట్టించుకోవడం లేదు. ఎవరిమానాన వాళ్లు వెళ్లిపోతున్నారు. అంతలోనే కొంతమంది కాలేజీ విద్యార్థులు అక్కడికొచ్చారు. కొన ఊపిరితో కొట్టుకుంటున్న వాళ్లను వెంటనే ఆస్పత్రిలో చేర్చారు. కొంతమంది పోలీసులకీ ఆస్పత్రికీ విషయాన్ని చేరవేస్తే, ఇంకొంతమంది బాధితుల కుటుంబ సభ్యులను తీసుకొచ్చే బాధ్యతల్ని తీసుకున్నారు. మరికొంతమంది చికిత్స కోసం అవసరమైన రక్తం, మందులు వంటి అవసరాలు తీర్చారు. అంతా నిమిషాల వ్యవధిలో జరిగిపోయింది. ఇదంతా కథలానో, కలలానో అనిపిస్తోంది కదూ! కానీ నిజం. దీనంతటి వెనకా ఉన్నది ఒకే ఒక్క వ్యక్తి అంటే నమ్మగలరా?" చెప్పడం ఆపాడు డీజీపీ.

ఆడిటోరియంలో గాఢమైన నిశ్శబ్దం. అంతా వేదికవైపే చూస్తున్నారు.

అవును, ఒక్క వ్యక్తే. ఎంతోమందికి ప్రాణదాత అయ్యాడు. ఇప్పుడతణ్ని మీ అందరికీ పరిచయం చేయబోతున్నాను. అన్నాడు డీజీపీ అభినందనలు నిండిన స్వరంతో.

వేదికపై అందరి ముందుకూ వచ్చాడా యువకుడు అతనే... సుజిత్!

చప్పట్లు మార్మోగాయి హాలులో...

గొంతు సవరించుకున్నాడు సుజిత్... "మనిషి ప్రాణం విలువ ఒక జీవితం. ఒక కుటుంబం. ఒక అనుబంధం!

అవును... ఒక ప్రాణంపోతే జీవితం కోల్పోయినట్లే, ఒక కుటుంబం కూలినట్లే, ఒక అనుబంధం, ఆప్యాయత చెదిరినట్లే... ఇవేవీ మనం డబ్బులు పోస్తే వచ్చేవి కావు. నిర్లక్ష్యంతో ప్రాణం తీసే హక్కు ఎవరికీ లేదు.

ఈ ఆలోచన నా మనసును తొలిచే... నేనీ ప్రాజెక్టు మొదలుపెట్టాను. నా వెంట ఎంతోమంది తోడుగా నిలిచారు. ఎవరూ రోడ్లపై నిర్లక్ష్యానికి బలవకూడదన్నదే మా ప్రయత్నం. నిర్లక్ష్యం ఖరీదేంటో... అదెంత గాయం చేస్తుందో నా మనసుకు తెలుసు..." అన్నాడు సుజిత్ కళ్లనిండా కన్నీటితో...





**శ్రీనివాస్ దరెగోని**
హైదరాబాదు. 8008591414






## మంచికథల బహుమతి

మంచి కవిత చదివితే ఒళ్లు తిరగాలి. మనసుకు జ్వరం రావాలి అన్నాడు ఆరుద్ర. ప్రక్రియ ఏదైనా, ఈ మాట మంచి సాహిత్యానికి కూడా వర్తిస్తుంది. రంజని సంస్థ పుస్తకానికి 'బహుమతి కథ - 2' అని పేరు పెట్టారు. అంటే బహుమతులు వచ్చిన కథలు అని. కానీ అసలు కొన్ని కథలు చదవడమే ఒక బహుమతి. మంచి కథలు మనల్ని అంతలా ప్రభావితం చేస్తాయి. 2013 సంవత్సరంలో రంజని - నందివాడ భీమారావు కథల పోటీలు, రంజని - రాయప్రోలు రామకృష్ణయ్యల కథల పోటీల్లో బహుమతులు గెలుచుకున్న కథల సంకలనమే ఈ పుస్తకం.

పోటీలకు వచ్చిన దాదాపు 500కు పైగా కథలను జల్లెడ పట్టి ఈ పదిహేడు కథలను ఎంపిక చేసి మనకు అందించారు. కాదేది కథ కనర్హం అన్నట్టు ఈ పుస్తకంలో వస్తువైవిధ్యం మెండుగా ఉంది. టీవీల్లో పాటల పోటీలు పిల్లలమీద ఎంతగా ఒత్తిడిని పెంచుతున్నాయో తెలిపే కథతో మొదలు పెడితే, భూమికోసం పోరాడే మార్జినోళ్ల కథ, పిల్లలను చదివించడం ఉద్యమంగా మార్చుకున్న రిటైరైన లెక్కల మాస్టారి కథ, కథా రచయితను ఇంటర్నెట్‌లో డబ్బు సంపాదనకు ఉసిగొల్పే ఇల్లాలు, లాకప్‌డెత్‌ను కల్తీ సారా మృతిగా మార్చేసిన పెద్దల మాయాజాలం, ఫ్యాక్షనిజం నేపథ్యంలో ఎదురుపడిన శత్రువును రక్షించి మానవత్వం, భర్తతో మనస్పర్థల కారణంగా తడబడిపోయి తెప్పరిల్లిన భార్య, ప్రశ్నించడం జ్ఞానమార్గం అంటూ బోధించి స్వార్థపు తుప్పు వదలగొట్టిన స్వామీజీ... ఇలా దేనికదే మనకు ఓ విభిన్నమైన కోణాన్ని చూపిస్తుంది. అలానే 'మెమరీ కార్డు' కథలో సహాయం పొందినవారు ఆ సహాయాన్ని ఎలా మరిచిపోతారో... మనిషికి మంచి జ్ఞాపకాలు ఎంత అవసరమో చెబుతూ మానవ సంబంధాలను వివరిస్తుందీ కథ. ఇందులో రచయితలందరూ వేర్వేరు కాబట్టి పుష్కలమైన సమకాలీనతతో పాటు శైలీవైవిధ్యంతో

**ప్రధాన సంపాదకులు: చీకోలు సుందరయ్య; పుటలు:167; వెల:₹120; ప్రతులకు: అన్ని పుస్తక కేంద్రాల్లో; 90300 00696**

పుస్తకం నిండా కొత్తదనానికి కొదవలేదు. సంపాదకులు విశ్లేషించినట్టు ఆధునికత సాంకేతికత పెరిగేకొద్దీ జీవితాలు సులభతరం కాలేదని చుట్టూరా ఆవరించిన పరిస్థితులు స్పష్టం చేస్తున్న నిజాన్ని రచయితలు గుర్తించారని ఒప్పుకోక తప్పదు. ప్రతి కథా పాఠకుణ్ని ఆసాంతం చదివింపజేసేలా ఉంది.

**– కిశోర్‌కుమార్**

## భక్తి భావ సమాహారం

మనసులో కలిగిన భావాలను రాగయుక్తంగా ఆలపిస్తే ఎలా ఉంటుందో తెలియజేసే పుస్తకం 'భావాలాపనలు'. రచయిత్రి వెన్నెలకంటి మాణిక్యం వృత్తిరీత్యా విజ్ఞానశాస్త్ర అధ్యాపకురాలు. ప్రవృత్తిరీత్యా రచయిత్రి. దీనికితోడు కర్ణాటక గాత్రంలో కృషి చేయడం వల్ల ఆ అన్నిటి సమాహారం అందమైన పుస్తకంగా తయారైంది. గాయకులే స్వయంగా పాటలు రాసుకుని, వాటికి బాణీలు సమకూర్చుకొనే వాగ్గేయకార సంప్రదాయంలో వెలువడ్డ

**రచయిత్రి: వెన్నెలకంటి మాణిక్యం; పుటలు: 216; వెల:₹100; ప్రతులకు: ఎమెస్కో బుక్స్, దోమలగూడ, హైదరాబాదు**

పుస్తకమిది. ప్రతిపాటకూ తగిన శీర్షిక పెట్టడంతో పాటు వాటికి కూర్చిన రాగ తాళాలను కూడా సూచించి - గానాభ్యాసం చేయాలనుకొనే వారికి సౌకర్యం కలిగించారు.

భక్తిగీతాలు, భావగీతాలు, ఆరాధనాగీతాలు, స్త్రీలపాటలు, లాలిపాటలు, జోలపాటలు, స్నేహగీతాలు, సమైక్యతాగీతాలు ఇలా అనేక విభాగాలకు చెందిన భావాలతో 200 పైచిలుకు కీర్తనలున్నాయి. ఇందులో తెలుగునాట ఉన్న అందరు దేవుళ్లు - గ్రామదేవతలతో సహా కొలువై ఉన్నారు.

'ఏకాంతసేవ' కీర్తనలో 'పట్టుపరుపులు పదిలంగ పరచినారు శయనించ రావయ్య పన్నగ శయనా'! అనడంలో కొంత ప్రౌఢ కవితా భావన కనిపిస్తుంది. 'నీ పన్నగశయనం కంటె నా పట్టుపరుపు సుఖంగా ఉంటుంద'ని రచయిత్రి ఉద్దేశం కాబోలు! 'హరి పరమేశ్వరి' కీర్తనలో 'నీ ఆలయములో వెలిగే దీపికనై - నీ దేవాలయములో వెలిసే పీఠికనై' ఉండాలని కోరుకోవడంలో గాఢమైన కైంకర్యం కనిపిస్తుంది. 'మహాలక్ష్మి'లో 'గోపికనై గోవిందుని నామములు తలువనా రాధనై ప్రేమమార్గమున కొలువనా' అనడంలో రాధికా సాంత్వన భావాల ఛాయలు గోచరిస్తాయి.




'కందువగు', 'కోనేటి రాయుడు' వంటి పద ప్రయోగాల దగ్గర అన్నమయ్య ప్రభావం, జోలపాటల్లో 'పాలించు ఈశునికి పరమాత్మలాలి - లాలించు దేవునికి లలితమ్ములాలి' అన్నచోట సి.నా.రె ప్రభావం, 'నువ్వుండగ' అనే గీతంలో 'నమ్మితి నిన్ను నమ్మితి' అన్నచోట పోతన ప్రభావం స్పష్టంగా కనిపిస్తాయి.

వాగ్గేయకారులు సంగీతానికిచ్చినంత ప్రాధాన్యం సాహిత్యానికి ఇవ్వరనే అనుమానం ఈ రచయిత్రి విషయంలో కూడా రుజువైంది. 'మునివర పూజునికి, ముజ్జగనేల, నిమ్మవృక్ష నివాసాయ, కలువ నయని, సిరివన భూషిణి వంటి దుష్ట సమాస ప్రయోగాలిందుకుదాహరణ. అలమేలు మంగపతి కీర్తిస్తూ ఆయన్ని 'వారిజభవుడు' అనడం, సరస్వతిని కొనియాడుతూ 'నీ చేతిలో మహతిగా ఉండనీ' అనడం భక్తిపారవశ్యంలో దొరలిన పొరపాట్లుగా సరిపెట్టుకోవాలి. సంగీతపరంగా తూకానికి నిలబడగల పుస్తకం 'భావాలాపనలు'. కచేరీలు చేయాలనుకొనేవారు కరదీపికగా ఉపయోగించుకోవచ్చు.

**– నీలకంఠ**

## అనుభవాల సారాంశం



సామాన్యుడికి అర్థమయ్యే రీతిలో ఉంది 'వకాలత్ వజ్రాయుధం అయ్యిందా.. ఎలా' పుస్తకం. గులాబీల మల్లారెడ్డి తాను న్యాయవాదిగా వివిధ వర్గాలకు అందించిన న్యాయ సేవల గురించి చెప్పేదే ఈ పుస్తకం. వృత్తిపరమైన మెలకువలను వేరే వారితో పంచుకోవడానికి సాధారణంగా ఎక్కువ మంది ఇష్టపడరు. మల్లారెడ్డి మాత్రం న్యాయస్థానాల్లో నేర్చుకున్న అనుభవాలను, తన దగ్గరికి వచ్చిన వారిని గెలిపించడం కోసం చేసిన ప్రయత్నాలను చక్కగా వర్ణించారు. ఆ విషయాలు చదవరులను ఆశ్చర్యానికి గురిచేస్తాయి.

న్యాయస్థానాల్లో విచారణ పద్ధతులు అందరికీ అర్థమయ్యేలా ఉన్నాయి. ముఖ్యంగా జూనియర్ న్యాయవాదులకు, న్యాయవ్యవస్థ గురించి పరిజ్ఞానం పొందాలనుకునేవారికి ఈ పుస్తకం ఎంతో ఉపయోగపడుతుంది. న్యాయబద్ధంగానే పోరాటం చేసి.. తనదగ్గరకొచ్చిన వారిని గెలిపించాలన్న తపన రచయితలో కనిపిస్తోంది. 'మలియుద్ధం బహుజనుల కోసం' వ్యాసంలో రైతుల భూమిని ప్రభుత్వం సేకరించి.. వారికి న్యాయమైన ధర ఇవ్వకపోవడంపై కోర్టుల్లో రచయిత చేసిన

**రచయిత: గులాబీల మల్లారెడ్డి; పుటలు:254; వెల:₹200; ప్రతులకు:జి.ఎం.ఆర్.పటేల్, వావిలాలపల్లి, కరీంనగర్, 94400 41351**

పోరాటం చెప్పుకోతగ్గది. ప్రభుత్వ కార్యాలయాలను జప్తు చేయించేవరకు ఈ వ్యవహారం సాగింది. చివరికి సుమారు వెయ్యిమంది గిరిజనులు, బడుగు బలహీనవర్గాల ప్రజలకు న్యాయం జరిగిన తీరు ఈ కథనం కళ్లకు కట్టింది.

వీధికుక్కలు, పందులను చంపనీయకుండా కోర్టు నుంచి ఆదేశాలు తీసుకొచ్చి.. వాటి పట్ల ఉదారత చూపిన కథనం 'మూగ జీవాల వధ అమానుషం'. ఈ భూమి ఒక్క మనుషులకే కాదు, సమస్త జీవరాసుల కోసమనే అర్థాన్ని రచయిత అందులో పొందుపరిచారు. 'వకాలత్' అంటే 'న్యాయం కోసం పోరాటం చేయడమే' అంటారు రచయిత.

న్యాయాన్యాయాల మధ్య జరిగే పోరాటానికి కోర్టు వేదిక కాబట్టి.. దానిని ధర్మక్షేత్రంగా పేర్కొంటారు. ఓ కేసులో ఇరుక్కున్న వృద్ధ మహిళను 'కోర్టుకెళ్లి ముందస్తు బెయిలు తీసుకో' అని పోలీసులు ఆమె పట్ల జాలి చూపిస్తారు. కోర్టు బెయిలు ఇవ్వడానికి నిరాకరిస్తే, న్యాయస్థానాలపై సామాన్యులకు గౌరవం సన్నగిల్లుతుందని రచయిత న్యాయమూర్తి దృష్టికి తీసుకొచ్చిన అంశం అందరినీ ఆలోచింపజేస్తుంది. మూస ధోరణిలో కాకుండా.. మానవతా దృక్పథంతో న్యాయమూర్తులు మెలగాలన్నది రచయిత ఆకాంక్ష. కనీస పరిజ్ఞానానికైనా ప్రతి ఒక్కరు చదివి తీరాల్సిన పుస్తకమిది.

– రాజోలు శ్యాంబాబు

## అనుభూతినిచ్చే కథలు



పూర్ణచంద్ర తేజస్వి కన్నడ సాహిత్యరంగంలో తనదైన ముద్రవేశారు. కథ, నవల, యాత్రా సాహిత్యం, నాటకం, సైన్స్ ఫిక్షన్... ఇలా భిన్న ప్రక్రియల్లో ప్రభావవంతమైన పాత్ర పోషించారు. సుప్రసిద్ధ రచయిత కువెంపు (కె.వి.పుట్టప్ప) కుమారుడైనా, తండ్రి నీడ నుంచి బయటపడి సొంత గొంతుకను ఏర్పరచుకున్నారు. పెయింటింగ్, ఫొటోగ్రఫీ, ఫిలాసఫీ రంగాల్లోనూ కృషి చేశారు. ఆయన ప్రకృతి ప్రేమికుడు. నిరంతరం పశ్చిమ కనుమల్లోని అడవుల్లో సంచరిస్తూ ప్రేరణ పొందేవారు. తన అనుభూతిని అక్షరాల్లోకి అనువదించే వారు...
ఈ సంకలనంలో పూర్ణచంద్ర తేజస్వి ఐదు కథలున్నాయి. ఇవన్నీ నలభై ఏళ్ల క్రితం వచ్చిన కథలు. ప్రతి కథలోనూ గ్రామీణుల్లో సహజంగా ఉండే మూఢనమ్మకాల జాడలు కనిపిస్తాయి. రజస్వల కాని బాలికను సంభోగిస్తే మేహవ్యాధి మటుమాయం అవుతుందన్న నమ్మకంతో ఆమెపై అత్యాచారం చేసి హతమారుస్తాడు నిందితుడు. అటువంటి వ్యక్తి హఠాన్మరణం చెందటం వెనుక మృత్యుదేవత పగ తీర్చుకుందన్న భావనను గ్రామీణులు ప్రచారం చేస్తారు- 'డా॥ వెలిగండ్ల శ్రీయుత కుబేరనాథ్‌రావ్, ఇయాళ' అన్న కథలో ఔషధ సీసాను డాక్టరు స్వయంగా తన చేత్తో ముట్టుకుని ఇస్తే వ్యాధి నయమవుతుందని నమ్మే అమాయకత్వం, వాళ్ల అజ్ఞానాన్ని తొలగించేందుకు కుంబి (కుబేరనాథరావ్) ప్రయత్నం పాఠకులను ఆలోచింపజేస్తాయి. ఏ నమ్మకాలను విరోధించి తిరస్కరించేవాడో- దాన్నే జనం ప్రతిపాదిస్తూ ప్రచారం చేస్తున్నారని నిర్లిప్తంగా ఉండిపోతాడని చెబుతూ కథను ముగిస్తారు రచయిత.

**అనువాదం: శాఖమూరు రామగోపాల్, 90525 63666; పుటలు: 198 వెల: ₹200; ప్రతులకు: అన్ని పుస్తక కేంద్రాలు**

స్తనదోషం వల్లే పుట్టిన బిడ్డలు త్వరత్వరగా చనిపోతున్నారని భావిస్తారు 'అవనతి (పతనం)' కథలో. ఈతముల్లు గుచ్చుకుని కంటికి గాయమైతే బాలింత మహిళ చనుబాలును కంట్లో పోసుకుంటే నయమవుతుందన్న (అప) నమ్మకం ఈ కథలో కనిపిస్తుంది. 'ఆత్మకూరులోని పోస్టాఫీసు' కథలో ఇతరుల వ్యక్తిగత జీవితాల్లో విషయాలు తెలుసుకునే ప్రయత్నంలో భంగపడటం, భార్యకు దూరం కావటం కనిపిస్తుంది. 'టైలర్ తుక్కోజిరావు' జీవిత విశేషాలు సహజత్వానికి దగ్గరగా సాగుతాయి. ముసల్మానుల జీవనశైలిని 'డేర్ డెవిల్ ముస్తఫా' కథ ద్వారా అర్థం చేసుకోవచ్చు. ఇందులో చేర్చిన మిగిలిన కథల్లో- 'చిత్రమైన గొడుగు', 'ఒక పేను కథ', 'చంద్రసాని' చెప్పుకోదగ్గవి.
అభిజాత కన్నడ- తెలుగు భాషా (అనువాద) సంశోధన కేంద్రం ద్వారా శాఖమూరు రామగోపాల్ ఈ కథలను అనువదించి మన ముందుకు తెచ్చారు.

– పార్థు

# కొండ అద్దమందు...




## ఓ హృదయ స్పందన

రచయిత్రి పొత్తూరి విజయలక్ష్మి ఆంధ్రభూమి దినపత్రికలో కొంతకాలం 'కొంచెం ఇష్టం - కొంచెం కష్టం' కాలమ్ రాశారు. ఆ రచనలను అదే పేరుతో పుస్తకంగా ప్రచురించారు. ఇందులో మొత్తం 56 శీర్షికలున్నాయి. అన్నీ చక్కని భాష, నుడికారాలు, చమత్కారాలు, హాస్యభరితంగా, భావప్రధానంగా సాగుతాయి. ఇందులో విషయాలు ఊహించి రాసినవి కాదు. మన చుట్టూ ఉన్న సమాజంలో నిత్యం జరుగుతున్న విషయాలే. ఇవి సమాజం పట్ల బాధ్యత గల వ్యక్తిగా రచయిత్రి స్పందించి రాసిన వాస్తవ చిత్రణలు. సామాజిక సమస్యలు, ప్రభుత్వ విధానాల్లోని ఆచరణ లోపాలు, తనకెదురైన, తన అనుభవంలోకి వచ్చిన, తనను స్పందింపజేసిన ఎన్నో అంశాలను కాలమ్ రచనలుగా మలచారు.

**- కె.సుభద్రాదేవి**

**రచయిత్రి: పొత్తూరి విజయలక్ష్మి, 99490 59007; పుటలు:187; వెల: ₹120; ప్రతులకు: అన్ని పుస్తక కేంద్రాల్లో**




## చిన్న పదాలతో లోతైన భావాలు

డా॥ఎన్.గోపి కలం నుంచి జాలువారిన 'మళ్లీ విత్తనంలోకి' కవితా సంపుటిలో కవితలన్నీ అలతి అలతి పదాలతో రూపుదిద్దుకున్నాయి. వస్తు ఎంపికలో వైవిధ్యం... అభివ్యక్తిలో నవ్యత చోటుచేసుకున్నాయి. కవితలన్నీ కవి అపార అనుభవానికి, లోక పరిశీలనకు, సృజనాత్మకతకు అద్దం పట్టేలాఉన్నాయి. మనకు సాదాసీదాగా కనిపించే కొబ్బరికాయ, చిలుక్కొయ్య, దండెం, కాగితం, రశీదు వంటి అంశాలు కవితా వస్తువులై లోతైన భావాలను మోసుకొచ్చాయి. చిలుక్కొయ్యకు వేలాడేవి... వస్త్రాలు కాదు జ్ఞాపకాలనీ, దండెంపై బట్టలు ఆరేసినప్పుడు.... బొట్లురాలుతుంటే.... అవి పేదరికం దుఃఖాన్ని తలపించేవని ప్రకటించడం ప్రశంసనీయం!

**- దాస్యం సేనాధిపతి**

**కవి: డా॥ఎన్.గోపి; పుటలు:114; వెల: ₹150; ప్రతులకు:ఎన్. అరుణ, రామంతాపూర్, హైదరాబాదు, 93910 28496**




## ఇగిరిపోయిన కన్నీటి కథలు

సమాజంలో ఏ సమస్యలు మనిషి గుండెల్లో కల్లోలాన్ని రేపుతున్నాయో వాటినే కథా వస్తువులుగా తీసుకుని రాసిన పది కథల సంకలనం ఈ 'పోరు'. అసహాయుల బతుకుపాట్లు, తుపాకీ చాటు కన్నీటిబొట్లు ప్రతి కథలోనూ సజీవ చిత్రణతో కన్నీటి పొరలను తాకి పాఠకులను ఆలోచింపజేస్తాయి. కథా నేపథ్యాలూ, పరిమిత పాత్రలూ, పొసగిన సంభాషణలూ కథలను చదివింపజేస్తాయి. 'పిండం' కథలో పిల్లాడు అవ్వ కోసం ఆలోచించడం, 'దొరుంచుకున్న దేవక్క' కథలో పాత్ర అసహాయతను దైన్యంగా మలిచిన తీరూ, 'సద్దిబువ్వ' కథలో 'అడవి.. పసరు కక్కుకున్న పచ్చి బాలింతలా ఉంది..' అంటూ సాగే వర్ణనలూ ఆకట్టుకుంటాయి.. ఇందులో పది కల్లోల కథలూ ఒకే ఇతివృత్తంతో రూపుదిద్దుకున్నాయి.

**- సురా**

**రచయిత: కె.వి.నరేందర్; పుటలు: 97; వెల: ₹100; ప్రతులకు: కె.వి.శ్రీదేవి; జగిత్యాల, కరీంనగర్; 94404 02871**

### కొత్త పొత్తాలు




**'సిరి'గమకా/నాలు; ర:** డా॥వి. శ్రీరామశర్మ; **పు:**32;**వెల:**₹38; **ప్ర:**రచయిత, కాకినాడ, 98660 50220, ప్రబోధాలు, నైతిక విలువలతో కూడిన రెక్కలు.



**మౌనవేదన; ర:** విడదల సాంబశివరావు; **పు:**93; **వెల:** ₹100; **ప్ర:** రచయిత, చిలకలూరిపేట; 98664 00059, నేటి సమస్యలను ప్రతిబింబించే కవితలు.




**శంభుస్తవం; ర:**డా. పి. సత్య నారాయణ;**పు:**43;**వెల:**₹50; **ప్ర:** విజయలక్ష్మి, హన్మకొండ, 9849812054; తుమ్మడపల్లి(ఐ) రాజరాజేశ్వరునిపై స్తోత్రాలు.




**ఎద్దు; ర:**కె. శాంతారావు;**పు:**48; **వెల:**₹20;**ప్ర:** వనమాలి, న్యూ బోయినపల్లి, సికిందరాబాదు, 9959745723; జీవిత సత్యాన్వేషణ తెలిపే కవితలు.




**విశ్వగీతం; ర:**కె. లక్ష్మణ్‌గౌడ్; **పు:**49; **వెల:**₹50; **ప్ర:** రచయిత, మహబూబ్‌నగర్; 93921 40465; సమాజ హితాన్ని కోరే కవితలు.

ర: రచయిత, పు: పుటలు, ప్ర: ప్రతులకు

## సాహితీ గుచ్ఛం




సాహితీ అంశాలకు ఇచ్చిన సందర్భోచిత ప్రాధాన్యమే ఈ వ్యాస సమాహారం. తాను వివిధ సందర్భాల్లో, వేర్వేరు పత్రికల్లో రాసిన పాతిక వ్యాసాలను పాఠకుల కోసం ఏరికూర్చారు రచయిత నాగసూరి వేణుగోపాల్. సాహిత్యం, భాష, పాత్రికేయానికి చెందిన విషయాలతోపాటు సామాజిక, సినీ, వైజ్ఞానిక అంశాలనూ వీటిలో స్పృశించారు.

విశిష్ట వ్యక్తుల కేంద్రంగా సాగుతూ గత కాలపు విశేషాలు, వివరాలు, విశ్లేషణలు, సంగతులు, స్వగతాలతో చదివించే పుస్తకమిది. కథకుడు, నవలాకారుడిగా చాలామందికి తెలిసిన కొడవటిగంటి కుటుంబరావు సైన్స్ రచనా సామర్థ్యం.. అలాగే జ్ఞానపీఠాన్ని అధిష్ఠించిన రావూరి వారి జీవన, రచనా వైశిష్ట్యం.. 'తాపీ ధర్మారావును విస్మరించామా' వ్యాసంలో గురుశిష్యులు తాపీ, గిడుగుల అనుబంధం.. తాపీ విశిష్ట వ్యకిత్వం వంటివన్నీ రచయిత సందర్భోచితంగా ఆవిష్కరించారు.

**- ఎ.పి.శాండిల్య**

**రచయిత: డా. నాగసూరి వేణుగోపాల్; పుటలు: 159; వెల:40; ప్రతులకు: విద్యార్థి మిత్ర ప్రచురణలు, కర్నూలు, 94405 54199**

## జలదారి




ప్రకృతిని వర్ణిస్తూ రాయడం సహజమే. అయితే విశ్వం ఆవిర్భావం, మానవ వికాసం, నాగరికత నడకలను కవిత్వాంశంగా ఎన్నుకోవడం ఓ ప్రయోగాత్మక ప్రయత్నం. ఖగోళ, భౌగోళిక అంశాలతో కవిత అల్లడం విశేషం.

'నా రచనలో కవిత్వం లేదంటూ'నే విశాల విశ్వంలోని నీటిని వస్తువుగా తీసుకొని దీర్ఘకవిత రాశారు... బి.హనుమారెడ్డి. ఆ జలానికి ఆయన పెట్టిన పేరు పావని. పుస్తకం పేరు కూడా అదే. 'తాను ఎప్పుడు సృష్టించబడిందో తెలియని పావని/ పరుల కొరకు పరుగెత్తుతున్నది' అంటూ నాటి నుంచి నేటి వరకు నీళ్ల ఆధారంగా జరిగిన పరిణామాలను వివరించారు. "పావని ఆలవాలంలో/ చిన్నపెద్ద చేపలు/ వాటి జంటలు/ వాలున ఈదే వాలుగలు/ ముచ్చటైన మత్స్య మొగ్గరం /వాటి వాహ్యాళి-కేరింతలు/ వాటి పరుగులు-క్రీడలు/ ఎండ్రి, ఎండ్రకాయలు, జలగలు, పాములు/కప్పలు,తాబేళ్లు/ఇవన్నీ అతడికి అబ్బురము/ఆమెకు ఆకర్షణం' అంటూ పర్యావరణ ప్రేమికులకు నచ్చేలా కొనసాగుతుంది ఈ దీర్ఘకవితా సంపుటి.– **పి.శంకరరావు**

**రచయిత: బి.హనుమారెడ్డి; పుటలు: 94 వెల: 80; ప్రతులకు: రచయిత, ఒంగోలు, 94402 88080**

## వల్లభ విశేషాలు



**రచయిత: అళహరి శ్రీనివాసాచార్యులు; వెల: ₹120; పుటలు:113; ప్రతులకు:నవోదయ బుక్ హౌస్, హైదరాబాదు**

ఆపదలు తీర్చి, సకల సుఖాలనూ ప్రసాదించే ఇలవేలుపును ఎవరైనా మనస్ఫూర్తిగా నమస్కరిస్తారు, అర్చిస్తారు. ప్రజలందర్నీ చల్లగా కాపాడమని వేడుకుంటారు. కానీ తమ ఇలవేలుపు ఇంకెన్ని రూపాల్లో ఏయే ప్రదేశాల్లో కొలువున్నాడో, ఏయే కుటుంబాలు ఆయన్ను అర్చిస్తున్నారో తెలుసుకోవాలన్న ఆలోచన రావడం అరుదు. అంతేకాకుండా దాన్ని అమల్లో పెట్టి దేశవ్యాప్తంగా తమ ఇలవేలుపు వల్లభరాయస్వామి విశేషాలను 'వల్లభరాయవైభవం' పుస్తకరూపంలో పెట్టిన అళహరి శ్రీనివాసాచార్యుల కృషి అభినందనీయం. దేశంలో కొలువున్న వల్లభరాయస్వామి 18 క్షేత్రాల విశేషాలు, పూజా విధానాలు, సంప్రదాయాలు, స్థలపురాణాలు వంటి ప్రత్యేకతలనూ వివరించారు. క్షేత్రాలను ఆయన స్వయంగా సందర్శించి రాసిన పుస్తకమిది. తిరువనంతపురం అనంత పద్మనాభస్వామి సంపదలో సగం తిరువల్ల శ్రీవల్లభస్వామివేనన్న విషయాన్ని సాధికారికంగా వివరించడం విశేషం. **- సాహితీ హరిత**




**మనీషి; ర:**ఎ. పాండురంగ ప్రజాసింగం (9912565856); **పు:**42; **వెల:**₹56; **ప్ర:** అన్ని పుస్తక కేంద్రాలు; సాంఘిక సంస్కరణాభిలాష శతకం.




**కాలం మారింది!; ర:** సాధు సుబ్రహ్మణ్యశర్మ; **పు:**81; **వెల:**₹ 50; **ప్ర:**రచయిత,కాకినాడ, 0884 2372907, ఆలోచన, నడతల్లో రావాల్సిన మార్పులు.




**శ్రీసాయి మహిమ; ర:**వారణాశి సత్యనారాయణ; **పు:**64; **వెల:**₹50; **ప్ర:**రచయిత, చిలకలూరిపేట, 9848211339; సాయి మహిమలపై పద్యాలు



**శ్రీకాకుళం నానీలు; ర:** బి. సుబ్బారావు; **పు:**48; **వెల:**₹50; **ప్ర:**రచయిత, రిట్టపాడు, శ్రీకాకుళం, 94402 62515; చురుక్కుమనిపించే నానీలు.




**టి.ఎస్.ఎ.కథ2013; ర:**టి. ఎస్. ఎ. కృష్ణమూర్తి; **పు:**88; **వెల:**₹72; **ప్ర:**రచయిత, మదనపల్లె, 93472 98942; ఆరు విభిన్న కథల సంపుటి.

# రాష్ట్రపతిభవన్‌లో కళా సుమాలు

వైవిధ్యంతో కూడిన సృజనాత్మకతే మానవాభివృద్ధికి మూలమన్న భావన... సృజనాత్మక ఆలోచనలే జాతి మానసిక, శారీరక ఆరోగ్యానికి చోదకశక్తులవుతాయన్న వివేచనలోంచి రాష్ట్రపతి ప్రణబ్‌ముఖర్జీ ఓ కొత్త ప్రయత్నం ప్రారంభించారు. వర్ధమాన రచయితలు, కళాకారులను ప్రోత్సహించడం ద్వారా దేశంలోని సృజనాత్మక శక్తుల్లో స్ఫూర్తినింపాలని నిర్ణయించుకున్నారు. రాష్ట్రపతి తీసుకున్న ఈ చొరవ... కడప జిల్లా తెలుగు ఉపాధ్యాయుడు, కథా రచయిత వేంపల్లి గంగాధర్, సిక్కిం పాత్రికేయురాలు, రచయిత్రి యాషే డోమా భూటియా, కళాత్మక వస్తువుల సృష్టికర్త రాహుల్ సక్సేనా (చెన్నై), చిత్రకారుడు ప్రతాప్ సుధీర్ మోరే(ముంబై)లకు అరుదైన అవకాశాన్ని దక్కించింది. ఇటీవలే ఈ నలుగురూ ఇరవై రోజుల పాటు రాష్ట్రపతి భవన్‌లో అతిథులుగా ఉన్నారు. రాష్ట్రపతిభవన్‌లో అడుగుపెట్టే అవకాశం పొందడం, అక్కడ ఉన్న రోజుల్లో తమ అనుభవాలు, అనుభూతుల వివరాలు... గంగాధర్ మాటల్లో...

**గతేడాది తన** పుట్టినరోజు (డిసెంబరు 11) సందర్భంగా రాష్ట్రపతి ప్రణబ్‌ముఖర్జీ ఓ ప్రకటన చేశారు. ఇద్దరు రచయితలు, ఇద్దరు కళాకారులకు రాష్ట్రపతి భవన్‌లో ఆతిథ్యం ఇవ్వనున్నట్లు చెప్పారు. ఆ మేరకు దరఖాస్తులను ఆహ్వానిస్తూ రాష్ట్రపతిభవన్ ఓ పత్రికా ప్రకటన ఇచ్చింది. దాన్ని చూసి దరఖాస్తు చేశా. జాతీయ స్థాయిలో పదిమంది సభ్యులతో కూడిన ఎంపిక సంఘం... వచ్చిన దరఖాస్తులను వడపోసింది. నలుగురిని ఎంచింది. దక్షిణభారతం నుంచి నాకు అవకాశం వచ్చింది.

ఈ కార్యక్రమంలో భాగంగా రెండుసార్లు ప్రణబ్‌ముఖర్జీని కలిశాం. మొదటిసారి ఆయన మాకోసం గంటకుపైగా సమయాన్ని వెచ్చించారు. ఆయనకు నా ఎనిమిది పుస్తకాలు, వాటి ఆంగ్లానువాదాలు అందజేశా. రాయలసీమ ప్రాంత సమస్యలు, సామాజిక, ఆర్థిక అంశాల మీద ప్రణబ్‌కు అవగాహన ఉంది. సమాజాన్ని ప్రతిబింబించే రచనలు రావాలని సూచించారాయన.

మా నలుగురి సృజనలకు సంబంధించిన ప్రదర్శనను రాష్ట్రపతిభవన్‌లోని ఆడిటోరియంలో ఏర్పాటు చేశారు. అప్పుడు ప్రధానమంత్రి నరేంద్రమోదీ వచ్చారు. సాహిత్యకారులంటే ఆయనకు ఎంతో గౌరవం. సాహిత్యకారుల వల్లే సమాజంలో చైతన్యం వెల్లివిరుస్తుందని అభిప్రాయపడ్డారు. ఆ తర్వాత మాజీ రాష్ట్రపతి అబ్దుల్‌కలాంను ఆయన నివాసంలో కలిశా. విద్యావ్యవస్థలో రావాల్సిన మార్పులు, విజన్ 20-20 గురించి ఆయన మాట్లాడారు. విద్యార్థులను దృష్టిలో ఉంచుకుని కథల ద్వారా సృజనాత్మక సాహిత్యాన్ని సృష్టించాలని సూచించారు.

జ్ఞానపీఠ పురస్కార గ్రహీతలు సత్యవ్రత్ శాస్త్రి, కేదార్‌నాథ్ సింగ్‌లనూ కలుసుకున్నా. సంస్కృత పండితులైన శాస్త్రి... రామాయణ, మహాభారతాల ఆధారంగా ఎన్నో రచనలు చేశారు. ఆయన్ను కలిసినప్పుడు... మన కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణతో తనకున్న అనుబంధాన్ని గుర్తు చేసుకున్నారు. హిందీ సాహిత్యంలో మేరునగమైన కేదార్‌నాథ్... కవిత్వం, శైలి, శిల్పాల మీద మంచి సూచనలు చేశారు. నాతో పాటు ఈ కార్యక్రమంలో పాల్గొన్న సిక్కిం రచయిత్రి యాషేడోమా... యాత్రా సాహిత్య రచనలోనూ



కృషి చేశారు. ఆ వివరాలను అడిగి తెలుసుకున్నాను. తెలుగు భాషా సాహిత్యాల మీద ఆమెకు అవగాహన లేదు. కానీ, తెలుగు సాహిత్యంలో వస్తున్న మార్పులను గురించి తెలుసుకోవడానికి ఆసక్తి చూపించారు.

రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధాని, అబ్దుల్ కలాంలను కలవడం మర్చిపోలేని అనుభూతి. చైనా అధ్యక్షుడి రాక సందర్భంగా రాష్ట్రపతి భవన్‌లో నిర్వహించిన కార్యక్రమాలను ప్రత్యక్షంగా చూడటమూ ఆనందానిచ్చింది. రాష్ట్రపతి భవన్‌లో చూసిన ప్రదేశాలు, ప్రదర్శనశాలలు, ఉద్యానవనాలు, అక్కడి పని వాతావరణం తదితర వివరాలతో 'నేను చూసిన రాష్ట్రపతి భవన్' పేరిట పుస్తకం రాస్తున్నా.

కెరటాలు వీస్తున్నాయి. ఇది శుభపరిణామం. అయితే యువ సాహిత్యకారుల కృషి నిర్మాణాత్మకంగా ఉండకపోవడం కొంత బాధాకరం. ఒక కథా సంకలనంతోనో, ఒక కవితా సంకలనంతోనో రాత్రికి రాత్రి 'కథానాయకుల'మైపోవాలన్న భావన ప్రమాదకరం కూడా! దాన్ని వాళ్లు గుర్తించట్లేదు. తెలుగు సాహిత్యంలో ఉన్న ఖాళీలను పూరించే దిశగా సాహితీకృషి సాగితే ప్రయోజనకరంగా ఉంటుంది.

**వికసించడం ఖాయం**

నవతరానికి తెలుగును చేరువ చేసే పని ఇంటి నుంచే మొదలవ్వాలి. అమ్మే ఆ పని చేయాలి. 'నీ మాతృభాషలో నువ్వు నిష్ణాతుడివి అయితే మిగిలిన అన్ని భాషలూ సులభంగా నేర్చుకోగలవ'న్న



**ఇతివృత్తాలకు ఆధారమదే**

మొదటి నుంచీ నాకు గ్రామీణ విలేకరులతో పరిచయాలుండేవి. ఆ తర్వాత పత్రికలకు వ్యాసాలు రాశా. సాహితీవేత్త గజ్జల మల్లారెడ్డి పరిచయం కొత్త ఆధారమైంది. కె.రామచంద్రమూర్తి ప్రోత్సాహంతో సంపాదకీయ పేజీ వ్యాసాలూ రాశా. ఆర్.ఎం. ఉమామహేశ్వరరావు సూచనతో కథా సాహిత్యంలోకి అడుగుపెట్టా. కేతు విశ్వనాథరెడ్డి కథలు స్ఫూర్తినిచ్చాయి. నా కథలకు నా ప్రాంతమే ఇతివృత్తాలను అందిస్తుంది. నేను అనుసరిస్తాను అంతే! రాయలసీమ మాండలికంలో ఉండటం వల్లే నా కథలకు గుర్తింపు వచ్చిందనుకుంటున్నా.

తెలుగు కథా సాహిత్యంలో కొత్త

విషయాన్ని చిన్నారులకు చెప్పాలి. గాలిపటం ఎంత ఎత్తుకు ఎగిరినా దానికి ఆధారమైన దారమొకటి భూమిపైన ఉంటుంది. అలాగే మనం ఎంత ఎత్తుకు ఎదిగినా మాతృభూమిని, మాతృభాషను విస్మరించరాదు.

మన భాషలోకి వెల్లువెత్తుతున్న ఆంగ్ల పదాలను పరిహరించడంపై సాహిత్యకారులు దృష్టిపెట్టాలి. సమయాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి అందుబాటులో ఉన్న తెలుగు పదాల్ని విస్తృతంగా వినియోగించడం వల్ల 'మాట'కు ప్రాణం పుడుతుంది. భాష పట్ల 'ఆత్మీయత' పెంచుకుంటే చాలా తెలుగు పదాలు సజీవం అవుతాయి.

**యాషేదోమా భూటియా**



స్వస్థలం గ్యాంగ్‌టక్. 'సిక్కిం ఎక్స్‌ప్రెస్'లో కాపీఎడిటర్. లెప్చా జానపదగాథలపై పరిశోధన గ్రంథాలను ప్రచురించారు. సిక్కిం సాహిత్య సమ్మాన్ పురస్కారాన్ని అందుకున్నారు. 'ఇలాంటి కార్యక్రమాల వల్ల యువత రచనా రంగాన్ని ఓ వృత్తిగా స్వీకరిస్తుంద'ంటూ రాష్ట్రపతిభవన్ ఆతిథ్యంపై ఆనందం వ్యక్తం చేశారామె.

**ప్రతాప్ మోరే**



సాధారణ పెయింటర్‌గా జీవితాన్ని ప్రారంభించారు. డిజిటల్ చిత్రకారుడిగా ఎదిగారు. పట్టణీకరణకు సంబంధించిన అంశాలకు చిత్రరూపమివ్వడం ఆయనకు ఇష్టం. దేశవిదేశాల్లో ప్రదర్శనలు నిర్వహించారు. 'రాష్ట్రపతిభవన్ నిర్మాణ కౌశలానికి సమకాలీన శైలిలో గౌరవం ప్రకటిస్తూ డిజిటల్ చిత్రాలను రూపొందించాలనుకుంటున్నా'నని చెప్పారు.

**రాహుల్ సక్సేనా**



పదిహేనేళ్ల పాటు బహుళజాతి సంస్థల్లో పని చేసి... కళలపై ఆసక్తితో బయటకు వచ్చేశారు. 'కుక్కపిల్ల, సబ్బుబిళ్ల, అగ్గిపుల్ల... కాదేదీ కవితకనర్హం' అన్నట్లు నిత్యజీవితంలో వినియోగించే వస్తువులనే కళాత్మకంగా తీర్చిదిద్దడం ఆయన శైలి. 'రాష్ట్రపతిభవన్‌లోని ప్రతి గోడా నాతో మాట్లాడిందంటూ' తన అనుభూతిని కవితాపరిభాషలో వ్యక్తీకరించారు. ❖

యాంత్రిక జీవనంలో
వెకిలితనం, అసూయాద్వేషాలు, అసభ్యత, నిస్సహాయతలే
నవ్వడానికి కారణాలు..
అలాంటిది అసలు నవ్వే కాదంటూ
స్వచ్ఛమైన నవ్వు కోసం ఓ యువకుని అన్వేషణ...

# నవ్వు



**ఈ సృష్టిలో** నవ్వే అదృష్టం ఒక్క మానవుడికే ఉందని, దానివల్లే ఆనందం, ఆరోగ్యం పొందుతాడనీ చిన్నప్పటి నుంచి వింటున్నాను. కానీ, ఈ నవ్వడం ఎలా, దానివల్ల పొందే ఆనందం ఎలా ఉంటుందని తెలుసుకోడానికి చాలాకాలంగా ప్రయత్నిస్తున్నాను. బహుశా, అనాథను కనుకే నాలో పేరుకుపోయిన నిరాశ, నిస్పృహలు నవ్వుకు దూరం చేశాయనుకుంటున్నా. అందుకే ఈ 'నవ్వు' సంగతేంటో తెల్చుకుందామనుకున్నా.

* * *

ఆ మధ్య ఒక మహానుభావుడు మనస్ఫూర్తిగా పళ్లికిలిస్తే అదే నవ్వు అని చెప్పాడు. ఇలా ఇతర జీవరాశులు ఎంత ప్రయత్నించినా చేయలేవని అన్నాడు. సరే, ఇదేదో ప్రయత్నిద్దాం. నవ్వు వల్ల వచ్చే ఆనందం లేకపోయినా, కనీసం నా నవ్వునైనా చూసుకుందామని మనసు లగ్నంచేసి, అద్దం ముందు కూర్చుని ఎంతో మురిసిపోతూ, రకరకాల హావభావాలతో పళ్లికిలించాను. ఎంత పళ్లికిలించినా, అది నవ్వులా అనిపించలేదు. పైగా అద్దం నా చిన్నపళ్లని కోరల్లా చూపిస్తూ, నా అందమైన ముఖాన్ని రాక్షసుడిలా మార్చింది. వెంటనే ఆ ప్రయత్నం విరమించాను.

* * *

చిన్నప్పుడు నా మిత్రులు చెప్పిన విషయం ఒకటి గుర్తుకొచ్చింది. కితకితల వల్ల భలే నవ్వు వస్తుందని. చిన్నప్పుడు ఎలాగూ నవ్వు రాలేదు. ఇప్పుడోసారి ప్రయత్నిద్దామనిపించింది. పొట్టలో, పక్కటెముకల్లో వేళ్లని నాట్యమాడించాను. ఊహూ! నవ్వు రాలేదు. కితకితలు మనం పెట్టుకుంటే మనకు నవ్వు రాదనిపించింది. ఇలా లాభం లేదనుకొని మా పక్కింటాయన్ని పిలిచి కితకితలు పెట్టమన్నాను. పాపం, ఆయన నాకు నవ్వు తెప్పించాలని ఓ అరగంట శ్రమించాడు. అప్పుడొచ్చింది విపరీతంగా నాకు.. నవ్వుకాదు, పక్కల్లో నొప్పి.

* * *

ఓ రోజు మా ఎదురింట్లో దొంగలుపడ్డారని పరామర్శకెళ్లాం. ఏవేవో పోయాయని వాళ్లేడిచారు. తర్వాత బైటికి రాగానే చాలామంది పెదాలు కాస్త విచ్చుకున్నాయి. వాళ్ల పళ్లు కనబడ్డాయి. వాళ్లు మనసులో ఆనందం పొందుతున్నట్లు గ్రహించాను. అప్పుడనిపించింది, ఎదుటివాడి కష్టంలో వచ్చే నవ్వులో కూడా ఆనందం ఉందని. పైశాచికానందం అంటే ఇదేనేమో? కానీ, ఇలాంటి నవ్వుల్లో వచ్చే ఆనందం నాకక్కర్లేదనిపించింది. అసలైన నవ్వుకోసం నా ప్రయత్నాలు సాగించాను.

* * *

మొన్నామధ్య నా సహోద్యోగి నాకో సలహా ఇచ్చాడు. ఊళ్లోకి జంతువులతో విన్యాసాలు చేయించే గుంపు ఒకటి వచ్చిందని, ఆ విన్యాసాల వల్ల తప్పక నవ్వు వస్తుందనీ పైగా కేతిగాడు కడుపుబ్బ నవ్విస్తాడనీ. సరేనని ప్రదర్శనకి వెళ్లాను. ఎన్నో రకాల జంతువులు రకరకాల భంగిమల్లో విన్యాసాలు చేస్తున్నాయి. నా చుట్టు పక్కలవాళ్లంతా పొట్టలు చెక్కలయ్యేలా నవ్వుతున్నారు. నాకు మాత్రం నవ్వు రావడంలేదు. ఇంతలో కేతిగాడొచ్చాడు. ఏవేవో చేష్టలు చేస్తున్నాడు. జనం మళ్లీ పగలబడి నవ్వుతున్నారు. ఊహూ! నాకు మాత్రం నవ్వురావడం







లేదు. పైకి విన్యాసాలు చేస్తున్నా, ఎక్కడో వాళ్ల మనసుపొరల్లో బాధ కనిపించింది నాకు. అక్కడింక నవ్వు రాదని నిర్ధరించుకున్నాను.

* * *

నా స్నేహితుడికి నా బాధను చెబితే, కొన్ని సూచనలిచ్చాడు. హాస్య ప్రధాన సాహిత్యం చదవమనీ, హాస్య చలన చిత్రాలు చూడమనీ. చాలా సాహిత్యం చదివాను. ఎన్నో చలన చిత్రాలూ చూశాను. చాలావరకూ వ్యక్తులనో, కులాన్నో, మతాన్నో కించపరచడమే హాస్యమన్నాయవి. మంచి సాహిత్యంవల్ల, చిత్రాలవల్ల కొంత ఆహ్లాదమనిపించినా, నాక్కావాల్సిన నవ్వును నాకివ్వలేకపోయాయి. విషయం వాడికి చెప్పాను. ఊళ్లో ఉన్న 'బురిడీ' చిత్రశాలలో ఆడుతున్న 'నవ్వకపోతే పోతావ్' చిత్రం బావుందని చూడమన్నాడు. సరే ఇదీ ప్రయత్నిద్దామనిపించింది. ఆ చిత్రం పేరు మాత్రం నన్ను బెదిరిస్తున్నట్టనిపించింది. యమరద్దీలో ఎలాగోలా లోపలికి దూరాను. ఓ సన్నివేశంలో కథానాయకుడు గోడమీద మూత్రం పోయగానే హాలంతా నవ్వులు. ఆశ్చర్యమేసింది. నాకసలు నవ్వే రాలేదు.

ఇహ లాభం లేదని ఓ మానసిక వైద్యుణ్ని సంప్రదించి చరిత్రంతా చెప్పాను. ఓపిగ్గావిని, నా పుట్టుక, ఒంటరితనమే, నాకు నవ్వు రాకుండా మనసు కరడుగట్టడానికి ముఖ్య కారణాలని తేల్చి, నోరు తిరగని ఓ రోగం పేరును నాకు అంటగడుతూ పెళ్లిచేసుకుంటే పరిష్కారం దొరుకుతుందన్నాడు. పెళ్లితో సమస్యకు పరిష్కారమా అని ఆశ్చర్యంగా అడిగిన నాకు "ఈపెళ్లి అనేది, ఆపైవాడు మనిషికి ఇచ్చిన శాపం, వరంతో కలిపిన పదార్థంలాంటిది. పెళ్లి జ్ఞానిని అజ్ఞానిని చేస్తుంది. అజ్ఞానిని జ్ఞానిని చేస్తుంది. ఉన్న గుణం పోగొడుతుంది. లేని గుణం తెచ్చిపెడుతుంది. మొత్తానికి జీవితాన్నే మార్చివేస్తుంది" అని వివరించాడు.

ఆహా! ఏమి ధర్మప్రవచనం! ఆసుపత్రికొచ్చానా ఆలయానికొచ్చానా అనిపించింది. కానీ, నాకు పిల్లను వెతికి పెళ్లి చేయటానికి ఎవరూ లేరని, అంతేకాక మరో ఐదు సంవత్సరాల వరకూ నాకా ఉద్దేశమేలేదనీ చెప్పాను. చేసేదిలేక, అతను నాకు మరో పరిష్కారమంటూ కొన్నాళ్లపాటూ ఏవో హాస్యానికి సంబంధించిన పుస్తకాలు, చిత్రాలు చూపించడం, చిత్ర, విచిత్రమైన ఆసనాలు వేయించడంలాంటి పనులు ఎన్నో చేశాడు. అయినా నా సమస్య, సమస్యగానే ఉండిపోయింది. దాచుకున్నదంతా వాడికి దోచిపెడుతున్నట్టుందని వెళ్లడం మానేశాను.

* * *

ఓ రోజు మా వీధిలో ఉండే ఓ నలుగురు పెద్దవాళ్లు ఇంటికొచ్చారు. ఆదివారంనాడు వనభోజనాల కార్యక్రమం ఏర్పాటు చేశామని చెప్పి, నన్నూ రమ్మన్నారు. ఒంటరిగాడిని, సెలవు రోజే కదా అనుకొని సరేనని బయల్దేరాను.

చుట్టూ పచ్చని చెట్లతో కళకళలాడుతూ, చిట్టడవిని తలపిస్తోందా ప్రదేశం. అన్నివైపుల నుంచి పక్షుల కిలకిలలు, కోతుల కిచకిచలు ఆహ్లాదకరంగా ఉందా ప్రదేశం.

అప్పటికప్పుడు వండిన అల్పాహారాన్ని ముందుగా దేవుడికి నైవేద్యంగా పెట్టి, ఆపై అందరికీ వడ్డించారు. అల్పాహారం తిన్న తర్వాత మా బృందంలోని ఓ పెద్దతను కార్తీకమాస విశిష్టత, వనసంతర్పణ ఆవశ్యకత గురించి ఓ గంటసేపు చక్కగా వివరించారు. ఎంతమంచి సంస్కృతి కదా మనది అనిపించింది.

ఇక, హాస్యవల్లరితో రకరకాల సరదా కార్యక్రమాలు మొదలయ్యాయి. ఒకతనులేచి, ఒక హాస్యగుళిక విసిరాడు.

"పెద్దవెంగళప్ప, చిన్న వెంగళప్పతో.. 'చిన్నాడా, చిన్నాడా మరేమో నాల్గురోజుల క్రితం నన్నో చీమకుడితే, దానికో లెంపకాయకొట్టి, ఇంకెప్పుడూ నన్ను కుట్టకు అని చెప్పి, మన సందు చివర వదిలేశా్రా. అయితే అది నిన్న రాత్రి నేను ఇంటికి వెళుతుంటే గుర్తుపట్టి కక్షతో మళ్లీ కుట్టాలని తరుముకొచ్చిందిరా.'.

'మరేం చేశావురా పెద్దాడా, ఇంటికెళ్లి తలుపేసేసుకున్నావా?' అన్నాడు చిన్న వెంగళప్ప.

'లేదురా, అది మా ఇల్లు గుర్తుపడుతుందని, పక్కింటికెళ్లి తలుపేసుకున్నా, అయినా అదెలాగో నేను దూరిన ఇంట్లోకి వచ్చేసి కుట్టేసిందిరా..' అంటూ భోరుమన్నాడు పెద్దవెంగళప్ప.

'అయ్యో! నీకెంత అన్యాయం చేశా్రా పెద్దాడా!' అంటూ వాపోయాడు చిన్న వెంగళప్ప.

'నువ్వు నాకేం అన్యాయం చేశావురా?' అన్నాడు పెద్ద వెంగళప్ప.

'మొన్న రాత్రి నేను మా ఇంటికెళుతుంటే ఆ చీమ నాకెదురొచ్చి నీ ఇల్లు ఎక్కడో చెప్పకపోతే నన్ను కుడతానందిరా. నిన్ను కాపాడాలని, మీ పక్కిల్లు చూపించి అదే నీ ఇల్లు అన్నా్రా!' అంటూ చిన్న వెంగళప్ప భోరుమన్నాడు.."

ఈ గుళికకు అందరూ నవ్వే.. నేను తప్ప.

ఈసారి ఒకావిడ లేచి మొదలెట్టింది.. 'ఆ మధ్య మా ఆయనతో కలిసి బట్టల దుకాణానికెళ్లాను. ఆరు చీరలు ఎంచుకున్న తర్వాత వాటి ఖరీదు చెప్పాడు ఆ దుకాణంవాడు. నాలుగు చీరలకు మాత్రమే డబ్బు సరిపోతుంది, రెండు చీరలు వదిలెయ్యమని మా ఆయనన్నారు. దుకాణం వాడు రెండు చీరలకు బేరం పోతోందని బేలముఖం పెట్టాడు' అంది.

ఇంతలో మరొకావిడలేచి 'మరేంచేశావక్కా? ఆరెండు చీరలు వదిలేశావా?' ఆత్రుత, సానుభూతి కలగలిపి అడిగింది.

'భలేదానివి చెల్లీ! ఆరుగంటలు కష్టపడి ఎంచుకున్న చీరలను వదిలేస్తానా! అందుకే, మా ఆయన్ని దుకాణంలో వదిలేసి, ఆ చీరలు ఇంటికి తీసుకెళ్లి, డబ్బు చెల్లించిన తర్వాత ఆయన్ని విడిపించుకున్నాను' అంది.

ఇంకో ఆవిడలేచింది. 'అదిసరే వదినా! మీ ఆయన్ని ఎలాగూ దుకాణంలో వదిలేసినప్పుడు చీరల్ని కూడా వదిలేసి ఇంటికెళ్లి మిగతా డబ్బు తీసుకురావచ్చుగా!' అంటూ అనుమానం వ్యక్తం చేసిందావిడ.

'బాగుందొదినా! చీరలను వదిలేసి మిగతా డబ్బు తీసుకురావడానికని నేనింటికెళ్తే, ఆ నాలుగు చీరలకే డబ్బిచ్చి మా ఆయన నా వెనకే వచ్చేయరూ!' అంటూ ఈవిడ సమాధానం.

ఈవిడ తెలివితేటలకు ముగ్ధులైపోయి ఆడవాళ్లందరూ పెద్దగా చప్పట్లు. మగవాళ్లూ కొట్టారు చప్పుడు రాని చప్పట్లు. పాపం ఈవిడగారి భర్తను చూసి నవ్వనివారులేరు. నాకు మాత్రం జాలేసింది.

ఇలా హాస్యవల్లరి అంటూ చాలాసేపు సాగింది. తర్వాత పొడుపు కథలు, మెదడుకు మేత, అంత్యాక్షరి, ఇంకా ఎన్నో కార్యక్రమాలు జరిగాయి. నా సంగతి తెలిసి, ఎవరూ నన్ను ఇబ్బంది పెట్టలేదు. ఒంటిగంటకి భోజనాలు వడ్డించారు. నాకైతే పంచభక్ష్యపరమాన్నంలా అనిపించింది. భోజనాలు కాగానే పిల్లలు ఆటల్లో, ఆడవాళ్లు మాటల్లో, మగవాళ్లు పేకాటల్లో పడ్డారు. నేను ఆలోచనలోపడ్డాను ఏంచేద్దామా అని. కాసేపు ఆ ప్రాంతమంతా అలా చుట్టివస్తే బాగుంటుందని బయల్దేరాను. దారంతా ఎన్నోరకాల చెట్లు దట్టంగా ఉన్నాయి. విడదీయరాని స్నేహబంధంలా, రకరకాల లతలు ఆ చెట్లను అంటిపెట్టుకొని ఉన్నాయి మీతోనే మేమూ అన్నట్లుగా. చెట్లమధ్య గుబురుగా పెరిగిన మొక్కలు ఎంతో పచ్చదనంతో, రంగురంగుల పూలతో ఆ ప్రాంతమంతా చూడముచ్చటగా ఉంది. చెట్ల నుంచి, పూలనుంచి వస్తున్న సువాసనలను ఎంత పీలుస్తున్నా తనివితీరటం లేదు. ఇంత అందమైన ప్రకృతితో మమేకమై జీవించే ప్రాణుల జన్మే జన్మ కదా అనిపించింది. కాస్తదూరంలో ఓ చెట్టు మీద ఎగురుతూ గంతులేస్తున్న కోతుల గుంపొకటి కనిపించింది. కాసేపు వాటి చేష్టలను గమనిద్దామని, అక్కడే ఓచెట్టు దగ్గర కూర్చున్నాను. అవన్నీ కొమ్మల మీద గెంతుతూ, చెట్టు విరిగిపడిపోతుందేమో అనేంతగా ఆడుకుంటున్నాయి. కొమ్మమీద కూర్చున్న ఓ కోతి తోక కిందికి వేలాడుతోంది. పక్క కొమ్మ మీద నుంచి ఇంకో కోతి ఒక్క గెంతుగెంతి, దీనితోకను పట్టుకొని వేలాడటం మొదలెట్టింది. కాసేపు ఊగిన తర్వాత అది కొమ్మ మీదికి ఎగిరి తన తోకను వేలాడదీసి ఇందాకటి కోతికి ఊగే అవకాశమిచ్చింది. ఇప్పుడు ఆ కోతి దీనితోకను పట్టుకొని ఊయలూగడం మొదలెట్టింది. మరికొన్ని ఒకదానిమీద ఒకటి ఎక్కి కూర్చొని కొమ్మల మీద వేగంగా గెంతుతున్నాయి. గిరికీలు కొడుతూ చాలా తమాషా చేష్టలు చేస్తున్నాయి. ఈ చేష్టలన్నీ గమనిస్తున్న నా మెదడుకు ఏవో సంకేతాలందుతున్నాయి. నా నరాలు ఉత్తేజితమవుతున్నాయి. నా పెదాలు కాస్త విచ్చుకున్నట్లు అనిపిస్తోంది. ఏదో హాయి కలుగుతోంది. నా దృష్టి కాస్త చెట్టుకిందికి మళ్లింది. అక్కడ, ఓ తల్లికోతి సేదతీరుతోంది. దానిచుట్టూ ఓ అయిదారు పిల్లకోతులున్నాయి. అవిచాలా ముద్దుగా ఉన్నాయి. ఓ కోతిపిల్ల వాళ్లమ్మ తోకను కొరుకుతూ ఆడుకుంటోంది. తల్లికోతికి ఇబ్బందిగా అనిపించి తనతోకను లాక్కునేంతలో, ఇంకో కోతిపిల్ల వాళ్లమ్మ చెవులు కొరుకుతూ ఆడుతోంది. ఈ పిల్లకోతిని తరిమేంతలో, మరో పిల్లకోతి వాళ్లమ్మ వీపుమీద ఎక్కి గెంతడం మొదలెట్టింది. తల్లికోతి చిరుకోపం ప్రదర్శిస్తూ అన్నింటినీ దూరంగా తరిమింది. మళ్లీ కొంతసేపటికి, ఈ కోతిపిల్లలన్నీ కాళ్లు లాగడం, తోక కొరకడంతో తల్లికోతి ఓ పిల్లకోతిని పట్టుకొని దానికి నొప్పి లేకుండా పళ్లతో కొరుకుతూ, నాతోకాదు మీలో మీరు ఆడుకోండి అన్నట్లు ప్రేమతో బెదిరించింది. అవి దూరంగా జరిగినట్టే జరిగి అదనుచూసుకొని మళ్లీ తల్లి దగ్గరే ఆడుతున్నాయి. ఇలా, ఓపదిసార్లు వాటి చేష్టలను గమనించిన నాకు ఒక్కసారిగా ఫెళ్లుమని నవ్వొచ్చేసింది. అలా ఎంతసేపు నవ్వుతూ ఉన్నానో నాకే తెలియటం లేదు. మనసంతా చెప్పలేని ఆనందం నిండుతోంది. కళ్లలోంచి నీళ్లు కారుతున్నాయి. ఆనందబాష్పాలంటే ఇవేనని మొదటిసారిగా తెలిసింది. ఇంతలో, ఇంకోచెట్టుమీద పక్షులు కూడా ఒకదాని మీదినుంచి ఇంకొకటి గెంతుతూ, గాలిలో గిరికీలు కొడుతూ చేస్తున్న తమాషాలకి, నా నవ్వు మరింత ఎక్కువైంది. మనసంతా ఆనందంతో దూదిపింజలా తేలిపోతోంది. ఆహా! ఈ ప్రకృతి వల్ల నేను జీవితంలో మొదటిసారిగా నవ్వగలిగాను. ఇన్నాళ్లూ, నాకు నవ్వు ఎందుకు రాలేదో అర్థమైంది. లేనివి కల్పించడం, ఒకరినొకరు కించపరచుకోవడం వల్ల వచ్చే నవ్వు యాంత్రికమవడమే దానికి కారణమని తెలిసింది. ఇప్పుడు లభించిన నవ్వు, దానివల్ల పొందిన ఆనందంతో జీవితమంతా గడిపేయవచ్చు. ఇక నేను బయలుదేరాలని గుర్తొచ్చింది. నిలబడి నాకు నవ్వును ప్రసాదించిన ప్రకృతి మాతకు చేతులు జోడించి నమస్కరించాను. చెప్పలేని ఆనందం నిండిన మనసుతో మా బృందాన్ని కలిశాను. మాటల్లో వర్ణించలేని ఆనందంతో వెలిగిపోతున్న నా ముఖాన్ని చూస్తూ అందరూ ఆశ్చర్యపడ్డారు. జరిగిన సంగతి చెప్తే, ఇన్నాళ్లకు నేను నవ్వుకోగలిగానని అందరి నుంచీ అభినందనలే. బట్టల దుకాణంలో ఉండిపోయిన భర్తగారైతే నన్ను కౌగిలించుకొని మరీ ప్రత్యేకంగా అభినందించారు. బహుశా వాళ్లావిడ హాస్య గుళిక విసిరినపుడు ఆయనను చూసి నేను మాత్రమే నవ్వనందుకు కావచ్చు..!



**వి.సి.ఎస్.ఎస్.వి.శ్రీనివాసు**
హైదరాబాదు. 83748 46248

## మల్లెమొగ్గ



ఏటి ఒడ్డున
ఒంటికాలుపై
నిలబడ్డ కొంగని
తలకిందులుగా
చూస్తున్నట్టు
చెవి మహారాణికి
చెలికత్తెలా
ఆ ముత్యపు లోలాకు
ఆమె చెవికి వేలాడుతున్న
పాలబొట్టులా
తెల్లగా ఊగుతూ ఊగుతూ
దృష్టిలోగిలిలో ఒలికిన శ్వేత గంధం
గుండెనిండా గుప్పెడు ఊహలు
గుమ్మరించిన
ఆ తుంటరి
రాత్రిళ్లు పరుచుకున్న పక్కమీద
అటూఇటూ దొర్లుతూ
నల్లని నిద్ర నలిపేసి
కవిత్వమై పూసిన మల్లెమొగ్గ

- **జి.రామకృష్ణ**, భూదాన్ పోచంపల్లి,
నల్లగొండ. 89774 12795

KRSA101M243



**మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M243 |
| పుస్తకం పేరు | తెలుగు వెలుగు |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Shukshu |
| పేజీలు విడదీసినది | Shukshu |
| స్కాన్ చేసినది | K.Daveen |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |